# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి



# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం ! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్థిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

### ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

### బ్రాంచిలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్, హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్, సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్, లబ్బీపేట్, విజయవాడ.
- జగదాంబ జంక్షన్, విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్, గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్, కాకినాడ.
- నెహ్రూ రోడ్, కర్నూలు.
- వైరారోడ్, ఖమ్మం.
- నరసింహారావ్‌పేట ఏలూరు.

డబ్బుకోసమైనా మీ చింత! మార్గదర్శి ఉన్నది మీ చెంత!!




## మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిద్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

# ప్రతి వొక్కరూ సితార

# See రియల్‌ని ఎందుకు



**'సితార' కోసం...** 'సితార' ఏంచేసినా దానికో విశిష్టత వుంటుందని మొదటినుంచీ నా నమ్మకం. లోగడ 'సితార' చేసిన 'ప్రేక్షకులకి ఎలాంటి సినిమాలు కావాలి' అనే అభిప్రాయసేకరణ, 'ఫొటోసీరియల్' వంటి కొత్త శీర్షికలు నాకు నచ్చాయి. 'క్లైమాక్స్' Seeరియల్ 'సితార' చేస్తున్న మరో కొత్తప్రయోగం ఇదీనాకు నచ్చినదే. అందుకే అంటాను 'సితార'కి ఎప్పుడూ విక్టరీనే అని!



**అందరినీ చూసి...** సాధారణంగా నేను పత్రికలు చదవను. అయితే 'సితార'లో వస్తున్న 'క్లైమాక్స్' సీరియల్ గురించి మా ఆఫీసులోవాళ్ళంతా గొప్పగా చెప్పుకోవడం చూసి నేను ఇదేమిటో చూద్దామని 'సితార'కొని చదివాను. నిజంగానే నాకూ ఇది ఎంతో గొప్పగా అనిపించింది. దీసీజ్ రియల్లీ సూపర్బ్.



**అసభ్యత, అశ్లీలత లేదని...** అసభ్యత, అశ్లీలత లేని రచనలు, పత్రికలు కనబడని నేటి రోజుల్లో 'సితార', అందులోని 'క్లైమాక్స్' సీరియల్ కుటుంబసమేతంగా చదువుకోగలిగేట్టు వుంటున్నాయి. అందుకే నేను దీన్ని ఎంతగానో ఇష్టపడుతున్నాను. ఒక్కనేనే కాదు- మాఇంట్లో వాళ్ళందరూ కూడా.



**ఆసక్తి కల్గించే కొత్త ప్రయోగమని...** ముందేం జరుగుతుందోననే ఉత్కంఠకల్గిస్తూ సాగేదే మంచి సీరియల్ అని నా అభిప్రాయం. 'క్లైమాక్స్' సీరియల్‌కి సంబంధించి రచయిత, సినీతారలు జరిపే చర్చల్లో ముందుముందు రాబోయే పాత్రలగురించీ, సన్నివేశాలగురించీ ప్రస్తావన వస్తోంది. ఇది ఆసక్తి కలిగిస్తూ నాచేత చదివిస్తోంది- ఏవారం మిస్‌కాకుండా!

# 'దైవప్రతినిధులు'పై

# చతుర సమీక్షలు

'చతుర' నవలల పోటీలో ప్రత్యేక నవలగా ఎన్నికై అక్టోబరు సంచికలో ప్రచురితమైన 'దైవప్రతినిధులు'పై మాకు అందిన 'చతుర' సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము. ఈ శీర్షికలో పాల్గొన్న పాఠకులందరికీ మా కృతజ్ఞతలు. బహుమతులు పొందినవారికి మా అభినందనలు!

## అసమగ్ర స్వరూపం

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

**భా**రతదేశం తొలినుంచీ ఆధ్యాత్మిక చింతన కలిగిన దేశం. ఇక్కడ పుట్టిన ఎందరో యోగులు, భక్తులు, తపస్వులు తమ ఔన్నత్యంతో తమ జీవితాలను ఒక పద్ధతిలో గడిపి, ఇతరులనూ ఉద్ధరించారు. సమీపగతంలో అరవింద మహర్షి, రామకృష్ణపరమహంస, శారదాదేవి, వివేకానందుడు, రమణమహర్షి వంటి అనేకులు ఇందుకు ఉదాహరణ. వీరంతామహావ్యక్తులు. వీరి వ్యక్తిత్వాలవల్ల ఎందరి జీవితాలో ప్రభావితమయ్యాయి.

ఐతే, కాలక్రమేణా మారిన మనుషుల స్వభావాలవల్ల అన్నిరంగాలలోనూ చోటుచేసుకున్న మోసం, కుటిలత్వం, ద్రోహం ఆధ్యాత్మిక రంగంలో కూడా ప్రవేశించాయి. స్వార్థపరులు, వంచకులు అయినవారు భగవంతుడిమీద నమ్మకాల్ని ధనార్జనకు వాడుకోవడం క్షమించరాని నేరం. భగవంతుని పేరు చెప్పగానే వినమ్రత ప్రదర్శించే భారతీయుల స్వభావాలను అవకాశంగా తీసుకుని, సమాజాన్ని వంచించే ఇటువంటి ద్రోహుల స్వరూప స్వభావాలను 'దైవప్రతినిధులు' నవలలో రచయిత విపులంగా వివరించారు. ఇటువంటి బూటకలచాటున ఎన్నెన్ని ఘోరకృత్యాలు జరుగుతున్నాయో ఉదాహరణ ప్రాయంగా చెప్పారు.

చట్టంతో శాసించలేని అంశాలలో ఇది ఒకటి. ప్రభుత్వ అధికారయంత్రాంగం ఈ పరిస్థితిని సరిదిద్దడానికి అంతగా ఉపకరించదు. తాము గొప్పవారుగా నమ్ముతున్న వ్యక్తులు దొంగలని మరీ బహిరంగంగా ఋజువైతే తప్ప భక్తులు నమ్మరు.

భక్తి, దైవచింతన, తాత్విక దృష్టి పట్లగల గౌరవాన్ని అడ్డంపెట్టుకుని లాభం పొందడంకోసం అడ్డదారులు తొక్కేవారు ఉండబట్టే. నిజమైన ఆధ్యాత్మిక జీవనం గడిపే ఉత్తమ





వ్యక్తులపట్ల కూడా సమాజానికి నిరసన భావం ప్రబలుతూంది. సామాన్య ప్రజలకు ఎవరెటువంటివారో తెలుసుకోవడం దుస్సాధ్యం. మతం, దైవం, భక్తివంటి భావాలు నేడు గర్హనీయమైన వస్తువులుగా, వివాదాస్పద విషయాలుగా భావించబడుతున్నాయి. ఐతే, రచయిత ఈ విషయాన్ని సుస్పష్టంగా చర్చించలేదు. కేవలం ఈ సమస్యయొక్క ఒక పార్శ్వాన్నే పరామర్శించడం జరిగింది. ఒక సామాజిక సమస్యగా మారిన ఈ అంశంయొక్క పూర్తి స్వరూపాన్ని దర్శింపజేయలేదు.

సమస్యను వివరించడమేగాదు, దానికిగల కారణాలను, పరిష్కార మార్గాన్నీ సూచించడం కూడా సామాజిక బాధ్యతగల రచయిత కర్తవ్యం. అది కూడా నిర్వర్తించబడి ఉంటే ఈ నవలకు పూర్తి న్యాయంచేకూరేది.

వైదిక మతం బోధించిన కర్మ సిద్ధాంతం, యుగయుగాలుగా మన ప్రజలకు, తనకున్న దానితో తృప్తిపడటం, ఉన్నంతలో ఇతరులకు దానధర్మాలు చేయడం, అత్యాశకు పోకుండా సన్మార్గాన జీవించడంవంటి జీవన విధానాన్ని నేర్పింది. ఆధునికత ప్రభావంవల్ల పూర్వపు విలువలు నశించడం, మానవులలో స్వార్థం, అత్యాశ, ఏదోవిధంగా అంతులేని డబ్బు సంపాదించాలనే కాంక్ష పెరగడం, మతంపట్ల, నిజమైన విశ్వాసం నశించడంవల్ల వచ్చిన ఫలితాలివి.

- క్రొవ్విడి సూర్యనాగశమంతకమణి
అమలాపురం

## ఉద్వేగ భరితం

**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

చిన్నతనంనుంచే మన బుర్రల్లో ఎన్నో గుడ్డినమ్మకాల్ని నాటారు. మహిమలూ, అతీతశక్తులూ, అద్భుతశక్తులూ వుంటాయని, కొందరు మనుషులకూ, దేవుళ్ళకూ, స్థలాలకూ అద్భుత శక్తులు వున్నాయని నమ్మించారు. మతం పేరుతో మన పెద్దలు చాలా తప్పుడు జ్ఞానాన్ని ప్రవేశపెట్టారు. మనం పెరిగి పెద్దయ్యేటప్పటికి మన బుర్ర ఎంతోకొంత తప్పుడు జ్ఞానంతో నిండివుంటుంది. అటువంటప్పుడు నిస్సాక్షికమయిన మాటలు విన్నా చదివినా కొంత కష్టంగానేవుంటుంది. అలాంటివారి అమాయకత్వాన్ని, అజ్ఞానాన్ని పోగొట్టటానికి కృషిచేసే వారికి "దైవప్రతినిధులు" నవల ఎంతో కొంత వుపయోగపడుతుంది. ఆధునికంగా మారుతున్నకొద్దీ మనం ఎంత అజ్ఞానానికిలోనవుతున్నామో రచయిత చక్కగా వివరించారు.

నీల్‌ఆర్మ్‌స్ట్రాంగ్ చంద్రమండలంమీద దిగినప్పుడు గొడ్డు మాంసంతినే "అమెరికావాడు" దిగటంవల్ల చంద్రుడు అపవిత్రుడయ్యాడనీ, చంద్రుణ్ణి మరల పరిశుద్ధుణ్ణి చేయాలనీ ఢిల్లీలో ఒక ధనిక స్త్రీ రెండులక్షల రూపాయలతో ఒక యజ్ఞం చేసింది.

టిబెట్ ప్రజలు "దలైలామా" బుద్ధుని అవతారమనీ, అద్భుతశక్తులున్నాయనీ నమ్మేవారు. దలైలామా శరీరానికేకాదు. ఆ శరీరంలో నుంచి వచ్చే మలమూత్రాలకు కూడా అద్భుత శక్తులున్నాయని నమ్మేవారు. దలైలామా దొడ్డికి వెళ్ళాలంటే ఒక స్పెషల్ బక్కెట్‌లో మలం పడిలేవాడు. తర్వాత ఆ మలంలో కొన్ని మూలికలు కలిపి బిళ్ళలుగా తయారుచేసి చాలా ఎక్కువధరలకు అమ్మేవారు. దలైలామా మలంతో తయారుచేసిన ఆ మందుబిళ్ళులేని టిబెట్ కుటుంబం వుండేదికాదు. ఆ బిళ్ళలకు అద్భుతమయిన మహిమలుంటాయనీ, జబ్బుల్ని నయంచేస్తాయనీ భావించేవారు. టిబెట్‌ని చైనా ఆక్రమించిన ఫలితంగా దలైలామా భారతదేశంవచ్చి ఇక్కడ ఆశ్రయం పొందవలసివచ్చింది. భారతదేశం వచ్చాక అతని మలానికేగాదు, మనిషికే విలువ లేకుండా పోయింది. ఎందుకంటే భారతీయులు ఆ మహిమలన్నీ అవుపేక్షలో చూస్తారు.

అద్భుతశక్తులు, అతీతశక్తులు వున్నాయని చెప్పేవారిని,వారి మహిమలనే ట్రిక్కో నమ్మేవారు ప్రపంచమంతా వున్నారు. అలాంటి వారి గురించి సునిశితంగా ఆలోచింపజేసే విధంగా రచించిన "రమేష్"గారికి కృతజ్ఞతలు. మొదటి నవలే అయినా ఎంతో అనుభవమున్న రచయితలా కొనసాగించిన ఈ రచన చదువుతున్నంతసేపూ ఆసక్తిగా, ఉద్వేగభరితంగా వుంది.

- డి.శ్రీనివాస్
విజయవాడ

## • లోపించిన వాస్తవికత

*(తృతీయ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

**దే**వుని అవతారాలుగా, దైవప్రతినిధులుగా చెప్పుకుంటూ ప్రజల అజ్ఞానాన్ని బలహీనత ను క్యాష్‌చేసుకుంటూ బతికే "మహాత్ముల" బండారాలను బైటపెట్టే ప్రయత్నం చేశారు రచయిత ఈ 'దైవప్రతినిధులు' నవలలో. ఇదే ఇతివృత్తాన్ని మూలంగా చేసుకొని గతంలో కూడా కొన్ని రచనలు వచ్చాయి. కాబట్టి మూల కథలో వైవిధ్యం అంతగా గోచరించలేదు. రచ నాశిల్పంకూడా ఏమాత్రం పటిష్ఠంగాలేదు. రచయిత ఏంచెప్పదలచుకున్నారనేది ముందుగానే స్పష్టం అవుతుండటంచేత ఆస క్తి కొరవడుతున్నది. అలాంటప్పుడు రచయిత కథను నడిపించే విధానం, రచనా శిల్పం బాగుంటే కనీసం "చదివించే గుణం" అయినా వుండేది రచనకు. రచయిత ఆ జాగ్రత్త తీసుకోలేదు.

అమాయకత్వంతో, అజ్ఞానంతో బాబాల, యోగుల మాయలో పడిపోతున్న ప్రజలను రక్షించాలనే రచయిత ఆశయం ప్రశంసనీయ మేకాని, దాన్ని స్పష్టం చేయడానికి రచయిత కథలో సృష్టించిన సంఘటనలు, నడిపించిన సన్నివేశాలు సహజంగా లేవు. దేవి ఆజ్ఞకాగానే ఆలోచనారహితంగా కన్నకుమార్తెలను "సమ ర్పించుకునే" స్థాయిలో మన ప్రజలు ఇంకా వున్నారంటే సందేహాస్పదమే! ఈనాడు బాబా లు, యోగులు ప్రజలను దోపిడీ చేస్తున్నా అదంతా ఎంతో రహస్యంగా, ఏమాత్రం అను మానం కలగని రీతిలో జరుగుతున్నది. కాని ఈ రచనలో దేవి, అతని కుమారుడు శ్రీధర్‌ల ప్రవర్తన సినిమాల్లోని విలన్, అతని రహస్యగృ హాన్ని గుర్తుచేస్తున్నదేకానీ ఒక ఆశ్రమం, ఆ వాతావరణం సృష్టించడంలో విఫలమయ్యా డు రచయిత. దేవి రహస్యాలను బైటపెట్టటా నికి ప్రదీప్, నరేంద్ర, దినేష్‌ల ప్రయత్నాలు అసహజంగా వున్నాయి. సాధ్యా సాధ్యాలను విస్మరించగలిగితే తప్ప ఆ సన్నివేశాలను అంగీకరించడం కష్టం! కథ పూర్తయింది అనుకునేలోగా రవిబాబుగాథతో మళ్లీ ప్రారంభ మౌతుంది. అదో అసహజగాథ. బ్లాక్ మెయి లింగ్ ఆధారంగా కొనసాగిన ఈ కథలో సినిమా ఛాయలు తప్ప వాస్తవికత కనిపించదు.

- ఎ.సి.నీరజ
కావలి

## అవగాహనా లోపం

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

**"దై**వ ప్రతినిధులు" నవలలో పాత్రపోషణ బలహీనంగావుంది. బాబాల గురించి పూర్తి అవగాహన రచయితకులేదు. ఒక్కొక్క బాబా చేసే వేర్వేరు చిత్రవిచిత్ర మహిమలు చాలా మందికి అర్థంగాక, మోసంలోనో, అయోమ యంలో పడిపోతున్నారు. దేవి పాత్రచిత్రణలో సరైన అవగాహన లేదు. అన్నిరోజులుగా గర్భ గుడిలో దాక్కొన్న రాజుని ఎవరూ గుర్తించలేక పోవడం ఆశ్చర్యంగా వుంది. పదివేలు ఖర్చు అవుతుందంటే వీరయ్య ఏమాత్రం ఆలో చించకుండా తెచ్చి ఇవ్వటం మరో అసంద ర్భం.

కేవలం కొన్ని లక్షలకోసం ప్రేమించిన జంటను విడదీసి తన కొడుక్కు పెళ్ళి చెయ్యా లనుకోవడం అవివేకంగా కన్పిస్తుంది. సు కుమార్‌ను చంపటం కూడా అలాంటిదే. దేవు నికి నైవేద్యం ఇచ్చిన అమ్మాయిని మంత్రికి అప్పజెపుతారు. అతనికి అది అరవయ్యొవ శోభనం అంటారు. మరి మిగతా ఏభైతొమ్మిది మందిని వీరే సప్లై చేసారా? రవికుమార్ దైవప్రతినిధి కావటం, ఆ తర్వాత సజీవస మాధి అయ్యాడని చెప్పి అతన్ని చంపాలనుకో వటం కేశవరావు అవివేకంగా అనిపిస్తు ంది. ప్రజల మూఢనమ్మకాలను చక్కగా అభివర్ణించారు. అయితే 'థీమ్' చిన్న కథను నవలగా సాగదీశారేమో అన్పించుతుంది. ఈ నవల చదివి ఏకొద్ది మంది మూర్ఖులైనా మారితే నవలా ప్రయోజనం నెరవేరినట్లే.

—ఆర్. ప్రణయప్రకాశ్
నంద్యాల.

## మినీ చతుర చౌర్యం

*(రు: 25/- బహుమతి పొందిన లేఖ)*

**'చతుర'** అక్టోబరు సంచికలోని 'ఉమా యమ్మార్సి' నాయధేయుడు రాసిన మినీకథ





“యాత్రానుభవాలు” శుద్ధకాపీ కథ. ముళ్లపూడి వెంకటరమణగారి “నవ్వితే నవ్వండి” అనే పుస్తకం139/వ పేజీలోని జోక్ అది. ఇలాంటి రచయిత నామధేయుల్ని పత్రికల వారంతా కలసి బహిష్కరించటం ఉత్తమం.

**- యార్లగడ్డ బ్రహ్మయ్యచౌదరి**
సామర్లకోట

## సందేశం మంచిదే

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

‘దైవప్రతినిధులు’ కథాంశం సందేశం ఇవ్వడిగా బాగానేవున్నా, కథను మలుపులు తిప్పడంలోనూ, సంఘటనల సృష్టిలోనూ ‘సినిమా వాసన’ తగులుతోంది. రచయితకు బహుశా ఇది కొత్త కావచ్చు.

అపరిపక్వ సన్నివేశాలు నవలలో కొల్లలు. అయినా మనం నవల పూర్తిగా చదివామూ అంటే ఎన్నుకున్న కథ బాగుండటమే కారణం! దేవుళ్ళ, దేవతల పేర్లుచెప్పి తమ పబ్బంగడుపుకునే ఎందరో మోసగాళ్ళ చీకటి చరిత్రకు ఈ నవల అద్దంపడుతుంది! ‘భక్తి’ ముసుగులో నేరాలు, ఘోరాలుచేసే ఘరానా దొంగల బండారాన్ని బట్టబయలు చేస్తుంది. అయితే కథ అక్కడక్కడా ‘జంప్’ అవుతుంది. ఓ ‘దేవి’ కథ ముగియగానే, మరో దేవుడు రవిబాబు కథ ప్రారంభమవుతుంది. నవల అనవసరంగా పొడిగించబడినట్టు పాఠకుడు తేలిగ్గా గ్రహిస్తాడు.

రచయిత ‘దేవుడున్నాడా లేడా?’ అనే చర్చలోకి దిగకపోవడం గమనార్హం. దేవుడున్నా, లేకున్నా ఏకాగ్రతవలన మానసిక ప్రశాంతి లభిస్తుందనేది వాస్తవమేకదా!

ఏమైనా భక్తి మాయలోపడి, విధి నిర్వహణను నిర్లక్ష్యంచేసే ప్రభుత్వ అధికారులు, మూఢనమ్మకాల ఊబిలో నిరంతరం మునిగే అజ్ఞాన జనం మేల్కొని ‘దైవప్రతినిధులు’గా చెలామణీ అయ్యే మోసగాళ్ళ భరతంపట్టాల్సిన అవసరం ఎంతైనా ఉందని ఈ నవల చదివాక అనిపిస్తుంది.

**- గోలి గురుప్రసాదరావు**
రామవరం

# కట్నం

"ఇదిగో సుజాతా! మీవాళ్ళు ఇవ్వాల్సిన కట్నం డబ్బు సంగతి ఏమయింది?" కోపంగా అడిగాడు కుమార్ భార్యని.

"నన్ను ఏంచేయమంటారు చెప్పండి? పెళ్లినాడు మీకు ఇస్తానని చెప్పి ఎగనామం పెట్టిన ఆ పాతికవేలూ మావాళ్లదగ్గర్నుంచి ఎలా వసూలు చేసుకురావాలో నాకేం అర్థం కావడంలేదు" బెంబేలుగా అంది సుజాత.



"హుఁ... మీ నాన్న ఇంత నమ్మకద్రోహం చేస్తాడనుకోలేదు. నేనే స్వయంగా వెళ్ళి తాడో పేడో తేల్చుకొస్తాను!" కోపంతో చిందులు తొక్కుతూ చెప్పాడు కుమార్.

"మీ ఇష్టం!" ముభావంగా అంది సుజాత.

అన్నట్లుగానే మధ్యాహ్నం భోజనం ముగించి రెండు జతలబట్టలు బాగ్‌లో కుక్కుకొని మామగారి ఊరికి బయల్దేరాడు కుమార్.

పెళ్ళిళ్ళ సీజన్ కావడం మూలాన బస్సులన్నీ కిక్కిరిసి ఉన్నాయి. అతికష్టంమీద టికెట్ దొరికింది కుమార్‌కు.

మూడు గంటలు అతిభారంగా గడిచాయి.

మామగారి ఊరు చేరుకొనేసరికి సాయంత్రం నాలుగ్గంటలయ్యింది.

రిక్షా బేరమాడుకొని ఉసూ ర్‌మంటూ కూలబడ్డాడు అందులో కుమార్.

"ఎవరూ...?" అంటూ బయటికొచ్చింది కుమార్ అత్తగారు భ్రమరాంబ రిక్షా చప్పుడుకి.

"నేనే అత్తగారూ!" అంటూఆవిడతో లోపలకు నడిచాడు కుమార్.

'రా నాయనా!' అంటూ ఇంట్లోకి నడిచింది డెబ్భయ్యేళ్ల భ్రమరాంబగారు.

"మామయ్యగారు ఇంట్లోలేరా?" ఇల్లంతా కలియజూస్తూ అడిగాడు కుమార్.

హాల్లో టి.వి. ఫ్రిజ్, గదిలో ఎయిర్‌కూలర్ అన్నీ ఉన్నాయి. అత్తగారింటి ఆర్థిక పరిస్థితిని అంచనా వేయడంలో మునిగిపోయాడు కుమార్.

"మీ మామయ్య పొలం వెళ్ళారు నాయనా! మరో గంటలో వచ్చేయవచ్చు! అన్నట్లు అమ్మాయి, పిల్లలు క్షేమమేనా?" అడిగింది అత్తగారు.

"ఆ... క్షేమమే!" ముక్తసరిగా చెప్పాడు కుమార్. మామగారు ఎప్పుడొస్తాడా! ఆయన్ని పట్టుకొని ఎలా దులిపేద్దామా అని అతడికి ఒకటే ఆతృతగావుంది. తల్లిదండ్రులకు ఒక్కతే ఆడపిల్లకదా కొడుకుతోపాటు ఆస్తి పంచకపోతారా అని సుజాతను చేసుకొంటే ఇవ్వాల్సిన కట్నం కూడా ఎగ్గొట్టిన అత్తమామల మీద పీకల్దాక వచ్చిన కోపాన్ని అతిర

ష్టంమీద మింగుతున్నాడు.

"స్నానం చేస్తావా నాయనా? టాయిలెట్‌లో హీటర్ ఉందిలే...!" చెప్పింది అత్తగారు.

పల్లెటూళ్ళక్కూడా హీటర్లొచ్చేశాయన్నమాట అనుకుంటూ మారుమాట్లాడకుండా టవల్ తీసుకొని బాత్రూంలో దూరాడు కుమార్.

స్నానం ముగించి ఈజీ ఛెయిర్లో కూర్చొని విశ్రాంతి తీసుకొంటూండగా మామగారు చేతికర్ర ఊగించుకొంటూ వచ్చారు.

అల్లుణ్ని చూస్తూనే యోగక్షేమాలు అడిగి, ఆ తర్వాత భార్యని కేకేసి ఇద్దరికీ భోజనం వడ్డించమని పురమాయించారు.

డైనింగ్ టేబుల్‌మీద అత్తగారు వడ్డించిన చికెన్ తింటూ తను వచ్చిన విషయం బయట పెట్టాడు కుమార్- "నా పెళ్ళినాడు కట్నంగా మీరిస్తానని వాగ్దానం చేసిన పాతికవేలూ ఇన్ని సంవత్సరాలు గడిచినా ఇవ్వకపోవడం నిజంగా శోచనీయం. ఆ డబ్బు నాకిప్పుడు అత్యవసరంగా కావాలి. అదీ నా స్వంతానికికాదు, మా పెద్దమ్మాయి జలజకు సంబంధం ఖాయమయింది. మీ రివ్వాల్సిన పైకం ఇస్తే దానికి కట్నంగా చదివిద్దామని...!"

— కె. హరిబాబు

# హీరో

"నమస్కారం సార్!"

తలెత్తి చూశాను.

ఆ వెధవే!

సరిగ్గా ఇది నూటఎనిమిదోసారి – వాడిని చూడటం. అసలీమధ్య నిద్రలోకూడా పీడిస్తున్నాడీ మహానుభావుడు. వాడికి నా సర్కస్ కంపెనీలో ఏదైనా ఉద్యోగం ఇవ్వాలట.

ఓసారి కిందనుండి పైకి చూశాను. సుమారు అరవైఏళ్ళు వుంటాయి అతనికి. వంగిపోయిన నడుము, మాసిపోయిన గడ్డం, గుంటలుపడ్డ కళ్ళు –

...ఆలోచించాను. స్టేజీపైకి ఎలాగూ పనికిరాడు! సరిగ్గా అప్పుడు తట్టిందో ఆలోచన — బ్రిలియంట్ ఐడియా!

మా సర్కస్‌లో గొరిల్లాల జంట నృత్యప్రదర్శన ఓ ప్రత్యేక ఆకర్షణ. అయితే ఈమధ్యే ఆ గొరిల్లా జంటలో ఓ గొరిల్లా చచ్చిపోయింది. ఇతగాడికి ఆ తొడుగువేసి ప్రదర్శన జరిపితే?...

ఈ ఆలోచన వొచ్చిన వెంటనే అతన్ని దగ్గరగా పిలిచి అసలుసంగతి చెప్పాను.

ఆనందంగా ఒప్పుకున్నాడు. పోతే ఆ పనికిగాను తనకు ట్రయినింగులు గట్రా అవసరంలేదనీ ఆ సాయంత్రమే ప్రదర్శన ఇవ్వగలననీ ధీమాగా చెప్పాడు. అతన్ని చూస్తే అత



న్నింతకుముందెప్పుడో చూసినట్టుగా అని పించింది. కాని ఎక్కడో గుర్తుకురాలేదు. బహుశా వేరే సర్కస్ కంపెనీలో పనిచేశాడేమో.

★ ★ ★

ఆదివారంగనుక సాధారణంగా వచ్చే ప్రేక్షకులకు రెట్టింపు వచ్చారారోజు.

ప్రదర్శన ప్రారంభమైంది. ఒక్కో అంశమే జరుగుతోంది. ప్రేక్షకులంతా ఆసక్తిగా చూస్తున్నారు. చివరిగా వచ్చింది అందరూ ఆత్రంగా ఎదురుచూస్తున్న గొరిల్లాల డాన్స్ ప్రోగ్రాం!

రెండు గొరిల్లాలనూ తెచ్చి డయాస్‌మీద వదిలారు. రెంటికీ తేడా పెద్దగా లేదు. ఆ విధంగా వాటికి మేకప్ చేసినందుకు మా మేకప్‌మాన్‌ను మనస్సులో అభినందించాను.

నెమ్మదిగా మ్యూజిక్ మొదలైంది. సంగీతానికి అనుగుణంగా గొరిల్లాలు డాన్స్ మొదలుపెట్టాయి. చూస్తుండగానే సంగీతపు హోరు తారాస్థాయిని చేరుకుంది.

సరిగ్గా అప్పుడు— అప్పుడు చూశాను తేడా!

చాలా చిన్న తేడా— కానీ స్పష్టంగా కనిపిస్తోంది. వాడు ఆ ఆడగొరిల్లాతో సమానంగా గెంతలేకపోతున్నాడు. అదేమో రెట్టించిన ఉత్సాహంతో స్టేజీని విరగతొక్కుతోంది. చప్పున చూశాను ఆడియన్స్‌వంక. వాళ్ల ముఖాలలో కొంత అసంతృప్తి.

నేను నెమ్మదిగా బఫూన్ వేషగాడిచేత కబురు అందించాను. "ఇంకాస్త జోరుగా డాన్స్‌చేయాలి" అని.

అంతే! విజృంభించాడతను. అదిచూసి ఆడ గొరిల్లా కూడా విజృంభించింది.

ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు.

ప్రదర్శన విజయవంతం అయింది.

ప్రదర్శన అయాక అభినందనపూర్వకంగా అతనివైపు చూస్తూ అడిగాను— "మీరు ఇంతకుపూర్వం ఏ సర్కస్ కంపెనీలోనైనా పనిచేశారా?"

చిన్నగా నవ్వి చెప్పాడతను- "అబ్బె— ఎందులోనూ చెయ్యలేదండీ, కానీ అదృష్టం కలిసొచ్చినరోజుల్లో తెలుగు సినిమాల్లో హీరో వేషాలు వేసేవాడిని. అప్పుడు ఇంతకన్నా బాగా డాన్సులు చేసేవాడిని" అన్నాడతను.

అప్పుడు గుర్తొచ్చింది నాకు — అతన్నెక్కడ చూశానో!!

— చిరుమామిళ్ల మనోహర్

# పాపం! పసివాడు!

మధు ఆత్రంగా అడుగులేస్తున్నాడు.

ఆఫీసుకు బాగా లేటయింది. వెధవ నిద్ర. ఓ పట్టాన వదలదు. లేవడమే ఆలస్యం. లేచి తయారయ్యేసరికి ఈ టైంఅయింది.

బస్టాప్ కొచ్చేసరికి ఒక్క బస్సూలేదు. అరగంట వేచి వేచి విసుగొచ్చి వెనుదిరిగేసరికి అప్పుడొచ్చింది పాడుబస్సు.

జనాల్ని చీల్చుకొని లోపలకు దూరేసరికి...ఎదురుగా (బస్ కిటికీలోంచి) తననే చూస్తూ నవ్వుతోన్న రామరత్నం.

రామరత్నం!

తమ ఆఫీసరుగారమ్మాయి. అడపాదడపా తండ్రికోసం ఆఫీసుకొచ్చి, ఆ పక్కనేవున్న తనని చూసీచూడనట్టు చూసే ఆ రామచిలుక...ఈరోజు తనని చూసి పలకరింపుగా నవ్వింది.

మధు శరీరం ఒక్కసారి పులకరింతతో జలదరించింది.

ముందున్నవాళ్లని చీల్చుకొని ఆమె దగ్గరకు వెళ్ళాడు. ఆమె కూడా ఆడాళ్లను నెట్టుకొని వెనక్కి వచ్చింది.

ఇద్దరూ ఒకరికొకరు చేరువగా నిలబడ్డారు.

"ఆఫీసుకా?" ఆమే ముందుగా ప్రశ్నించింది.

"మీరూ...?!" మధు ఆమెని అడిగాడు.

"మార్నింగ్‌షోకి వెళ్దామని" అంది.

మధూకి ఎందుకో ఆ మాటలో వేయి అర్థాలు ద్యోతకమయ్యాయి.

"ఒక్కరేనా?" అడిగాడు ఆశగా.

"మీరూ వస్తారా?!" అంది ఆమె.

మధూకి నోటమాట రాలేదు. ముచ్చెమటలు పోశాయి. తను కలలోకూడా వూహించలేదీ సంఘటన.

ఆఫీసుకొచ్చే ఈ అందమైన అమ్మాయికేసి








చూసి, "ఎవరోగదా ఆ అదృష్టవంతుడు!" అని నొచ్చుకునేవాడు తను. కానీ ఆమెను అందుకొనే అవకాశం, అదృష్టం తననే వరించ నున్నదని ఇన్నాళ్ళూ గ్రహించలేదు.

వెధవ ఆఫీసు! సెలవు పెట్టెయ్యాలి.

తప్పదు!

ఆర్టీసీ కాంప్లెక్స్‌లో ఇద్దరూ బస్సుదిగారు.

"మీ డాడీ ఆఫీసుకొచ్చేశారా?" మధూ ఆమెని అడిగాడు.

"లేదు... నేను బయల్దేరేసరికి ఇంట్లోనే ఉన్నారు. ఏం?"

"మా కొలీగ్‌కి ఫోన్‌చేసి శెలవుచెప్దామని!"

"చెప్పండి! నేనాపక్క కూర్చుంటాను" అని ఆ పక్కనేవున్న బల్లమీద కూర్చుందామె.

మధు రిసీవర్ తీసుకుని రింగ్ చేశాడు.

విశ్వప్రయత్నంచేస్తే ఆఫీసుకు లైన్ దొరికింది.

"హలో ... ప్రకాశం!"

" ... ... "

"హలో! నేన్నా మధుని. నేను ఇవాళ ఆఫీసుకు రావట్లేదు. లీవురాసి మన శనేశ్వరుడికి ఇచ్చెయ్యి"

" ... ... "

"ఆఁ ... మాట్లాడవేంరా?! అలా మూగనోముపట్టేవేమిట్రా?! నామాటలేవీ వినబడట్లేదా?!"

" ... ... "

"నేన్నా... మధుని" అని అటూ ఇటూ చూసి చిన్నగా "నా డస్క్‌లో లీవులెటర్ రాసుంటుంది. అందులో తేదీవేసి ఇచ్చెయ్యి. అన్నట్లు...ఆ రామచిలుక కలిసిందిరా?"

" ... ... "

"అబ్బ... మాట్లాడవేరా?! అర్థంకాలేదా? మన శనేశ్వరుడి కూతురు రామరత్నంరా! బస్సులో కలిసింది. సినిమాకి రమ్మని ఒకటే పోరు! ప్లీజ్... కొంచెం లీవు మన బాస్‌గాడి టేబుల్‌మీద పెట్టేద్దూ!"

" ... ... "

"ఒరేయ్ ప్రకాశం.... నేనింతసేపు వాగినా నువ్వు ఒక్క ముక్క మాట్లాడవేంరా?!" విసుక్కున్నాడు మధు.

అవతల కంఠం ఖంగుమందీసారి.

"ఎస్ ... నీ అరగంట వాగుడూ ఓపిగ్గా విన్నది నేనే! శనేశ్వరాన్ని. ఈ వెధవల ఆఫీసుకి చవటాఫీసర్ని సరేగాని...ఒరే రాస్కెల్! వెంటనే ఆఫీసుకు రా! ఇంకో అరగంటలో నా ముందర లేకపోతే ... నిన్ను ... నిన్ను ..." అవతలి గొంతు వినేసరికి మధు పైప్రాణాలు పైనే పోయాయి. అప్పుడే వాళ్ల ఆఫీసు రూటు బస్సువచ్చి ఆగింది.

పరుగు...పరుగునవెళ్లి బస్సెక్కాడు మధు.

పిచ్చికుక్క కరిచినవాడిలా పరిగెడుతున్న మధుని చూసి రామరత్నం విస్తుబోయింది. కానీ ఎంత పిలిచినా మధు పట్టించుకుంటేనా?!

—ఇందూ రమణ

డిసెంబర్ '87 చతుర సంపుటి: 10 సంచిక: 11

# ఈనెల సమగ్ర నవల

"మీరు నలుగురూ దేశం చూసి శాంతిబీజాల్ని సేకరించి తేవాలి. వాటిని మన తోటలో నాటి అనురాగ నందనవనం నిర్మించాలి. గౌతమబుద్ధుడు, రామకృష్ణపరమహంస, రమణమహర్షి, జిడ్డు కృష్ణమూర్తి వంటి మహామహుల సందేశాల్ని ఆచరించి వారి అడుగుజాడల్లో నడిచి ముందుతరానికి ఆదర్శంకావాలి. శాంతివనానికి కావలసిన బీజాన్వేషణకి సిద్ధంకండి. అదే రాగాన్వేషణ! ఇద్దరు దక్షిణభారతానికీ, మరో ఇద్దరు ఉత్తరభారతానికీ తరలండి. మీ ప్రయాణానికి కావలసిన ముఖ్యసూచనలిచ్చి, సహాయం చేస్తాను" అంటూ ఉద్బోధించారు ప్రొఫెసర్ మూర్తిగారు. ఒళ్ళు పులకరించగా మహోత్సాహంతో బయలుదేరారు ఆయన విద్యార్థులు, విద్యార్థినులు నలుగురు.

ప్రస్తుత సమాజాన్ని పట్టిపీడిస్తున్న అతి క్లిష్టమైన సమస్యలకి పరిష్కారాన్ని సూచించే కొత్తతరహా నవల 'రాగాన్వేషణ'. శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్ నవల 'రాగాన్వేషణ' 'చతుర' నవలల పోటీలో ప్రత్యేక ప్రశంసకు పాత్రమైన విశిష్టనవల.



హైద్రాబాద్‌లో పుట్టి గుంటూర్లో చదివి జిడ్డు కృష్ణమూర్తి స్థాపించిన ఋషీవాలీ స్కూల్లో అధ్యాపకురాలిగా పనిచేసి, ప్రస్తుతం భారతీయ విద్యాభవన్‌వారి బరోడా స్కూల్లో జూనియర్‌స్కూల్ హెడ్‌గా ఉన్నారు. తొమ్మిది నవలలు, నలభైకి పైగా కథలు, వ్యాసాలు, నాటికలు వివిధ పత్రికల్లో వచ్చాయి. ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్ పనుపున విదేశాలు పర్యటించి భారతీయ సంస్కృతి విజ్ఞానాలపై ఉపన్యాసాలిచ్చారు.

## అంకితం

ఋషీవాలీలో నేనున్న పదేళ్ళల్లో విన్న శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి ఉపన్యాసాలతో వాటి ప్రభావం, నాలో రేకెత్తిన భావపరంపరల రూపమే ఈ "రాగాన్వేషణ."

అందుకే ఈ నా నవలని ఆ మహామనిషి- ప్రఖ్యాత తత్వవేత్త శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారికి భక్తి పురస్సరముగా అంకితమిస్తున్నాను.

--మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్



# రాగాన్వేషణ

మాదవపెద్ది ప్రత్యూషాప్రసాద్

ఉదయం పదిగంటలు.

యూనివర్సిటీ కాంపస్ అంతా ప్రశాంతంగా వుంది. ఆరోజు ఉగాది. సెలవురోజు కావటంతో అంతా నిశ్శబ్దంగా వుంది.

ఎండలు అంతగా ముదరకపోయినా సూర్యుడు తన ప్రతాపాన్ని చూపిస్తూనేఉన్నాడు. కిరణాలు చురుక్కుమనిపిస్తున్నాయి.!

పొద్దుతిరుగుడుపూలు సూర్యుణ్ణి చూసి అందంగా నవ్వుతున్నాయి. మిగిలిన పువ్వులు సూర్యకిరణాల తాకిడికి అంతగా తట్టుకోలేకపోయినా- నిర్భయంగా వుండటానికే ప్రయత్నిస్తున్నాయి. కొన్ని మాత్రం ఆకులచాటున దాక్కుంటున్నాయి. దాగిన వాటిని వెతికి మరీ స్పర్శిస్తున్నాడు సూర్యుడు- తన కిరణాల ద్వారా.

''హాయ్ ప్రియా....''

''హల్లో పద్మా...''

ఎదురెదురు రోడ్లనించి అప్పుడే గేట్లల్లోకి ప్రవేశిస్తున్న ఇద్దరందమయిన అమ్మాయిలు ఒకరినొకరు పలకరించుకున్నారు.

పండగరోజు కావటాన ఇద్దరిలోనూ అభ్యంగన స్నానపు స్వచ్ఛతకానవస్తోంది! కొత్త బట్టల్లో వున్నారు ఇద్దరూ. ఒకమ్మాయి చీరకట్టుకుంటే- వేరొకమ్మాయి సల్వార్ కమీజ్ వేసుకుంది.

ఒకమ్మాయి జుట్టు విరబోసుకుంటే వేరొక అమ్మాయి వదులుగా జడల్లుకుంది.

''ఇదేమిటే... పండగనాడు కూడా వదలడంలేదు మన ప్రొఫెసరు'' అంది సల్వారు కమీజమ్మాయి పద్మ.

''ష్... గట్టిగా అనకు. అరుగో అబ్బాయిలు కూడా వస్తున్నారు. విన్నారంటేనా- ఆయనకి చెప్పెయ్యగలరు కూడా...'' చీరకట్టుకున్నమ్మాయి ప్రియ అంది పద్మభుజం మీద చెయ్యేస్తూ. ''అమ్మాయిలకి ఉగాది శుభాకాంక్షలు-'' అంటూ వచ్చారు ఇద్దరబ్బాయిలు.

వాళ్లూ బహుశా తల్లుల బలవంతం వల్లనేమో తలంట్లుపోసుకుని ఉన్నారు. ఆపైన కొత్తబట్టలు.

''అబ్బాయిలకి కూడా మా నూతన సంవత్సర శుభాకాంక్షలు'' అంది పద్మ నవ్వుతూ.

''ఇంతకీ పద్మా... మనిద్దరం చెప్పుకోనే లేదే'' అంది ప్రియ.

''ఏమిటీ... ఇంకా గ్రీట్ చేసుకోలేదా ఇద్దరూ? అయితే ఇందాకట్నించీ మీరు ముచ్చటించుకున్న విషయం అతి ముఖ్యమైనదయి వుండాలి ఏమిటో అది- మేము వినవచ్చా?''

అన్నాడు అబ్బాయిల్లో ఒకడైన ప్రవీణ్.

''అదంతా తరువాత గానీ ముందు గ్రీటింగ్స్ చెప్పేసుకోండి'' అన్నాడు ఇంకో అబ్బాయి శ్రీరామ్.

''ఐవిష్యూ ఎ వెరీవెరీ హేపీ న్యూఇయర్'' చేతులు కలుపుకుని ఒకేసారి అనుకున్నారు పద్మ, ప్రియ.

''ఇది మరీ బావుంది- తెలుగు సంవత్సరానికి శుభాకాంక్షలు ఇంగ్లీషులో తెలుపుకోవడం'' నవ్వుతూ అన్నాడు శ్రీరామ్. ''మొత్తానికి తెలుగు అభిమానం ఎక్కువేనోయ్ నీకు! శభాష్!!'' భుజం తట్టాడు ప్రవీణ్.

''అదేమిటో మన తెలుగువాళ్లకే మరీ భాషాభిమానం లేకుండా పోతోంది. అదే ఇంకే భాషవాళ్లకయినా ఎంత అభిమానమో వాళ్లవాళ్ల భాషలంటే! నేననేది... మిమ్మల్ని గురించి కాదనుకోండి... ఇన్ జనరల్''

అంటున్న శ్రీరామ్ మాటలకి ఆనకట్టపడింది. ''అరుగో ప్రొఫెసర్‌గారు మనకోసం ఎదురుచూస్తున్నట్లున్నారు వెళ్దామా?'' అంది ప్రియ. నలుగురూ ముందుకి నడిచి ప్రొఫెసర్ గారి రూములో ప్రవేశించారు.

''గుడ్‌మార్నింగ్ సార్''

''గుడ్‌మార్నింగ్''

''హేపీ న్యూఇయర్ సార్'' మిగిలిన ముగ్గురితో తనూ గొంతు కలిపాడు శ్రీరామ్.

''థాంక్యూ... విష్‌యూదిసేమ్. మీకోసమే ఎదురుచూస్తున్నాను. రండి కూచోండి'' అన్నారు మూర్తిగారు.

లక్ష్మణమూర్తిగారు ఫిలాసఫీ ప్రొఫెసరు. ఫారిన్ కంట్రీలన్నీ తిరిగినవాడు. బాగా చదువుకున్నవాడు. మంచి విజ్ఞానవేత్త. దాదాపు వేదాంతగ్రంథాలన్నీ క్షుణ్ణంగా చదివి జీర్ణించుకున్నాడు. తెలుగు ఇంగ్లీషులలో మహామహులు రాసిన పుస్తకాలన్నీ ఆయనకి





కంఠోపాఠాలే!

యాభైఏళ్లు పైబడుతున్నా ఆయన పెళ్లిచేసుకోలేదు. ఎందుకు చేసుకోలేదంటే తనకు పెళ్లిచేసుకునే టైము లేదంటాడు. సంసారాన్ని ఈదే తీరికా- ఓపికా కూడా లేవంటాడాయన. ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూ వుండే మూర్తిగారంటే అంతా అభిమానిస్తారు.

మంచి భారీవిగ్రహం దబ్బపండువంటి దేహచ్ఛాయ, గుబురు మీసాలతో ఎప్పుడూ గంభీరంగా ఠీవిగా వుంటాడాయన.

తనకు తెలిసినదాన్ని వివరించి చెప్పడంలో ఆయనకి ఆయనే సాటి. ఆయన కళ్లు తీక్షణంగా సునిశితంగా వుంటాయి. ఎదుటివారి మనసుల్ని ఇట్టే చదివేయగలరాయన. ఆయన చూపులే ఎదుటివారి మనసుల్లోకి చొచ్చుకుపోయి మనసు మారుమూలల్లో వున్న భావాలని వెలికితీస్తాయి. సగం పాఠం ఆయన కళ్లతోనే చెప్పెయ్యగలరు.

కళ్లతో అర్థంచేసుకోగలరు.

కళ్లతోనే అందర్నీ కంట్రోల్ చెయ్యగలరు.

ఇప్పటి విద్యార్థులకి ఉపన్యాసాలంటే తలనొప్పి. కానీ మూర్తిగారేం చెప్పినా గంటలతరబడి వింటూవుండిపోతారు. అది ఆయన వాక్చాతుర్యం. ఆయనతో పరిచయమున్న ప్రతివ్యక్తీ ఆయనంటే గౌరవం చూపిస్తాడు. గౌరవంతో బాటుగా భయం అభిమానం కూడా కలుగుతాయి ఆయన అంటే. నలుగురూ కూర్చున్నారు.

వాళ్లఎదురుగా ఆయనా కూర్చున్నారు.

ఆయన నెమ్మదిగా మొదలుపెట్టారు- ''ఇవాళ ఉగాది. కొత్తసంవత్సరం మొదలయింది. ఇవళ్లిరోజునే నాకు ఎన్నాళ్లనించో నాలోవున్న ఆలోచనలను ఆచరణలో పెట్టాలన్న సంకల్పం కలిగింది. దానికి మీ నలుగురి సహాయం కావాలి''

నలుగురూ కుతూహలంగా చూస్తున్నారు.

''మీ పి.హెచ్.డి పూర్తయింది. మీకు డాక్టరేట్ రాబోతోంది. మీరు మీ జీవితాల్లో సెటిల్ కాబోయేముందు- మిమ్మల్నినేనొక సహాయం అడుగుతున్నాను. నాకున్న అనేకమంది విద్యార్థుల్లో మిమ్మల్నే ఎందుకు ఎన్నుకున్నానంటే- మీరు కార్యసాధకులని నాకు అనిపించింది. మీకు ఉత్సాహ ఉద్రేకాలతోబాటు ఓర్పు వివేకం కూడా వున్నాయని నాకు తోచింది. నేను ప్రత్యేకంగా ఎప్పుడూ చెప్పకపోయినా నాకు మీ నలుగురంటే ప్రత్యేకమైన అభిమానం వుంది. అది ఇప్పుడు చెప్తున్నాను. ఇది నిజం- పిల్లలుపైకి రావాలంటే పెద్దలెప్పుడూ వాళ్లని అతిగా పొగడకూడదు. కానీ వాళ్లని ఉత్సాహపరుస్తూ వుండాలి''

''థాంక్యూసర్-'' అన్నారు నలుగురూ.

వాళ్ల గుండెలు సంతోషంతో ఉప్పొంగాయి.

''ఎంతో జాగ్రత్తగా ఏరుకున్నాను మిమ్మల్ని. నా ప్రయత్నం సఫలమౌతుందనే నా నమ్మిక. ఇకపోతే అసలు విషయానికి వస్తాను. జాగ్రత్తగా వినండి''

నలుగురూ సర్దుకు కూర్చున్నారు.

''ముందుగా మీకొక కథచెప్తాను...''

కథ అనగానే ఇరవై ఇరవైరెండేళ్ల పిల్లలు కూడా పసిపాపలైపోయారు. చెవులు రిక్కించి వినడం ప్రారంభించారు.

''ఇది బుద్ధుడికథలో మనం చదువుకున్నదే మీకందరికీ తెలుసు. అయినా మళ్ళీ చెప్తున్నాను. ఒకసారి బుద్ధభగవానుడి దగ్గరికి ఒక స్త్రీ వచ్చిందట- గోడుగోడున విలపిస్తూ. కారణం తన కొడుకు మరణించాడు. ఆ మరణించిన శిశుకళేబరాన్ని కూడా తీసుకువచ్చిందా స్త్రీ. ఆయన పాదాల దగ్గర ఆ శవాన్ని పడుకోబెట్టి ఆ కొడుకుని బతికించి తనకు పుత్ర భిక్షపెట్టమంది. అది సాధ్యమయ్యే పనేనా? జననమరణాలు జీవికి సహజంకదా? ఇవన్నీ ఆలోచనలో లేవు ఆమెకి. తన కొడుకు బతకాలి. మరేమీ అక్కరలేదు.

ఆలోచించిన బుద్ధభగవానుడు ఆ స్త్రీతో చారెడు ఆవాలు తీసుకువస్తే నీ బిడ్డ బతుకుతాడని చెపుతాడు.

'అదెంత భాగ్యం ఇప్పుడే తెస్తాన'ని ఆ స్త్రీ వెనుకకు తిరగగానే

''మరణ దుఃఖమంటూలేని గృహము నుండే ఆ ఆవాలు కావాల''ని మళ్ళీ చెప్తాడు బుద్ధభగవానుడు. 'సరే' నంటూ వెళ్ళిన ఆ మాతృమూర్తికి దుఃఖంలేని ఇల్లే కనబడదు.

పిల్లలు పోయిన తల్లులు- తల్లిపోయిన



పిల్లలు

భార్యపోయిన భర్త

భర్తపోయిన భార్య

తల్లిదండ్రులిద్దర్నీ కోల్పోయిన అనాథలు

అన్నదమ్ములను కోల్పోయిన అభాగ్యులు

పిల్లలందర్నీ కోల్పోయిన ముసలివగ్గులైన తల్లిదండ్రులు

ఇట్లా ఎందరినో చూస్తుంది ఆ మాతృమూర్తి. అంటే ఈ ప్రపంచంలో మరణంలేని గృహమే లేదు. దుఃఖంలేని ఇల్లేలేదు అని స్వానుభవంలో తెలుసుకుంటుంది ఆ స్త్రీ. అది తెలిసేటట్లు చేశాడు బుద్ధుడు. ఇది ఆవిడ ఒక్కదానికే సంబంధించిందికాదు మనకూ వర్తిస్తుంది.

ఇక్కడ మనకు కావల్సింది ఆ ఆవాలు. ఆ ఆవాలు ఏమిటో తెలుసా? శాంతిబీజాలు.

మీరు ఆ శాంతిబీజాల్ని సాధించి తీసుకురావాలి. అదీ మీ పని. ఇది ఒక విధంగా అన్వేషణ. మరొకవిధంగా పరిశోధన. రీసెర్చి...''

కళ్ళు పెద్దవిచేసి చూడసాగారు నలుగురూ.

''ఆశ్చర్యపోకండి- ప్రయత్నిస్తే మానవుడు సాధించలేనిది ఏదీలేదు. నేను చెప్పేది జాగ్రత్తగా వినండి. సిద్దార్థుడు బుద్ధుడుగాక మునుపు ఒక రోగిని ఒక వృద్ధుణ్ణి ఒక మరణించిన వాణ్ణీ చూస్తాడు. దాంతో ఆయనకి జీవితంమీద విరక్తికలిగి ఇల్లువదిలి వెళ్ళిపోతాడు. ఈ మూడూ మానవుడికి దుఃఖహేతువులనీ అనివార్యాలనీ గ్రహిస్తాడు. ఆ తరువాత జ్ఞానసిద్ధిని పొంది బుద్ధుడవుతాడు.

ఈ మూడూ మనిషికి ప్రకృతిసిద్ధమైన దుఃఖహేతువులు.

నేటి మానవుడు తన విజ్ఞానంతో రోగాలు రాకుండా చెయ్యడానికి వచ్చిన రోగాల్ని పోగొట్టడానికీ నిరంతరకృషి చేస్తూనేవున్నాడు. కృషిచేసి చికిత్సచేసి రోగనివారణ చేసేలోగానే పేరు తెలియని మరికొన్ని కొత్తరోగాలు పుట్టుకొస్తున్నాయి.

ముసలితనం అనివార్యం. కానీ నేటి మానవుడు ముసలితనం వస్తున్నా శరీరంలో ముసలితనపు ఛాయలు కనబడకుండా వుండటానికే శతవిధాల ప్రయత్నిస్తున్నాడు. దాంట్లో కొంతవరకు సఫలీకృతుడవుతున్నాడు. తలకు రంగులువేసి నెరిసినజుట్టుని దాచుకోవడం, రకరకాల దుస్తులు ధరించి శరీరంలో ఏర్పడే ముడతల్ని కనబడనీయకుండావుండటం. పళ్ళువూడితే కట్టుడుపళ్ళు పెట్టుకోవడం, కళ్ళు కనబడకపోతే కళ్ళజోడుబదులు కంటాక్టులెన్సులు పెట్టుకోవడం మొహంలోని ముడతలకి ప్లాస్టిక్‌సర్జరీ చేయించుకోవడం వీటివల్ల ముసలితనం పైకి కనబడటంలేదు.

ఇకపోతే మరణం' మరణాన్ని పూర్తిగా జయించలేకపోయినా కాస్తవెనక్కి నెట్టడానికి ప్రయత్నంచేస్తున్నారు. కానీ దాన్నిమాత్రం పూర్తిగా ఎవరూ ఆపలేకపోతున్నారు.

ఈ మూడూ ప్రకృతి సహజంగా ఏర్పడిన దుఃఖ హేతువులు- అందరికీ తెలిసినవి.

ఇవిగాక మానవుడు తనకు తానుగా దుఃఖాన్ని కొని తెచ్చుకుంటున్నాడు.

అవే నేను మీకు చెప్పబోయే ముఖ్యాంశాలు. సహజంగావుండే మరణంవల్ల ఏర్పడిన దుఃఖంలేని గృహంనుంచి ఆవాలు తేలేకపోయిందా స్త్రీ.

మానవుడు తనకుతానుగా కొనితెచ్చుకుంటున్న దుఃఖాన్ని పరిశోధించి మనం శాంతిబీజాలు వేయగలమా? ఆలోచించండి

తనకుతానుగా కొనితెచ్చుకుంటున్న దుఃఖాలేమిటని మీరు ప్రశ్నించవచ్చు. అదే నేను మీకు చెప్పబోయేది.

స్వార్థపరత్వం, కుళ్ళు, ఓర్వలేనితనం, అవినీతి, లంచగొండితనం ఇవి మానవుడిలో పేరుకుపోయిన నయంగాని రోగాలు.

మందులేని రోగాలు.

టి.బి.కంటే- కాన్సరుకంటే భయంకరమైన రోగాలు! కాదంటారా... కాదనగలరా??''

ఉద్రేకంగా మాట్లాడుతున్న మూర్తిగార్ని చూసి భయపడ్డారు పిల్లలు.

''ఎదుటిమనిషిని బాధపెట్టడం, కించపరచడం, అవమానించడం, హేళనచెయ్యడం, దూషించడం, మంచివున్నా మెచ్చుకోకపోవడం, ఒకళ్ళు బాధపడుతుంటే చూసి సంతోషపడటం తన భావాలనీ, తన ఇష్టాలనీ

ఎదుటివారిపై రుద్దడం, ఎప్పుడూ ఇతరులలో తప్పులెన్నడం వీటితోనే కాలంగడుపుతున్నవారికి అంతకంటే ముసలితనం ఏముంది? ఇది తెచ్చిపెట్టుకున్న దుఃఖం.

తనకేదో జరిగిపోయింది. ప్రపంచంలో తన కంటే కష్టపడుతున్నవాళ్ళే లేరు అనుకుంటూ తనమీద తనే సానుభూతి చూపించుకుంటూ- మనోవ్యాధితో మగ్గిపోయేవారికి అంతకంటే ఇంక మరణం, ఏముంది? తననితాను పొగుడుకుంటూ తనకోసమే అన్నీ చేసుకుంటూ లేనిపోని అనుమానాలూ భయాలూ శంకలూ పెట్టుకుని బతుకుని నరకంచేసుకుంటూ అనుక్షణమూ ఛస్తూ బతుకుతున్నవారు ఎంద రోవున్నారు. ఎవరికీ మంచిచెయ్యని చెయ్యలేని బతుకు ఒక బతుకా? అన్యాయం చెయ్యడంకన్నా చావు వేరేవుందా? ఇతరుల సొమ్ము కష్టపడకుండా తినడంకన్నా చావువేరే వుందా? పరువుగా బతికేవాడికి ఆ పరువుపోవడమే చావు! ఈ రకాలైన రోగాలు, ముసలితనాలు, చావులు. వీటిని మనం జయించలేమా? జయించాలి. జయించితీరాలి. ఇవి జయించాలంటే మనకి శాంతిబీజాలు కావాలి... అవే మీరు తేవాలి.

ఈ శాంతిబీజాల్ని నాలుగు రకాలుగా విభజిస్తున్నాను.

సమానత్వం

తృప్తి

సచ్ఛీలం

మానవత్వం.

ఈర్ష్య, స్వార్థపరత్వం, కుళ్ళు, ఓర్వలేనితనంలాంటివాటిని శోధిస్తూవెళితే సమానత్వం గోచరిస్తుంది.

దుఃఖం, బాధ, శోకం, అసంతృప్తి, వీటినించి తృప్తి వెలువడుతుంది.

అవినీతి, లంచగొండితనం, అన్యాయం, మోసం, ద్రోహం- వీటిని మధిస్తే సచ్ఛీలం కనబడుతుంది.

''బంధుత్వం, బాంధవ్యాలు, పరస్పర సంబంధాలు, ప్రేమ, మిత్రత్వం- వీటిని పరిశీలిస్తే మానవత్వం అర్థమవుతుంది.

ఈ నాలుగురకాల శాంతిబీజాలు మీరు నలుగురూ తేవాలి. మనం శాంతివనం... అదే రాగవనం

అనురాగ నందనవనం నిర్మించాలి.

మనకు చేతనైనంత మేరకు మనం దేశసౌభాగ్యానికి పాటుపడాలి.

గౌతమబుద్ధుడు, రామకృష్ణపరమహంస, రమణమహర్షి, జిడ్డుకృష్ణమూర్తి వంటి మహామహులంతా మరేదేశంలోనోకాదు ... ఇక్కడే ఈ మన భారతదేశంలోనే జన్మించారని ముందుతరాలవారికి మనం చాటిచెప్పాలి. ఆ మహనీయుల అడుగుజాడల్లో మనం నడవడానికి ప్రయత్నంచెయ్యాలి.

వారు చెప్పినవన్నీ విని జీర్ణించుకోవడమేకాదు. ప్రయోగాత్మకంగా నిరూపించుకోవాలి''

ఒళ్ళు పులకరించగా స్తబ్దులై వుండిపోయారు- శ్రోతలు నలుగురూ కూడా.

''మన అనురాగ నందనవనానికి బీజాన్వేషణకి సిద్ధంకండి. అదే రాగాన్వేషణ- ఇద్దరు దక్షిణ భారతానికి వెళ్ళండి. మరో ఇద్దరు ఉత్తర భారతానికి తరలండి. మీ మీ ప్రయాణాలకు కావలసిన సహాయం కొంత నేను చేస్తాను. ఈ ప్రాజెక్టుకి కొంత గవర్నమెంటు గ్రాంటుగా ఇస్తుంది. మీ అన్వేషణకు కావల్సిన గైడ్‌లైన్స్ కొన్ని నేను ఇస్తాను'' అన్నారాయన.

''సార్ ... మా పార్ట్‌నర్‌లని మీరే ఎన్నిక చేయండి'' పద్మ అంది.

''ఆ పని మీరే చేసుకుంటే బాగుంటుంది''

''గోఎహెడ్''

''పద్మ- శ్రీరామ్ ఒక గ్రూపు. ప్రియ- ప్రవీణ్ మరో గ్రూపు-'' ప్రవీణ్ అన్నాడు.

''అంగీకారమేనా?''

అందరూ తలలూపారు.

''సార్ ... ఒక రిక్వెస్టు'' ప్రియ అంది.

''ఏమిటి?''

''మీరు నలుగురూ మా ఇంటికి భోజనానికి రావాలి. ఇవాళ పండగ కదా?''

''సరే ... అట్లాగేనమ్మా'' అన్నారు మూర్తిగారు.

''పెరుగు వడలు స్పెషల్'' పద్మ నవ్వింది.




''కాదు ... పులిహోర, పరమాన్నం-'' ప్రవీణ్ అనడంతో అందరూ గొల్లున నవ్వారు.

''పెద్ద దూరం లేకపోతే నడిచి పోదామమ్మా'' అన్నారు మూర్తిగారు.

''పెద్ద దూరమేమీ కాదుగానీ, ఎండకదండీ'' అంది పద్మ.

''ఏంఫరవాలేదమ్మా కబుర్లు చెప్పుకుంటూ నడిచి వెళ్తే ఎండనిపించదు''

''అవును సార్ ... నడిచేవెళ్దాం'' అన్నారు శ్రీరామ్, ప్రవీణ్‌లు.

''నరేగాని ప్రియా- చిన్న సందేహం'' ఆగిపోయారు ప్రొఫెసరుగారు.

ఏమిటన్నట్లు చూసింది ప్రియ.

''మా నలుగుర్ని ఒకేసారి భోజనానికి పిల్చావు. పైగా ఇంట్లో కొస్తన్నా నోటీసు ఇచ్చావో లేదో వాళ్లకి. అదే...మీ అమ్మగారికి ఇబ్బంది కాదూ?''

''అవునుసార్ ... అదే మా సందేహం కూడా...'' అన్నారు అబ్బాయిలు.

''ఏమీ ఇబ్బంది లేదుసార్ ... మీరే చూస్తారుగా? మా ఇంట్లో ఎప్పుడూ ఒకరిద్దరైనా గెస్టులు లేందే మా నాన్నగారసలు భోజనం చెయ్యరు. అదీగాక ఇవాళ పండగకదా?'' అంది ప్రియ.

''అంటే పదార్థాలన్నీ దండిగా వండి వుంచుతారంటావు?'' అంది పద్మ నవ్వుతూ.

అవునన్నట్లు తలూపింది ప్రియ.

అంతలో ఇల్లొచ్చింది.

''రండిసార్'' ఇంట్లోకి దారి తీసింది ప్రియ. విశాలమైన గేట్లోంచి లోపలికి వెళ్తుంటే పూల మొక్కలు స్వాగతం పలికాయి. మధ్యలో సిమెంట్‌దారి. అటూ ఇటూ తోటకూర, ఒకవైపు మెట్ట తామర రకరకాల బంతులు వుంటే, రెండోవైపు గులాబీ చెట్లు వివిధ రంగుల పూలలో విరగబూసి వున్నాయి. బోగన్ విలియా- రాధామాధవం ఆర్చీలుగా అల్లించి వున్నాయి. పూలకుండీలు వరండా మెట్లమీద అమర్చివున్నాయి. వాటిల్లో రకరకాల క్రోటన్లు, మనీప్లాంట్లు వున్నాయి. పద్మ, శ్రీరామ్, ప్రవీణ్‌లు ఎప్పుడూ వచ్చేవారే అయినా మూర్తిగారు మాత్రం అంతకుముందు ఒకటి రెండుసార్లే వచ్చారు అంతే. ప్రియ సాదరంగా అందర్నీ లోపలికి తీసుకెళ్ళింది.

''నమస్కారంసార్ రండి ... రండి - అంటూ ప్రొఫెసరుగారి చేతులు పట్టుకుని అభినందించారు. తర్వాత రండమ్మా పద్మా- రండి నాయనా కూర్చోండి ఇట్లా కూర్చోండి'' అంటూ ఆహ్వానించారు ప్రియ తండ్రి ప్రసాదరావుగారు.

ప్రియ లోపలికి వెళ్ళి చల్లని మంచినీళ్ళు తెచ్చిఇచ్చింది అందరికీ.

వెనకే తల్లి సుశీలమ్మగారు వచ్చారు.

''నమస్కారమమ్మా'' అన్నారు ప్రొఫెసరుగారు లేచి నిలబడి.

పిల్లలు కూడా నమస్కారంచేశారు.

ఆవిడ కూడా నమస్కారం చేసి అందర్నీ కూచోమని చెప్పింది.

''చాలా సంతోషం ... మీరంతా రావడం అందులోనూ పండగనాడు''

అంటున్న ఆవిడ వాళ్ళకి సాక్షాత్తూ అన్నపూర్ణాదేవిలాగే తోచింది.

పద్మ, ప్రియ కలిసి సుశీలమ్మగారికి సహాయం చేస్తూ, మరోపావు గంటలో అంతా రెడీ చేశారు.

నీలిరంగు టేబుల్, అదే రంగు కుర్చీలు, టేబిల్‌మీద వెండి పళ్ళాలు, గ్లాసులు, పక్కనే చిన్న ప్లేట్లు, స్పూన్లు, నీలినేప్‌కిన్లు, మధ్యలో వడ్డించాల్సినవి అమర్చారు.

అందమైన గాజు కప్పుల్లో పాయసం నింపారు. నెయ్యి, పెరుగు, ఊరగాయలు, పచ్చళ్ళు, ఒకవైపు. ఉప్పు మిరియాల పొడి నింపిన ప్లాస్టిక్ డబ్బాలు, వాటి మధ్య ఆవడలు, పులిహోర, పాయసం వగైరా వంటకాలున్నాయి, చూస్తుంటేనే నోళ్ళూరుతున్నాయి.

వంకాయకూర, బంగాళదుంపలకూర, మామిడి కాయపప్పు, సాంబారు, అప్పడాలు, వడియాలు, పూరమిరపకాయలు, ఫ్రూట్‌సలాడ్, గులాబ్‌జాం...

చూస్తేనే కడుపు నిండిపోతోంది.

అంతా వచ్చి చేతులు కడుక్కొని కుర్చీల్లో

కూచున్నారు. "అమ్మయ్యో ... ఇన్ని ఎకాలే" అనుకునారు ఎవరికి వారే.

"ఆగండి అప్పుడే మొదలుపెట్టద్దు" అంటూ సుశీలమ్మగారు చేతిలో ఒక గిన్నె స్పూనుతో వచ్చారు.

"వేప ప్రసాదం తినాలి" అంటూ ప్రేమగా అందరి చేతుల్లో పెట్టారు. వేపపువ్వు, మామిడి కాయ, కొత్త చింతపండు, కొత్తబెల్లం, తేనె, అరటిపండు, కొద్దిగా ఉప్పు, కొంచెంకారం, అన్నీ కలిపిన పచ్చడి అది.

"షడ్రుచులూ కలిపి తిన్నట్లు జీవితంలోని అన్ని రకాల అనుభవాలనీ, నవ్వుతూ స్వీక రించాలని దాని అంతరార్థం"

నవ్వుతూ అన్నారు ప్రసాదరావుగారు.

"ముందు ఏ రుచి తగిలితే ఆ సంవత్సర మంతా జీవితంలో ఆ అనుభవం ఎక్కువగా వుంటుందిట"

నవ్వింది ప్రియ.

"అంతే? ఏఏ రుచి దేని కన్వయించుక వాలో నువ్వే వర్ణించు" అంది పద్మ.

"తీపి- సంతోషం; చేదు- దుఃఖం; వగరు- అవమానం; పులుపు...."

"ఆ...ఆ... చాలు తల్లీ ఆపు" పద్మ.

"తీపి ఎక్కువగా వుండాలంటే బెల్లం తేనె అరటిపండు వేస్తారు--" అన్నాడు ప్రవీణ్.

"వేపపువ్వు చేదుగావున్నా అదేమంచి టేస్టు--" అన్నాడు శ్రీరామ్.

భోజనం ప్రారంభమైంది. కొసరి కొసరి వడ్డి స్తున్న సుశీలమ్మగార్ని చూస్తూ ఏదీ వద్దనలేక పోతున్నారు అంతా

నవ్వులతో-కబుర్లతో-భోజనం సరదాగా ముగి సింది.

భోజనమవగానే అందరూ హాల్లోకొచ్చి కూర్చున్నారు.

కర్టెన్లన్నీ వేసేసరికి చల్లగా, ఆహ్లాదకరంగా వుంది. ఫాన్ వేసుకుంటే బయట ఎండవున్నట్లే తోచడంలేదు.

ఒక వెండి ట్రేలో తమలపాకులూ, సున్న మూ వక్కపొడి పెట్టి తెచ్చింది ప్రియ.

సుశీలమ్మగారు భోజనం చేస్తున్నారు.

అప్పుడు మళ్ళీ పొద్దున్న కాలేజీలో వచ్చిన టాపిక్ ప్రారంభమైంది. అంతా ప్రసాదరావుగా రికి వివరించారు అబ్బాయిలు.

"వెరీగుడ్... మంచి పని చేస్తున్నారు సార్!" అని అభినందించి "వీలుంటే నాకు చేతనయిన సహాయాన్ని నేనూ చేస్తాను" అన్నారాయన.

"థాంక్యూ వెరీమచ్"

కొంతసేపు నిశ్శబ్దం. ఎవరి ఆలోచనలలో వాళ్ళున్నారు.

సార్... నాదో చిన్న సందేహం. నేనడుగు తున్నానని ఏమీ అనుకోవద్దు గానీ ఈ పిల్లలు ఆ శాంతి బీజాలు సాధించగలరంటారా? వీళ్ళ అన్వేషణ ఫలిస్తుందా?"

"ఆ...తప్పకుండా సాధించగలరు. వీళ్ళ అన్వేషణ తప్పకుండా ఫలిస్తుందనే నా కని పిస్తోంది. వీళ్ళు రీసర్చి వర్కుచేస్తూ వున్నప్పు డు ఈ రెండేళ్ళనుంచి వీళ్ళని నేను ప్రత్యే కంగా గమనిస్తూ వచ్చాను. వీళ్ళు అందరి పిల్లల్లాంటి వాళ్ళుకాదు. వీళ్ళల్లో క్రియేటివిటీ అంటారే--అదిఉంది. చాకుల్లాంటివాళ్ళు. పె ద్దవాళ్ళం మనం వాళ్ళ కెదురుగా వాళ్ళని పొగడకూడదు." అన్నారు ప్రొఫెసరుగారు కళ్ళ ల్లో గర్వం తొణికిసలాడుతుండగా.

"వింటుంటే నాకే కాస్త అగమ్యగోచరంగా వుంది. వీళ్లిది ఏవిధంగా సాధించగలరు? దీనికి సులభమార్గమేదన్నా వుందా? మీ కభ్యంతరం లేకపోతే చెప్పగలరా?"

సుశీలమ్మగారు భోజనం ముగించి వచ్చి కూచున్నారు.

"భోజనం చేశారామ్మా?" అడిగారు ప్రొఫెస రుగారు.

"ఆ... చేశాను" అన్నదావిడ.

"వీళ్ళు నలుగురూ రెండు గ్రూపులుగా భారతదేశంలోని ఉత్తర దక్షిణాలకువెళ్ళి ఆరు నెలలు తిరిగి వస్తారు. నేను కూడా వీళ్ళతోక లిసి వెళ్ళాల్సిన వాణ్ణేగానీ నాకిక్కడ చాలా పనివుంది. ఇక్కడ గ్రౌండ్ వర్కంతా చెయ్యా ల్సి వుంటుంది. వీళ్ళు తిరిగి వచ్చేసరికి ఎన్నో రెడీ చెయ్యాలి. ఒక అమ్మాయి, ఒక అబ్బాయి కలిసి వెళ్తారు. మీకేమీ అభ్యంతరం వుండ




మగా?''

"అబ్బే... అభ్యంతరమెందుకు? ఆ అబ్బాయిలు మాకు కొత్త వాళ్ళయితేగా?'' అన్నారు ప్రసాదరావుగారు భార్యవైపు చూస్తూ.

భోజనం చేస్తున్నప్పుడే వీళ్ళ సంభాషణలు విన్నారు ఆవిడ అభ్యంతరంవున్నా చెప్పదలచనట్లు మౌనంగా వూరుకుందామె.

"వీళ్ళు ఈ ఆరు నెలలు పర్యటనలలో తటస్థపడిన మనుషుల్నీ మనస్తత్వాల్నీ వీలైనంత దగ్గరగాచూసి అర్థంచేసుకోవడం వాళ్ళల్లో ఎవరి దగ్గిరైనా మన శాంతి బీజాల



నాలుగింటిలో ఏ ఒక్కటైనా వుందేమో పరిశీలించడం వీళ్ళ కర్తవ్యం. ఒకవేళ వుంటే గనక చాలా జాగ్రత్తగా పరిశీలించి వాళ్ళని మనలో చేర్చుకోవాలి. అదే శాంతివనానికి ప్రారంభ దశ''

''చాలా సంతోషమండీ... ఇవాళ చాలా సుదినం'' అన్నారు ప్రసాదరావుగారు చేతులు జోడిస్తూ ''మరింకనేను వెళ్ళి వస్తాను--'' నమస్కరించి లేచారు ప్రొఫెసరుగారు.

''మీరేమీ అనుకోకపోతే... మా అమ్మాయికి అమ్మాయితో వెళ్ళే అబ్బాయికీ అయ్యే ఖర్చు నేను భరిస్తాను. దానికి మీరు అనుమతివ్వాలి'' అన్నారు ప్రసాదరావుగారు.

''ఓ ష్యూర్... అట్లాగే కానివ్వండి. అంతకంటే ఏంకావాలి? మా ప్రయత్నం విజయవంతంగా ముందుకు సాగబోతోంది. ఇదే శుభసూచకం--'' అన్నారాయన మనస్ఫూర్తిగా నవ్వుతూ. ''మీరు చెయ్యబోయే ఒక మహత్తర కార్యానికి ఏదో విధంగా సాయపడటం మా అదృష్టం'' అన్నారు ప్రసాదరావుగారు.

''అవును... నిజం.'' అన్నారు సుశీలమ్మ కూడా

''మంచిదమ్మా... వస్తాము. మంచి భోజనం పెట్టారు. చాలా థాంక్స్'' అన్నారు ప్రొఫెసరుగారు చేతులు జోడిస్తూ.

ముగ్గురు పిల్లలు గూడా సెలవు తీసుకున్నారు వారివద్దనుండి.

★ ★ ★

పద్మ తల్లి,తండ్రీ అమెరికాలో వున్నారు. ఇక్కడ మేనత్త దగ్గరవుండి చదువుకుంటోంది.

మేనత్తకి పద్మంటే ప్రేమ-గారాబం. ఆమెకి పిల్లలేరు. అన్నగారు కూతుర్ని తనదగ్గర వుంచినందుకు తను దాన్ని సరిగ్గా తీర్చిదిద్ది ఆయనకి అప్పగించాలి అది తన బాధ్యత అనుకుంటుందామె.

తల్లిదండ్రులు సాధారణంగా తమ పిల్లలు చిన్నప్పుడు అమెరికాలోనేవున్నా కాస్త వయసు వచ్చేసరికి వాళ్ళకి మన భారతదేశపు సాంప్రదాయాలూ, పద్ధతులూ తెలియాలని కోరుకుంటారు. వాళ్ళు మన దేశంలో చదువుకోవాలనీ మన సంస్కృతీ, ఆచార వ్యవహారాలూ వారికి అర్థం కావాలనీ వుంటుంది ముఖ్యంగా ఆడపిల్లల విషయంలో.

అందుకే తిరిగి వచ్చేసే ఉద్దేశంవున్నా వాళ్ళు విదేశాల్లో వుంటున్నా పిల్లల్నిమాత్రం అందునా ఆడపిల్లల్ని మనదేశం పంపేస్తారు బంధువుల దగ్గిరికి.

అట్లాగే పద్మ ఎప్పుడో తన చిన్నప్పుడు తల్లిదండ్రుల దగ్గిరవుంది అమెరికాలో. ఆ తరువాత వూహ వచ్చినప్పటినుంచీ మేనత్త దగ్గిరే పెరుగుతోంది. రెండేళ్ళకోసారి వచ్చి కూతుర్ని చూసుకుని వెళ్తుంటారు వాళ్ళు. అందువల్లనే నేమో పద్మ తన తల్లిదండ్రుల దగ్గిర అంత ఫ్రీగా వుండలేదు. మేనత్తే ఆమెకు తల్లీతండ్రీ అన్నీ.

పద్మ రాగానే ఆరోజు

''ఏమిటే ఇప్పుడా రావడం? పండగపూటా పొద్దుననంగా వెళ్ళినదానివి? తిండీ తిప్పలూ అక్కర్లేదా?'' అంది మేనత్త రుక్మిణమ్మ ఆప్యాయంగా మందలిస్తూ.

''నేను భోజనం చేసేశానత్తయ్యా. మా స్నేహితురాలింట్లో మంచి స్పెషల్ లంచ్ మాకందరికీ''

అంటూ పద్మ ఏమేం చేశారో ఏకరువు పెట్టేసింది.

''పోనీలే... వేళకి అన్నంతిన్నావుగదా ఎక్కడో ఒకచోట... అదేచాలు! పండగపూట పిల్ల అన్నానికి రాలేదే... అని నేననుకుంటున్నా ఇంకా'' ''ఇంతకీ అత్తయ్యా... నువ్వు తిన్నావా''

''ఆఁ- ఏదో తిన్నాలే --!''

''ఏమిటత్తయ్యా... ఏదో తినడం ఏమిటి? నేనేమో సుష్టుగా తింటేనూ. పద. సరిగ్గా తిందువుగాని'' అంటూ చెయ్యి పట్టిలాగింది.

''ఉండవే... తిన్నాననంటున్నానుగా. నాకిన్నిసార్లు తింటే అరగదమ్మా... వదులు''

''పోనీ పళ్ళన్నా తినాలి''

అంటూ వెళ్ళి పళ్ళు తెచ్చింది.

''సరే... ఒక్కటివ్వు'' అని ఓ అరటిపండు అందుకుందావిడ. అత్తయ్య అరటిపండు తింటుంటే పక్కనే కూచుని కబుర్లు చెప్పింది -- పద్మ.

అప్పుడే అసలు కబురూ చెప్పింది.

ఆవిడ ఉలిక్కిపడ్డది.

"ఏమిటే నువ్వు చెప్పేది?"

"అవునత్తయ్యా మేమొకపనిమీద టూర్ వెళ్లాలి. ఆరునెలలు"

"ఏమిటావని మళ్లీ చెప్పు"

ఓపిగ్గా వివరించింది మళ్లీ పద్మ.

ముక్కుమీద వేలేసుకుందావిడ.

"మహామహులే చెయ్యలేని పని అది – మీ వల్లేమవుతుందీ?"

"మమ్మల్ని అంత తక్కువగా అంచనా వెయ్యకత్తయ్యా... ఆ మహామహులూ మొదట మాలాంటివాళ్లేగదా? ఇట్లాంటి పనులు చెయ్యడం వల్లనేకదా గొప్పవాళ్లయ్యారు?"

"ఏమోనమ్మా ఇట్లా ఆడపిల్లలు ఊళ్లెంబడి తిరగడం అంత మంచిదిగాదు. అందులో రోజులు కూడా బాగాలేవు"

"నీవన్నీ చాదస్తాలులే అత్తయ్యా! ఆడేమిటి మొగేమిటి? అయినా ఏమవుతుందనీ నీకంతా భయంగానీ"

"భయమొక్కటే గాదే తల్లీ – బాధ్యత! నిన్ను నిన్నుగానే మీ నాన్నకి అప్పజెప్పాలి. ఏవన్నా హెచ్చూ తగ్గూ వస్తే మీ అమ్మ నన్ననదూ?"

"హెచ్చూ తగ్గూ ఏమిటి? అనడం ఏమిటి?"

"అదిగాదే... వాడెవడో – ఆ పిల్లాడితో కలిసి వెళ్తానంటున్నావు. మీ మాస్టరుగారే పంపిస్తున్నారనుకో – అయినా కలిసి తిరుగుతారు. కలిసివుంటారు. భోజనం అవీ అన్నీ కలిసేగా? ఏదన్నా – ఎప్పుడన్నా ఒక్కసారి పొరపాటన్నది జరిగిందా – నీకు విషంపెట్టి, నేను విషంతిని చావాలి"

పెద్దగా నవ్వింది పద్మ.

"అదా నీభయం అత్తయ్యా – ఆ భయాలేంనీకు అక్కర్లేదు. నిశ్చింతగా ఉండు. మేము బయలుదేరేపని ఎట్లాంటిది? ఎంత పవిత్రమైంది? నాకసలట్లాంటి భావాలే రావు. ఒకవేళ వచ్చాయో... మేమంత మూర్ఖులమా అత్తయ్యా? నేను చిన్నపిల్లనకాదు. ఆ అబ్బాయీ అంతే -"

"అంటే ఏమిటి నీ ఉద్దేశం?"

"ఏముందీ – అంత తప్పనిసరి పరిస్థితేవస్తే పెళ్లి చేసుకుంటాం... తప్పేముంది? ఒకరికొకరు ఇష్టమయితే – అర్థం చేసుకుంటే – ఇంక కావల్సిందేముంది? రిజిష్ట్రారు ఆఫీసులు ప్రతి వూళ్లోనూ వుంటాయి. ఆ అబ్బాయి చదువుకున్నాడు. మంచి కుటుంబం – తల్లి దండ్రులకి ఒక్కడే కొడుకు... ఇంక మీకందరికీ వున్న కులాల – మతాల సమస్య లేదు. మన కులమే – మన మతమే... కట్నకానుకల ప్రసక్తి అసలే అక్కర్లేదు..."

నోరు తెరుచుకుని వుండిపోయింది రుక్మిణమ్మగారు.

ఎంతోసేపటికిగానీ తేరుకోలేదు.

"అమ్మో... ఇంక వూరుకుంటే లాభంలేదు. మీ అమ్మా నాన్నలని వెంటనే రప్పించెయ్యాలి. లేదా నిన్నే అక్కడికి పంపించెయ్యాలి. మళ్లీ ఆ తరువాత నన్నంటే నేను పడలేనమ్మో"

"ఏమిటత్తయ్యా... అంత భయపడతావు? ఇంకా ఏదీ జరగలేదు. ఇప్పటివరకూ నాకు ఆ అబ్బాయంటే ఏ భావమూలేదు. ఆ అబ్బాయికీ అంతే – మేమిద్దరమూ కేవలం స్నేహితులమే. ఆ అబ్బాయి ఎవరో కొత్తవాడు కాదు. ఎప్పుడూ మనింటికొచ్చేవాడే – శ్రీరామ్ మేమంతా ఈ రెండేళ్లనించీ కలిసి చదువుకుంటున్నవాళ్లమే. అయినా మేము కలిసే వుంటామో.. వేరే వేరే వూళ్లే వెళ్తామో... ఇంకా నిర్ణయించుకోలేదు"

"ఏమోనమ్మా – అయినా ఆరునెలలు నిన్ను విడిచి నేను వుండగలనుటే తల్లీ"

మేనత్త మాటలకి కళ్లనీళ్లు తిరిగాయి పద్మకికూడా.

"అత్తయ్యా... నేనంటే నీకెంత ప్రేమ! వచ్చేస్తాగా... ఆరునెలలు ఎంతలో గడుస్తాయి? అమ్మకీ – నాన్నకీగూడా ఈ సంగతి తెలిపి, వాళ్ల అనుమతి తీసుకునే ఈ పనికి వెళ్లడం... సరేనా? నీకు మాటరాకుండా చేసే పూచీనాది. నామీద నీకు నమ్మకం లేదా అత్తయ్యా? నేను నీ మేనగోడల్ని – నీ పద్మని. నీకు పేరుతెచ్చే

పనులే చేస్తానుగానీ పరువుతక్కువ పనులు చెయ్యనే చెయ్యను''

అత్తయ్య మెడచుట్టూ చేతులువేసి ఆమె గుండెల్లో తలదాచుకుంది – పద్మ.

★ ★ ★

ప్రవీణ్ తల్లిదండ్రులకి పెద్దకొడుకు. అతడేదంటే అది చెల్లుబడి కావల్సిందే. చిన్నప్పుడు ఏడిచి అన్నీ సాధించుకునేవాడు – ఇప్పుడు కోపంతో సాధించుకుంటున్నాడు.

ఈ అన్వేషణ విషయం నిన్న అతడి తల్లిదండ్రులు ఎంతో సంతోషంతో ఒప్పుకున్నారు- ఈ విధంగానన్నా అతడి కోపం, చికాకు తగ్గుతయని.



శ్రీరామ్ ఒక్కడే కొడుకు – వాళ్ల తల్లిదండ్రులకి. వాళ్లు సాధారణ కుటుంబీకులు. అతడికి చదువు చెప్పించడానికి వారు ఎంతో కష్టపడవలసి వస్తోంది.

అతడిమీద ఎన్నో ఆశలుపెట్టుకుని వున్నారు వాళ్లు.

అతడి చెల్లెళ్లిద్దరికీ పెళ్లిళ్లు కావాలి ప్రస్తుతం. ఇంకో అమ్మాయి చిన్నపిల్ల చదువుకుంటోంది.

ఇతడి చదువు – రీసెర్చి తొందరగా పూర్తి అయి ఉద్యోగంలో చేరితే – కుటుంబానికి కొంత ఆసరా అవుతాడని వాళ్ల ఆశ.

ఆరోజు ఇంటికెళ్లి ప్రొఫెసరుగారు అన్నమాటలు – ఆయన పథకాలు అన్నీ తల్లిదండ్రులతో చెప్పాడు శ్రీరామ్.

వాళ్లు ముందు ఎంతో సంతోషించారు. అంతమందిలో తమ కుమారుడు ప్రొఫెసర్‌కి ఇష్టుడైనందుకు.

ఆతరువాత భయపడ్డారు.

వీడు సంఘసంస్కర్త, గొప్పవాడు అయితే సంతోషమేగానీ, ఇంటినీ – తల్లిదండ్రులీన్నీ – సుఖాల్నీ వదులుకుంటే?

ఆ తిరుగుడూ – అన్వేషణలో – తనకూడా వచ్చే పిల్లనో- మరెవరినో కట్టుకుంటే?

తమ గతి? కూతుళ్ల పెళ్లిళ్లు?

ఉద్యోగం చెయ్యకుండా అన్వేషణ – శాంతి వనం అంటూ వుంటే కుటుంబానికి ఆసరా ఎట్లా అవుతాడు?

దానివల్ల తమకేం లాభం?

అయితే ఇవన్నీ ఇప్పుడు ఏ కరువుపెడితే కొడుకు తమని స్వార్థపరులుగా అంచనా వేసుకోడూ?

ఏం చెయ్యాలి?

ఏం లేదు మౌనంగా వూరుకోడమే.

చూద్దాం... ఆరునెలలే అంటున్నాడుగా అనుకున్నారు. చూచాయగా వాళ్ల మనసులలోని శంకలు బయటపెడుతూ శ్రీరామ్ ప్రయాణానికి ఒప్పుకున్నారు

వాళ్లు భయపడేవేమీ జరగబోవని హామీ ఇచ్చాడు శ్రీరామ్.

★ ★ ★

ప్రొఫెసరుగారింట్లో సమావేశమయ్యారు నలుగురూ ఆరోజు.

"సార్... ఎప్పుడు బయల్దేరమంటారో,ఏయే వూళ్లో మీరే చెప్పండి"

"ఎప్పుడు వెళ్లామనుకుంటున్నారు?"

"మీ ఇష్టంసార్..." నలుగురూ చాలా ఉత్సాహంగా వున్నారు.

"తెలుగువారి నేనా. అన్నిప్రాంతాలవారినీ పరిశీలిద్దామా సార్?" శ్రీరామ్ అడిగాడు.

"ముందుగా తెలుగువారి జీవితాల్ని చూసి ఆతరువాత వీలున్నంతవరకు వివిధ ప్రాంతాలవారిలో అన్వేషిస్తే బావుంటుంది" అంది పద్మ.

"భాషలు వేరేగానీ మన భారతీయుల భావాలు, తీరుతెన్నులు దాదాపు ఒకటే. అయినా పద్మా... అన్నట్టు తెలుగువారిలోనే ఎక్కువగా ప్రయత్నిస్తే బావుంటుందేమో? అన్నారు ప్రొఫెసరుగారు.

"అయితే అన్నివూళ్లు తిరగడమెందుకు" అన్నాడు ప్రవీణ్.

"అన్ని వూళ్లల్లోనూ వున్నారుగా తెలుగువాళ్లు? ఆయా ప్రాంతాల సంస్కృతినిబట్టి వారి దృక్పథాలలో కొంత తేడా కనబడవచ్చునేమో? పరిశీలించడం మంచిదిగదా... మనకూ తెలుస్తుంది" అన్నాడు శ్రీరామ్.

"అవును... నువ్వన్నది కరెక్ట్! వచ్చేనెలలో మీ ప్రయాణం. పద్మ, శ్రీరామ్ మీరు ముందు ఢిల్లీగాని, కలకత్తాగానీ వెళ్లండి. అక్కణ్నించి మీ వీలునుబట్టి ప్రాంతాలు మారుస్తూ వుండవచ్చు. అట్లాగే ప్రియ, ప్రవీణ్‌లు విజయవాడ గుంటూరుగానీ, బెంగుళూరు మైసూరులుగానీ, లేదా మద్రాసు- త్రివేంద్రంగానీ ఎట్లాగయినా మొదలుపెట్టవచ్చు... ఛాయిస్ మీది. మొత్తానికి ఉత్తర భారతదేశం వూచీ శ్రీరామ్,పద్మలదైతే దక్షిణాదివైపు ప్రవీణ్- ప్రియలది... సరేనా?"

తలలూగించారు అందరూ. కొంతసేపు నిశ్శబ్దం.

"సార్... మీరుకొన్ని టిప్స్ ఇస్తానన్నారు?" ప్రియ అడిగింది.

"యస్.... యస్... అదే ఆలోచిస్తున్నా" అన్నారు ప్రొఫెసరుగారు సాలోచనగా.

"పాయింట్స్ నోట్ చేసుకుంటాం సార్" అంటూ అందరూ పేపర్, పెన్‌లతో రెడీఅయ్యారు.

"జెలసీని పరిశీలించాలంటే మనుషులు ఈర్ష్యకి ఎందుకు లోనవుతున్నారు, ఎప్పుడూ తమని ఇంకొకరితో పోల్చుకోవడం ఎందుకు? తమకేదో లోపం వుందని భావించుకున్నప్పుడే. ఆ భావన లేనివాళ్లే వుండరా? ఆ భావన మనుషులనించి తప్పించడం సాధ్యమా?

అట్లాగే అవినీతి. అవినీతి అసలెందుకేర్పడుతోంది? ఒకళ్లకింకొకళ్లు అన్యాయం ఎందుకు చెయ్యాలి? వాటిని జయించేవాళ్లే లేరా? అతీతులే లేరా? ఈ అన్యాయం- అవినీతికి పాల్పడేవాళ్ల భావాలెట్లా వుంటాయి?

ఆతరువాత దుఃఖం. దుఃఖం అంటే అసలేమిటి? దానికి కారణాలేమిటి? నిజంగానే మనుషులు దుఃఖాన్ని అనుభవిస్తున్నారా? అనుభవిస్తున్నామని భ్రమిస్తున్నారా? భ్రమయితే తొలిగే మార్గం ఏమిటి?

ఇకపోతే పరస్పర సంబంధాలు ఉదాహరణకి- తల్లీకొడుకులు, తండ్రీ కూతుళ్లు- భార్యాభర్తలు- అక్కా చెల్లెళ్లు- వదినా మరదళ్లు- స్నేహితులు- అన్నాచెల్లెళ్లు... వీళ్ల సంబంధాలు ఎట్లావుంటున్నాయి? ఎట్లా వుంటే బావుంటాయి? బావుండేవిధంగా మసలుకొనేవాళ్ళున్నారా- అనేది పరీక్షించండి!

ఇవీ కొన్నిటిప్స్. వీటిని ఎట్లా కనిపెట్టాలో దానికి ఏంచెయ్యాలో.... అది మీమీ ఇష్టాలపై, పద్ధతులపై ఆధారపడి వుంటుంది.

ఏ విషయంలో ఎప్పుడు ఏ సహాయం కావలిసినా నాకు రాయండి. డబ్బు విషయంలో మాత్రం ఇబ్బందిపడకండి.

మీమీ టిక్కెట్లు త్వరగా రిజర్వుచేసుకోండి... విష్‌యూ ఆల్‌ది బెస్ట్"

"థాంక్‌యూ వెరీమచ్ సర్" అన్నారు నలుగురూ.

★ ★ ★

ఆంధ్రప్రదేశ్ ఎక్స్‌ప్రెస్ కదలడానికి సిద్ధంగా వుంది.

పద్మ- శ్రీరామ్ తమతమ సామాన్లన్నీ ఎప్పుడో సర్దేసుకుని కూచున్నారు.

ప్రియ- ప్రవీణ్ ప్రొఫెసరుగారు, పద్మ మేనత్త శ్రీరామ్ తల్లిదండ్రులు, వచ్చారు స్టేషన్‌కి.

"పద్మా... జాగ్రత్త తల్లీ తొందరగా వచ్చేయ్. ఎక్కడున్నా ఉత్తరాలు మాత్ర రాస్తూండు"అంటూ రుక్మిణమ్మగారు పద్మ రెండు చేతులూ పట్టుకుంది. ఆమె కళ్లల్లో నీళ్లు.

"ధైర్యంగా వుండు అత్తయ్యా- అన్నీ నువ్వు చెప్పినట్లే చేస్తాగా? తొందరగానే వచ్చేస్తానులే" అంది పద్మ.

"నాన్నా శ్రీరాం ఉత్తరాలు రాస్తూండు... జాగ్రత్త" అన్నాడు శ్రీరాం తండ్రి.

"విష్‌యూ ఆల్ దిబెస్ట్" అన్నారు. ప్రొఫెసరుగారూ, ఆవెంటనే ప్రియ- ప్రవీణ్‌లు.

రైలు కదిలింది. అందరూ చేతులూపారు. క్రమంగా ప్లాట్‌ఫారమ్ దూరమయింది. పద్మ- శ్రీరామ్ సర్దుకుని కూచున్నారు.

"మనం చెయ్యాల్సిన పని మొదలయింది" అంది పద్మ నవ్వుతూ.

"అవును" అన్నాడు శ్రీరామ్ సాలోచనగా. "నిన్నటివరకూ నా మనసులో ఏదో బరువు, ఆందోళన ఎట్లా చెయ్యగలమా ఈ పని. అని! ఇవాళ రైలెక్కాక నామనసెంత తేలిగ్గా వుందని." ఉత్సాహంగా నవ్వుతూ అంది పద్మ.

"ఇంక ఫర్వాలేదు. ఎంత పనైనా సాధించగలమంటావ్!?" అంటూ నవ్వాడు శ్రీరామ్.

"అవును... నిజంగానే" అంది పద్మ.

"ఏమండీ... ఈ సూట్‌కేస్ పడిపోతోంది. కాస్త హెల్ప్ చేస్తారా?"

ఇద్దరూ అటుకేసి చూశారు. శ్రీరామ్ గబుక్కున లేచి పడబోయే పెట్టెని పట్టుకున్నాడు. పద్మ సహాయం చేసింది. కిందికి దించారు పెట్టెని.

"థాంక్సమ్మా" అన్నది ఒక మధ్యవయస్సు స్త్రీ. అది ఆవిడపెట్టె. ఒకర్తే ప్రయాణంచేస్తున్నట్లుంది.

"ఫరవాలేదండీ" అన్నది పద్మ.

"ఎంతదాకా... ఢిల్లీ యేనా?"

''అవునండీ''

''మీరిద్దరూ?''

అనుమానంగా చూసింది.

''స్నేహితులమండీ''

''అహ... అట్లాగా?''

క్షణమాగి ''చదువా ఉద్యోగమా అమ్మా?''

''చదువేనండీ''

''ఢిల్లీలోనా?''

''కాదండీ... హైద్రాబాద్‌లోనే. ఢిల్లీ పనిమీద వెళ్తున్నాం.''

''ఎక్కడుంటారమ్మా ఢిల్లీలో?''

''మాకు తెలిసిన వాళ్లున్నారండీ... మింటో రోడ్డులో. అక్కడవుంటాం''

''అహఁ... మేముండేది జనకపురిలో'' అని

''ఇదే మొదటిసారా... ఢిల్లీరావడం'' అడిగిందావిడ.

''కాదండీ... అంతకుముందు మేము ఢిల్లీలో వున్నాం కూడా. నా చదువుకొంత అక్కడే సాగింది''

ఆవిడ మరేం మాట్లాడలేదు. తన ధోరణిలో తను పడిపోయింది.

అలా కొంతసేపు గడిచాక పద్మ, శ్రీరామ్‌లు తమతమ పనులకు ప్లానులు వేసుకోసాగారు.

''నేను జెలసీస్టడీ చేస్తాను శ్రీరాం... నువ్వు అవినీతి స్టడీ చెయ్యి. ప్రవీణ్, ప్రియలు రిలేషన్ షిప్స్ దుఃఖం... తీసుకుంటామన్నారు గదా?''

''అయితే నువ్వు...? ఢిల్లీ తెలుసంటున్నావు గనుక ఢిల్లీలో నువ్వు పనికానీ... నేను కలకత్తా వెళ్తాను''

''ఒక్క ఢిల్లీయేగాదు... కొన్నాళ్లు బొంబాయిలో గూడా వుందామనుకుంటున్నాను''

''వెరీగుడ్... మంచిదే''

''కలకత్తా ఎప్పుడెళ్తానంటావు?''

''నువ్వు కాస్త సెటిల్ అయ్యాక''

''అన్నట్టు కలకత్తాలో నీకెవరన్నా తెలిసిన వాళ్లూ ఫ్రెండ్సూ వున్నారా?''

''ఆ... వున్నాడు ఓ ఫ్రెండ్ అక్కడ''

''అయినా ఢిల్లీలో నాకేం ప్రాబ్లమ్‌లేదు... నువ్వు రెండుమూడు రోజుల్లో వెళ్లిపోవచ్చు?''

''చూద్దాం''

''కొత్త అనుభవాల మధ్య కొత్తపన్లు చెయ్యాలంటే ఉత్సాహంగా వుంటుంది కదూ?''

''అవును''

''అంతా పూర్తయ్యాక మన ప్రొఫెసరు గారు మనకేమన్నా ఎవార్డ్సు ఇస్తారా?''

''ఆశ చాలానే వుందే''

నవ్వుకున్నారు ఇద్దరూ...



2

రైలు ఢిల్లీ చేరగానే తమ సామాన్లు దింపుకున్ ఆవిడకి దిగడానికి హెల్ప్ చేశారు పద్మ శ్రీరామ్‌లు.

''చాలా థాంక్సమ్మా మా ఇంటికి కూడా రండి ఒకమాటు. ఇదిగో మా అడ్రసు'' అంటూ తన భర్తది కాబోలు ఓ విజిటింగ్ కార్డ్ ఇచ్చిందామె.

''నాగలింగంగారు అంటే ఎక్కడో విన్నట్టుంధండీ పేరు'' అన్నాడు శ్రీరామ్ ఆవిడతో.

''అవునబ్బాయ్ నిన్నూ ఎక్కడో చూసినట్లుందే'' అనిపించింది చాలాసార్లు, అందావిడ కళ్లజోడు సవరించుకుంటూ.

''మీ పేరేమిటండీ?''అడిగాడు శ్రీరామ్

''నాపేరు భ్రమరాంబ''

''మీకు హైద్రాబాద్‌లో నాగార్జునరావు గారని తెలుసా? అసలు మావూరు గుంటూరనుకోండి మా నాన్నగారి వుద్యోగరీత్యా ఇక్కడుంటున్నాం అంటే హైద్రాబాద్‌లో''

''ఇంటి పేరు?''

చెప్పాడు శ్రీరామ్.

"ఆ... తెలీకేం వాడు మాతమ్ముడే అంటే వరసకి తమ్ముడవుతాడు. వాళ్ళమ్మా మా అమ్మా అక్కచెల్లెళ్ల పిల్లలు"

"నేను వాళ్లబ్బాయినే"

"అవునా?... మా నాయనే... అదే చూస్తున్నాను. మీనాన్న పోలికలున్నాయి నీలో. నువ్వెక్కడ దిగుతావు? మనింటికి రావాలి సుమా... మీ మామయ్యకి తెలిస్తే అసలూరుకోరు"

"ఈ అమ్మాయిని వాళ్ల స్నేహితులింట్లో దించేసి నేను వస్తాను"

"సరే... రాకుండా వుండేవు మీ మామయ్య



వస్తారేమో స్టేషనుకి కలిసి వెళ్దువుగానీ. అమ్మాయ్ నువ్వూ మా ఇంటికి రావాలమ్మా''

''వస్తానండీ''

''అమ్మానాన్నా బావున్నారా? అరుగో... మీ మామయ్య వచ్చారు'' అంటూండగానే వచ్చేశారాయన.

''ఏమే ప్రయాణం బాగా జరిగిందా? బండి లేటా?... వీళ్లెవరూ?'' ఎగాదిగా చూస్తున్నాడాయన.

''వీడూ... మా గుంటూరు పిన్ని కొడుకు నాగులులేడూ వాడి కొడుకండీ...''

''ఏమిటీ? మీ నాగులుకి ఇంత పెద్ద కొడుకున్నాడా? ఏమోయ్. అమ్మా నాన్నా బావున్నారా? నేను మీ మామయ్యని, ఇంటి కొస్తున్నావుగా?'' అన్నాడాయన చనువుగా.

''వస్తాను మామయ్యా... ఈ అమ్మాయిని దింపేసి'' అంటూ టాక్సీ మాట్లాడాడు శ్రీరామ్.

సెలవు తీసుకుని టాక్సీ ఎక్కికూర్చున్నారు ఇద్దరూ. టాక్సీ కదిలింది.

టాక్సీ ఆ అడ్రసు ప్రకారం ఓ ఇంటి ముందాగింది.

లిఫ్ట్‌లో పైకెళ్లి, నంబర్‌చూసి కాలింగ్ బెల్ నొక్కబోయి ఆగారు.

''అరె... తాళం వేసుందే?'' అన్నాడు శ్రీరామ్.

''బైటికెళ్లారేమో?''

''పక్కింట్లో అడుగుదామా?''

''నువ్వుండు'' లోపలికెళ్లివాకబుచేసివచ్చింది పద్మ.

''అరె... ఎట్లా ఇప్పుడు? వాళ్లు అనుకోకుండా ఇవాళే ఊరెళ్లాల్సొచ్చిందట. ఎప్పుడొస్తారో వాళ్లకే తెలీదుట. నేనొస్తే నాకు తాళం ఇమ్మని వీళ్లకిచ్చారుట''

ఆగింది పద్మ.

''ఏంచేద్దాం?''

''పోనీ తీసుకోనా తాళం?''

''ఎన్నాళ్లని?''

''అదే చూస్తున్నా''





ఇద్దరూ ఆలోచిస్తూ నుంచున్నారు.

పక్కింటావిడ లోపలికొచ్చి కూచోమంది.

చాలా అలసిపోయి వున్నారు.

వెళ్లి లోపల కూచున్నారు.

ఆవిడ టీ ఇచ్చింది.

''నీకభ్యంతరం లేకపోతే మా అత్తయ్యా వాళ్లింట్లో దిగచ్చు... ప్రస్తుతానికి. వీళ్లొచ్చాక కావాలంటే నువ్వు షిఫ్ట్ అవచ్చు. ఏమంటావు?''

''అంతేగా... ఇంక చేసేదేముంది?''

''అంత దిగులు పడకు. వాళ్లూ మంచివాళ్లే''

''దిగులా? నాకెందుకు?'' నవ్వేసింది.

పక్కింటావిడకి థాంక్స్ చెప్పి బయటికి వచ్చారు.

★ ★ ★

మూడుగదుల ఇల్లది. పిల్లలు అల్లరితో గోలెత్తించేస్తున్నారు.

టాక్సీ దిగి లోపలికి వచ్చారు పద్మ శ్రీరామ్.

''రండమ్మా... రారా, బాబూ'' ఆహ్వానిస్తూనే వాళ్లని పిల్లలకి పరిచయం చేసింది భ్రమరాంబ.

''రామ్మా... కూచో... మంచినీళ్లు కావాలా?'' అని మంచినీళ్లిచ్చి ''వుండు కాఫీ పెట్టుకొస్తాను.'' లోపలి కెళ్లింది.

ఆవిడ వెనకే వెళ్లాడు శ్రీరాం.

''అత్తయ్యా... నీకోమాట చెప్పాలి''

''ఏమిటిరా?''

''ఆ అమ్మాయి వుందే పద్మ ఇక్కడేదో ఉద్యోగం చూసుకుందామని వచ్చింది. తీరావచ్చాక వాళ్ళ ఫ్రెండ్స్ వూళ్ళోలేరు. ఆ సంగతి ఈ అమ్మాయికి వచ్చేదాకా తెలీదు. ఇప్పుడేం చెయ్యాలా అని దిగులుపడుతుంటే నేనే ఇక్కడికి రమ్మని తీసుకొచ్చాను''

''మంచిపని చేశావు. మనతోనే వుంటుంది... మనింట్లోనే వుంటుంది. దానికింతగా అడగాలా? అన్నీ మీ నాన్న పోలికలేరా. వాడూ ఒకటే మొహమాటం మనిషి. ప్రతిదానికీ మొహమాటమే''

''కాదత్తయ్యా... మళ్ళీ వాళ్ళు రాగానే వెళ్ళిపోతుంది''

''అదేమిట్రా... అన్నిసార్లు చెప్తావు? ఇదేం పెద్ద బ్రహ్మాండమనీ ఆ పిల్లకి మనమేం చెయ్యాలి?'' ఇంకేం మాట్లాడలేదు శ్రీరామ్.

కాఫీకప్పులు తనే తెచ్చాడు శ్రీరామ్.

చిన్నపిల్లలిద్దరూ పరుగెత్తుకొచ్చారు.

''అమ్మా... నాకు కాఫీ కావాలే''

కాఫీ అయ్యాక స్నానాల కార్యక్రమం. ఒక్కొక్కళ్లే వంతులవారీగా స్నానం పూర్తిచేసేటప్పటికి భోజనాలు రెడీ అయ్యాయి. భ్రమరాంభ వంటింట్లో అష్టావధానం చేస్తోంది.

పద్మ సహాయంగా వెళ్ళింది.

''నువ్వొద్దమ్మా... నువ్వు కూచో'' అన్నా విని పించుకోలేదు పద్మ.

అన్నం, పప్పు, చారు అయ్యాయి.

ఇంక పిల్లలు ఆకలికి ఆగలేకపోతున్నారు.

వరసన చిన్నా పెద్దా కంచాలుపెట్టి గబగబా వడ్డించేశారు పద్మ భ్రమరాంబ కలిసి.

పిల్లలు, మగవాళ్ళు భోజనాలుచేసి లేచారు.

గిన్నెలో మెతుకు మిగలలేదు.

పొయ్యిమీద మళ్ళీ అత్తెసరుపెట్టింది భ్రమరాంబ.

''ఎంతలో అమ్మాయ్... క్షణంలో వార్చేస్తానుగా''

నీరసంగా నవ్వింది పద్మ.

ఎంగిలి కంచాలు ఎత్తి వాటిల్లో రెండు కడిగి తెచ్చుకుని-

అక్కడంతా బాగుచేసి

కంచాలు, మంచినీళ్ళు పెట్టింది పద్మ.

పప్పు, పచ్చడి, వడ్డించింది భ్రమరాంబ.

అరగంటలో అన్నం వుడికింది.

భోజనం చేశాక కూచుంటే కళ్ళు మూతలు పడ్డాయి పద్మకి. అది గమనించిన భ్రమరాంబ గారు దిండొకటి తెచ్చిచ్చింది.

చాపమీద దిండు వేసుకుని పడుకుని నిద్రపోయింది పద్మ.

మళ్ళీ లేచేటప్పటికి ఆరయింది.

కాఫీ ఇచ్చింది భ్రమరాంబ.

సాయంత్రం వంట ప్రయత్నంలో వుందావిడ.

శ్రీరామ్ 'బయట తిరిగి వద్దాం' అన్నాడు పద్మతో. పద్మ తయారయి వెళ్ళింది.

ఎక్కువదూరం వెళ్ళకుండా అక్కడక్కడే తిరిగారు.

శ్రీరామ్ అన్నాడు- ''సారీ పద్మా... నీకు ప్రైవసీ లేదిక్కడ. మా అత్తయ్యావాళ్ళిల్లు చాలా చిన్నది. నీకో రూముకాదుకదా ఒక బెడ్డుకూడా ఇవ్వలేరు వాళ్ళు''

''ఫరవాలేదు- వాళ్ళ ఆప్యాయతే చాలు నాకు అదే అన్నిటికన్నా ఎక్కువ'' నవ్వింది.

''నేను మన ప్రొఫెసరుగారికి క్షేమంగా చేరినట్లు ఉత్తరంరాసి పోస్టుచేశాను. నువ్వు మీవాళ్ళకి కూడా రాయి'' అన్నాడు శ్రీరామ్. ''రేపుపొద్దున వెళ్ళి కలకత్తాకి టికెట్టు కొనుక్కుంటాను''

మరేం మాట్లాడలేదు పద్మ.

''ఏమిటి ఆలోచిస్తున్నావు?''

''ఏంలేదు. నేనేదన్నా టెంపరరీ బేసిస్ మీద జాబ్‌లో చేరాలనుకుంటున్నాను. అది గూడా మన రిసెర్చికి పనికివస్తుందిగదా! నాక్కొంత ఆక్యుపేషన్ కూడా అవసరం''

''సరే... ట్రైచేద్దాం''

ఇంటికి వచ్చేశారు.

భోజనాలు మళ్ళీ పొద్దుటి తతంగమే. కానీ ఈసారి వండిన అన్నం సరిపోయింది. మళ్ళీ వండలేదు. అన్నీ సర్దుకుని పడుకునేటప్పటికే పది దాటింది.

అప్పుడు కూర్చుని అత్తయ్యకో ఉత్తరం రాసింది పద్మ.

మధ్యగదిలో, ముందుగదిలో వరసగా పక్కలు పరిచారు.

పిల్లల మధ్యలో పడుకుంది పద్మ.

★ ★ ★

శ్రీరామ్ ఊరెళ్తున్నాడారోజు.

రైలుకింకా టైముంది.

పద్మ స్టేషన్‌కి వచ్చింది.

''నువ్వు ఎట్లాగో ఎడ్జస్టు అయిపుండగలవా? లేకపోతే ఇంకేదన్నా ఉపాయం చూద్దామా?''

ఇంకేం చూస్తావు? నా ప్రయోగాలకి ఇక్కడే అనుకూలం. నలుగురిలో వుంటే ఇంకా బావుంటుందికదూ?''

''ఆర్యూ ష్యూర్...''

''ఎస్... ఇటీజ్ ఇంటరెస్టింగ్'

కాసేపు మౌనం.

ఏవో పుస్తకాలు కొన్నుక్కున్నారు వెళ్ళి.

''మీ ఫ్రెండ్స్ ఇంకా రాలేదు. నేనివాళ కూడా వెళ్ళి కనుక్కొచ్చాను'' అన్నాడు శ్రీరామ్.

''నేనూ కనుక్కుంటూ వుంటాను- వాళ్ళొస్తే షిఫ్ట్ అయిపోతాను'' అంది పద్మ.

''నువ్వో పనిచెయ్యి''

ఏమిటన్నట్లు చూసింది.

''ఏరోజు అనుభవాలు ఆరోజు డైరీలో రాసుకో... ప్రతి చిన్న సంఘటనా రాసుకో. వారానికో సారి మనం రాసుకున్నదంతా చదువుకుని ఎనలైజు చేసుకుంటే మన ఎక్స్‌పెరమెంట్స్‌కి కొన్ని పాయింట్లొస్తాయి''

''నువ్వన్నది నిజమే- ఐవిల్ డూ దట్''

బెల్ మోగింది. ఇంజన్ కూతవేసింది. గార్డ్ పచ్చజెండా చూపిస్తున్నాడు.

''ఎక్కు... రైలు కదిలేటట్లుంది'' అంది పద్మ.

''ఫరవాలేదులే... నేను రైలు పరుగెత్తుతున్నా ఎక్కగలను''

నవ్వుతూనే ఎక్కాడు.

''ఓకే...బై''

''బై బై...''

రైలు కదిలింది.

''ఐవిల్ రైట్టుయూ...'' పెద్దగా అరిచాడు. తలవూపింది.

ఆ తరువాత చెయ్యూపుతూ నుంచుంది.

రైలు వెళ్ళిపోయింది.

★ ★ ★

నాగలింగంగారి సహాయంతో పద్మకి ఒక కంపెనీలో రిసెప్షనిస్ట్‌గా లీవ్ వేకెన్సీలో వచ్చింది ఉద్యోగం. వెంటనే జాయిన్ అయింది. రోజూ బస్సులో వెళ్ళొస్తూ వుంది.

ఇంట్లో వున్నప్పుడు ఏపని చెయ్యబోయినా భ్రమరాంబ వారించేది.

ఏపనీ చెయ్యనిచ్చేదికాదు.

అన్నం తిన్నాక కంచం కూడా ఎత్తనిచ్చేది కాదు.

''నువ్వెందుకమ్మా పని చెయ్యడం. మా పిల్లలాంటిదానివి''

''ఏమిటి పిన్నిగారూ... మీ పిల్లలు పనిచెయ్యడంలేదా?''

''అదివేరు''

''ఏదివేరు? నేను నాచేతనయింది చేస్తాను. వంట ఎట్లాగూ నేను చెయ్యడంలేదు''

అంటూనే చేస్తూవుండేది.

''మాకు పెళ్లయ్యాక పదేళ్ళకిగాని పిల్లలు కలగలేదే అమ్మాయ్! మేము మొక్కని దేవుడులేడు. చెయ్యని తీర్థయాత్రలేదు. ఇహ పదేళ్ళ తరువాత వరుసగా పుట్టేశారు అయిదుగురు. అందుకే మాకు వయసింత వచ్చినా పిల్లలు ఇంకా గుంటపూలే పూస్తున్నారు. ఒక్కళ్ళూ చేతికందిరాలేదు. ఏంచేస్తాం?'' అంది భ్రమరాంబ పద్మతో.

''ఫరవాలేదు పిన్నిగారూ... ఇప్పుడుమాత్రమేం? మీరూ, బాబాయిగారూ ఇంకా చిన్నగానే కనిపిస్తారు. మీ వయసులు చెప్తేగాని తెలీవు. పిల్లలా... ఎంతలో ఎదిగివస్తారు? మీరేం దిగులుపడకండి.''

''మా అమ్మే.... చిన్నదానివైనా చల్లని మాటన్నావు. నీకన్నీ ఆకళింపే'' అందావిడ మెచ్చుకోలుగా చూస్తూ

ఆ ఇంట్లో ఒక పిల్లలాగే కలిసిపోయింది పద్మ.

భ్రమరాంబదదో తత్వమని గ్రహించింది పద్మ.

ఆవిడ మూడ్ బాగుంటే ఎవ్వరినన్నా ఆకాశానికెత్తేస్తుంది.

లేకపోతే విమర్శిస్తుంది.

అప్పుడప్పుడూ విమర్శలు పద్మ చెవినపడ్డాయిగూడా.

ఎవరిగురించోకాదు తనగురించే.

''ఆ డ్రస్సేమిటి? చక్కగా చీరకట్టుకోకుండా''





నాన్నోయ్!...
నీ మీద కోపం వచ్చి అమ్మ
గోడకేసి తల బాదుకుంటుంది!!
ఏం ఫరవాలేదులే!
మనది నాగార్జున సిమెంట్ తో
కట్టిన ఇల్లు కదా! గోడ లేమీ
బీటలు పడవు!!
MAM 79

"ఈ ఈడు పిల్లకి వంటరాకపోవడం ఏమిటి? అందరికీ చాకిరీలు చెయ్యలేక నేను చచ్చిపోతున్నాను."

ఇత్యాదులు విన్నది పద్మ.

ఒకసారి అడిగింది ఆవిడ పద్మని "ఏమ్మా... శ్రీరామూ, నువ్వూ పెళ్ళి చేసుకోవాలనుకున్నారా?" అని.

పద్మ ఎంతో సహజంగా అంది- "లేదండీ- ఇద్దరం కలిసి చదువుకున్నాం- స్నేహం అంతే!"

"అట్లాగా?" అని వూరుకుంది.

సాయంత్రం పద్మ రావడం లేటవుతే- అనుమానంగా చూస్తూ ప్రశ్నలడిగేది. కూపీలు లాగుతున్నట్లుండేది.

అట్లాంటప్పుడు మాత్రం కాస్త ఇబ్బందిగా వుండేది పద్మకి. ఏంచేస్తుంది... తన ఫ్రెండ్స్ వచ్చేదాకా తప్పదు అనుకుంది.

ఆవిడ మంచి మూడ్‌లో లేనప్పుడు-

'బాబాయిగారు' అంటూ పద్మ ఆయనతో మాట్లాడినా మొహం చిట్లించేది.

మధ్యలో ఆయన్ని పిలిచేది పని లేకపోయినా. లేదా పద్మని పిల్చేది.

పద్మ ఆయన ఒక్కొక్కసారి ఆఫీసులనించి కలిసి ఇంటికి వచ్చేవారు. అట్లాంటప్పుడు చాలాసేపు పద్మతో మాట్లాడేదికాదు. మొగుడిని దేనికో దెప్పుతూ వుండేది.

పద్మ దినచర్య రాస్తూనే వుంది డైరీలో.

పద్మ సహజంగా స్నేహస్వభావి గనుక ఆఫీసులో తేలికగా అందరితో కలిసిపోయింది.

★ ★ ★

ఆరోజు పొద్దున నిద్ర లేచేటప్పటికే ఎవరిదో కొత్తాయన గొంతు వినబడుతోంది ఇంట్లో.

"ఎవరు?" అడిగింది పద్మ భ్రమరాంబని.

"అదిగో ఆయనగారి అన్న" మూతి మూడు వంకరలు తిప్పి అన్నది ఆవిడ.

ఆశ్చర్యంగా చూసి బాత్‌రూమ్‌కేసి నడిచింది పద్మ.

కాఫీ తాగుతుండగా రహస్యంగా చెప్పింది భ్రమరాంబ.

"ఈనాడు పొట్ట చేతబట్టుకుని మేము ఇంతదూరం రావడానికి కారణం ఈ మహానుభావుడే"

పద్మ వినసాగింది.

"ఆస్తీ, సొమ్మూ, పాతసామగ్రి అంతా కాజేసి మమ్మల్ని కట్టుగుడ్డల్తో వీధిలో నించోబెట్టారు-"

"..."

"ఇళ్ళు కట్టారు, వాకిళ్ళు కట్టారు. బాంక్ బాలెన్సు లక్షలుంది. ఎట్లావచ్చింది ఇదంతా? ఇద్దరికీ పన్నెండేళ్ళవారవుంది. చదువు చెప్పించాను- పెళ్ళిచేశాను. డబ్బంతా అయిపోయింది అన్నాడాయన. ఈ తమ్ముడు నమ్మి వూరుకున్నారు. ఇంతకీ అంతా తలరాత. ఖర్మ" అంది ఆవిడ.

ఇంటరెస్టింగ్‌గానే ఉందనుకుంది పద్మ. ఇది తనకి పనికొచ్చేదే.

ఆ రోజు సెలవేగనుక వాకిట్లోకి వచ్చి కూచుంది.

రామలింగంగారు తీరిగ్గా పేపరు చదువుతున్నారు.

ఆయన్ని పరీక్షగా చూసింది.

మనిషికి అరవైఏళ్ళపైనే వుంటుంది వయసు. ధనవంతుడి లక్షణాలు కనబడుతున్నాయి.

"నువ్వా అమ్మాయ్ వీళ్ళింట్లో వుండేది. నీపేరు?"

చెప్పింది.

కళ్ళజోడు కిందనించి పద్మని పరిశీలనగా చూశాడు.

"ఏవూరమ్మాయ్?"

చెప్పింది.

"అయితే ఇంతదూరమెందుకు వచ్చావు? ఆడపిల్లవి ఒక్కదానివీ..."

"మీ తమ్ముడిగారిలాగానే అండీ... ఉద్యోగం కోసం"

ఆయన ఖంగుతిన్నట్టు చూశాడు.

"అన్నదమ్ములు గుప్పెడన్నం పెట్టలేకపోయారండీ! నువ్వంటే నువ్వని వంతులేసుకున్నారు. నాకెక్కడా వుండబుద్ధికాలేదు. ఇక్కడికొచ్చేశాను. చెప్పే వచ్చాననుకోండి"

"మరి ఉద్యోగం దొరికిందా?"

"దొరికిందండీ!"

ఆయన కాసేపాగి అన్నాడు- "మా తమ్ముడి గురించి తప్పుగా విన్నావేమో నమ్మా! వాణ్ణి నేను వెళ్ళగొట్టలేదు. వాడికే బుద్ధిపుట్టింది... వచ్చేశాడు. ఏం... వచ్చేస్తేమాత్రం వాడికేం హాయిగా వున్నాడు... చక్కగా ఇంటినిండా పిల్లలు. అసలు సంపద అదే... కలకలలాడుతూ"

"ఆ... మాకేం! మీలాగా వచ్చేపోయే బంధువులతో హాయిగావున్నాం" అంది భ్రమరాంబ వస్తూ.

ఆ పూట వంట పద్మే చేసింది.

అన్నదమ్ములూ, భ్రమరాంబ మాటలూ, వాదులాటలూ దాటి పోట్లాటల్లోకి దిగారు.

ఇల్లు అమ్మకం గురించి పోట్లాట!

"మీరింతకాలం తిన్నది చాలు ఆ ఇల్లు మాకు వదలండి-" అంటుంది భ్రమరాంబ.

"మేమేం తిన్నాం... ప్రతిదాంట్లోనూ మీకు భాగమిచ్చాం. చదువు చెప్పించి ఇంతవాణ్ణి చేసినందుకు కృతజ్ఞతయినాలేదు. పెళ్ళాంచేతిలో వీడో కీలుబొమ్మ, సిగ్గయినా లేదు"

"మాటలు జాగ్రత్తగా రానీ..... సిగ్గులేంది ఎవరికి?"

"నీకే"

"నాకుకాదు.... నీకే. పెళ్ళాంచేతిలో కీలుబొమ్మ అనేమాట నీకే వర్తిస్తుంది. పైగా నన్నంటావ్ కామెర్ల రోగిలాగా...! నీ పెళ్ళాం మెతుకు పెట్టకుండా మాడ్చినప్పుడూ, చద్దన్నం మా ముఖాన కొట్టినప్పుడూ, దొంగతనం అంటగట్టినప్పుడూ.... నోరెత్తావా?"

"అంతేకాదండీ.... ఇంకా వున్నాయి మీ వదినగారి లీలలు. ఎన్ని చిత్రాలు చెయ్యకపోతే ఆ ఇల్లు కట్టగల్గింది? వంటినిండా నగలు దిగేసుకోగల్గింది? ఒకటా రెండా... తల్చుకుంటే ఇప్పటికీ రక్తం కుతకుతా వుడుకుతుంది. ఒళ్ళు మండుతుంది. నేను కడుపుతో వున్నప్పుడూ, కని బాలింతరాలుగా వున్నప్పుడూ నన్ను ఎన్నెన్ని విధాల బాధపెట్టింది? ఎంత గయ్యాళి అత్తగారున్నా నేనన్ని బాధలు పడేదాన్నికానేమో"

"ఇదిగోనమ్మో... నీకే చెప్పేది... మేమూ మేమూ అన్నదమ్ములం. లక్ష వుంటాయి మామధ్య... నువ్వెందుకు మధ్యలో కలగజేసుకుంటావు?"

"ఏవమ్మో గీవమ్మో అంటే వూరుకునేది లేదు. చేతనయితే మర్యాదగా పిలవండి లేదా మాట్లాడకుండా వూరుకోండి"

"ఏమిటమ్మా.... నీ బెదిరింపు.... ఏంచేస్తావు?" మీదిమీదికొచ్చాడు.

"ఒరేయ్ అన్న...య్యా!" కర్కశంగా అరిచారు నాగలింగంగారు.

"దాని ఒంటిమీద నీచెయ్యిపడిందో.. నీరక్తం కళ్ళజూస్తాను... అది నా పెళ్ళాం"

ఆ అరుపుకి అంతా పరుగెత్తుకొచ్చారు. వాళ్ళవేవీ గమనించే స్థితిలో లేరు.

"తెలుసులేవోయ్... పెద్ద మొనగాడివి. పెళ్ళాన్ని అదుపులో పెట్టుకోలేడుగానీ పెద్ద చెప్పొచ్చాడు పెళ్ళాంట పెళ్ళాం!"

"ఏమన్నావ్ రాస్కెల్"

"నన్ను రాస్కెల్ అంటావురా?"

చెయ్యెత్తాడు.

ఆ ఎత్తిన చెయ్యి పట్టుకుని వెనక్కి తోశారు అన్నని నాగలింగంగారు.

ఆ తోపుకి ఆయన వెళ్ళి కుర్చీమీదపడ్డాడు. తలకి బలంగా దెబ్బ తగిలింది. రక్తం కారసాగింది!

రౌద్రమూర్తిలాగా లేచాడు రామలింగంగారు పళ్ళు పటపటా కొరుకుతూ.

తమ్ముడ్ని ఆచెంపా ఈచెంపా ఎడతెరిపి లేకుండా కొట్టి బయటకెళ్ళిపోయాడు.

అందరూ శిలాప్రతిమల్లాగా నిలబడిపోయారు. భ్రమరాంబ శాపనార్థాలు ప్రారంభించింది.

★ ★ ★

మర్నాడు పద్మ ఆఫీసునుంచి వస్తూ బస్ స్టాప్‌లో నుంచుంది. రామలింగంగారు ఆ పక్కనేవున్న హొటల్నించి వస్తూ పద్మని చూసి ఆగారు.

"అమ్మాయ్... నువ్వు మా తమ్ముడింట్లో వుంటున్న పిల్లవిగదూ?"

"అవును.... పెదనాన్నగారూ"

"చీరకట్టుకుంటే ఒకరకంగా వున్నావు. ఈ డ్రస్సుల్లో ఇంకోరకంగా వున్నావు. నిన్ను గుర్తుపట్టడం కష్టమేనే"

"డ్రస్సులు ఏవి వేసుకున్నా మనిషిని ఒకదాన్నే కదా?" నవ్వింది పద్మ.

మళ్ళీ అంది- "పెదనాన్నగారూ ! చిన్న సందేహం. ఆయన మీ తమ్ముడన్నారు మీ నిజం తమ్ముడేనా?"

"అదేమిటి అట్లా అడుగుతున్నావు?"

"నాకు సందేహం వచ్చింది. అందుకే అడుగుతున్నాను. నిజంగా మీరు ఆయనకి అన్నయ్యేనా?"

"అవును?"

"నిజంగా అన్నదమ్ములేనా? ఒక తల్లి పిల్లలేనా?"

"అవును. అవును...... ముమ్మాటికీ అవును"

"మీ ఇద్దరిమధ్యలో తేడా ఎన్నేళ్ళు?"

"పన్నెండేళ్ళు ఏం?"

"చిన్నప్పుడు అంటే మీ తమ్ముడు పుట్టినప్పుడు మీకు పన్నెండేళ్ళు కదూ? మీ తమ్ముణ్ని మీరు ఎత్తుకు తిరిగేవారు.... అవునా? ఒళ్ళో పడుకోబెట్టుకుని ఆడించేవారు కదూ?"

"అవును..... అది నీకెట్లా తెలుసు?"

"అప్పుడు మీ తమ్ముడు మిమ్మల్ని తన బుల్లికాళ్ళతో తన్నేవాడు కదూ? అప్పుడు మీకు కోపం వచ్చిందా?"

"రాలేదు... ఆ కాళ్ళని ముద్దుపెట్టుకునేవాణ్ని!"

"ఈ తమ్ముడు ఎప్పుడు పెద్దవాడై నాతో ఆడతాడా అని ఎదురుచూసేవారు కదూ?"

"అవును-"

"మీ తమ్ముడికి ఎప్పుడన్నా వంట్లో బాగా లేకపోతే మీరు చాలా బాధపడిపోయేవారు కదూ?-"

"అవును.... నాకు చాలా బాధగా వుండేది. ఏడుస్తూ కూర్చునేవాణ్ని"

"మీ తమ్ముడికి అన్నీ మీరే నేర్పించారు కదూ. నీళ్ళు పోసుకోవడం, బట్టలు తొడుకోవడం, సైకిల్‌తొక్కడం అన్నీ మిమ్మల్నిచూసే నేర్చుకునేవాడు కదూ?"

"అవును..... వాడికన్నీ నేనే నేర్పాను. సరె గానీ.... అన్నీ చూసినదానిలా ఎలా చెప్పగలుగుతున్నావు?"

"మీ తమ్ముణ్ని ఎవరైనా ఏమైనా అన్నా కొట్టినా మీకు చాలా కోపం వచ్చేది గదూ?"

"అవును"

"మీ అమ్మ అయినా సరే..... మీ తమ్ముణ్ని దండిస్తుంటే మీరు తమ్ముణ్ని వెనకేసుకొచ్చేవారు కదూ?-"



"అవును..... అన్నీ నీకు చెప్పాడావాడు?"

లాగూ చొక్కాలతో తిరుగుతున్న తను, పసివాడుగా తన తమ్ముడు వున్నప్పటి సంఘటనలు మధురమైన బాల్యస్మృతులు కళ్ళ ముందుకొచ్చాయి.

మదిలో మెదులుతున్నాయి.

పద్మ అంది "మీ నాన్నగారు తనకి ఉన్నదంతా మీకిచ్చి కన్నుమూశారు. మీరిద్దరూ అన్నదమ్ములు..... ఒకేరక్తం పంచుకు పుట్టినవాళ్ళు. మీ భార్యలు, వాళ్ల అభిప్రాయాలు అట్లా వుంచండి.

మీ ఇద్దరూ చిన్నప్పుడు ఏప్రేమతో ఏవాత్సల్యంతో పెరిగారో, అమ్మపెట్టిన అన్నం ముద్దకూడా చెరిసగం కొరుక్కుని పంచుకునేవారో-

అదేవిధంగా అనురాగం కూడా పంచుకుని హాయిగా కాలంగడపలేరా? ఇవన్నీ మీకు తెలియనివికావే.

నీ తమ్ముణ్ని కొట్టినందుకు మీకు

ఏ మూలో బాధవుండే వుంటుంది. ఒక్కసారి కాసేపు ఆలోచించండి. జరిగినదానికి పశ్చాత్తాపం కూడా వుంటుంది. తప్పకుండా!"

ఆగింది పద్మ.

"అమ్మాయ్... నువ్వు చిన్నదానివైనా నిన్ను మెచ్చుకోవాలమ్మా " ఆలోచనగా అన్నారాయన.

బస్ వచ్చింది ఇంతలో-

"వస్తా పెదనాన్నగారూ..... మళ్లీ కలుద్దాం"

బస్ ఎక్కింది పద్మ. బస్ కదిలింది. అట్లాగే చూస్తూండిపోయారు రామలింగంగారు.

★ ★ ★

హాస్పిటల్‌నుంచి ఫోన్ వచ్చిందని మెసేజ్ వచ్చింది నాగలింగంగారికి.

పరుగెత్తారు కంగారుగా.

"మీ అన్నయ్యగారికి యాక్సిడెంటయింది. మీరు తొందరగారావాలి" ఇదీ మెసేజ్.

ఏంచేయాలో తెలీక కుర్చీలో కూలబడ్డాడాయన.

"అయినవాళ్లకి అన్యాయం చేస్తే భగవంతుడు ఊరుకుంటాడా? తగిన శాస్తి జరిగింది" భ్రమరాంబ అందుకుంది విషయం తెలిసి.

"ఏంచెయ్యాలిట.... పెళ్లానికి ట్రంకాలా, టెలిఫోనా, మనకి తప్పుతుందా.... - చేసిరండి. టెలిగ్రాం ఇవ్వండి."

"..........."

"వెళ్లిచూసి రావద్దూ? ఆ డాక్టర్లనీ మందులనీ మాకులనీ వూ(పదండి.... చచ్చేట్టు కొట్టినా నానాతిట్లూ తిట్టినా డబ్బంతా కాజేసినా చిప్పచేతికిచ్చినా ఆయన మీ అన్నకాకపోతాడా? మీరు తమ్ముడు కాకపోతారా?

ఇంకా ఏదో అంటూనేవుందావిడ. నాగలింగంగారు ఈలోకంలో లేరు.

"బాబాయిగారూ!"

కళ్లు తెరిచాడాయన. కళ్లు ఎర్రబడివున్నాయి.

కనబడని కన్నీళ్లు.

ఎదురుగా పద్మ.

"మీరు వెళ్లరా?"

అర్థంకానట్టు చూశారు

"మీరువెళ్లడం లేదా?"

తల వూపాడు. అవుననో కాదనో అది.

"మీ అన్నయ్యగారు ... మీ అన్నయ్యగారేగా? స్వంత అన్నయ్యేగా? ఒక తల్లి బిడ్డలేగా? లేకపోతే కజిన్ బ్రదరా?"

"కాదు"

"మరి మీరులేవరేం? కంగారు పడరేం?

అవతలాయన చావుబతుకుల్లో వున్నారు రక్తం కావాలేమో ... ఇంకేదైనా కావాలేమో ఎవరు చూస్తారు మీ ఇద్దరిదీ ఒకేరక్తం కాదా? ఆయనట్లావుంటే మీకు మనశ్శాంతి వుంటుందా? ఆస్తి, డబ్బు శాశ్వతమా? మనిషిపోతే మళ్లీ వస్తారా? లేవండి ... ఆస్పత్రికి వెళదాం"

యంత్రంలాగా లేచాడు.

టాక్సీ వచ్చింది. ఎక్కాడు. పద్మకూడా ఎక్కింది. భ్రమరాంబ కూడా ఎక్కింది.

టాక్సీ కదిలింది.

"తమ్ముడూ" బావురుమన్నాడాయన.

"అన్నయ్యా." ఈయనకీ కన్నీరాగలేదు.

పేగు లాగింది.

రక్తసంబంధం అది.

"నన్ను క్షమించరా ... నేను నిన అన్యాయం చేశా(రా! అందుకే ఇట్లా అయిం( ఇంకనించీ ఆ ఇల్లు మీదే, బాంకు బాలెన్సు( నగం నీపిల్లలకు చెందాలి. ఇప్పుడే రాసి( నురా ... అందుకే నిన్ను పిలవమన్నాన లేకపోతే. లేకపోతే"

"ఊరుకో అన్నయ్యా..... ఇప్పుడా మాటల వద్దు ... విశ్రాంతి తీసుకో"

"ఇంక మీ వదిన, పిల్లల బాధ్యత నీదేర నేను బతకను"

"అన్నయ్యా" పెద్దగా ఏడ్చేశాడు.

"అట్లా అనకు. నువ్వు బతుకుతావు... నీకే( ఫర్వాలేదు"

డాక్టర్ వచ్చాడు.

"రక్తం ఎక్కించాలంటే నాది తీసుకోం( డాక్టర్. మా ఇద్దరిదీ ఒకే గ్రూపు"

తమ్ముడి ప్రేమ, మమత, అనురాగం అది

"అమ్మా భ్రమరాంబా.... మీ అక్కయ( పిచ్చిది. ఏదన్నా చెడుంటే..... అది నా( దాన్ని పిల్లల్ని మాత్రం మీరు కాస్త చూస( కోండమ్మా! పిల్లలు ఇంకా పసివాళ్లు. భ( వంతుడు నాకు శిక్ష విధిస్తున్నాడు"

"అట్లా అనకండి బావగారూ ... నాకు( తండ్రయినా, మావగారైనా, బావగారైనా అన్నీ( మీరే. మీకేమీ ప్రమాదంరాదు. కోపంలో మాట మాటా అనుకున్నా మనమంతా ఒకింటివాళ్లం" కన్నీళ్లు ధారాపాతంగా కారిపోతున్నాయామెకి.

పద్మ చిత్రంగా చూసింది.

ఇదే బంధం? ఇదే రాగం?

ఆరోజు డైరీలో చాలాచాలా రాసుకుంది.

తమ్ముడి రక్తంతో అన్న కోలుకుంటున్నాడు!

★ ★ ★

"హలో మిస్ పద్మా... మీరెక్కడికి వెళ్లాలి? రండి... డ్రాప్ చేస్తాను"

బస్ స్టాప్‌లో నిలబడి తనకొలీగ్ మహేష్‌తో మాట్లాడుతున్న పద్మ ఉలిక్కిపడి తలెత్తిచూసి తన కళ్లని తనే నమ్మలేకపోయింది.

తమ ఆఫీసరు మిస్టర్ భండారే! వెంటనే

దృకి కనుబొమలు ముడిపడ్డాయి. "ఏమిటీ మనకి ఈమాత్రం మానర్సులేదా? నన్ను పిలుస్తున్నాడు. కాని తన ఆఫీసులోనే పనిచేస్తున్న టివర్కరు మహేష్‌ని పిలవడేం?" అనుకుంది.

అయినా ఈయన తన ఆఫీసరు. జాగ్రత్తగా వుండాలి.

"థాంక్యూసార్.... నేను బస్సులో వెళ్లిపోతాను" అంది చిరునవ్వు తెచ్చుకుని పద్మ.

"లేదు.... కారెక్కు. నీతో కాస్త అర్జెంటు విషయాలు మాట్లాడాలి"

అది ఆజ్ఞలాగా వుంది.

పద్మ మహేష్‌వైపు చూసింది. వెళ్లమన్నట్టు సైగచేశాడు అతడు.

మహేష్ తనతోబాటే పనిచేస్తున్నాడు అసిస్టెంట్‌గా.

మహేష్ సైగచెయ్యడం చూసిన ఆఫీసరుకి చికాకు కలిగింది కాబోలు విసుగ్గా ముఖంపెట్టాడు. ఇష్టంలేకపోయినా డోర్ తీసుకుని వెనక సీటులో ఎక్కబోయింది పద్మ. ముందు డోర్ తెరచి పట్టుకున్నాడాయన. ఎక్కక తప్పలేదామెకి.

చాలాసేపు మౌనం తరువాత-

"కాఫీ తాగుదామా?" అడిగాడాయన హోటల్ ముందుకారాపి.

"ప్లీజ్ ఇప్పుడేం వద్దు" అంది.

కానీ అతడు దిగివెళ్తుంటే తనూ వెళ్లక తప్పలేదు.

రెండు కప్పుల కాఫీ ఆర్డరిచ్చి-

తన విషయాలడగటం ప్రారంభించాడు.

పొడిగా సమాధానాలు చెప్పిందామె.

"మా నీస్ వస్తోంది స్టేట్స్‌నించి. ఆమెకి ఈ ఊరంతా చూపించాలి. అంటే చూడదగినవి. నీకేమన్నా అభ్యంతరమా?"

"అబ్బే... అభ్యంతరమేమీలేదు. ఎప్పుడో చెప్పండి. సెలవురోజయితే మంచిదేమో?"

అంది పద్మ.

"రేపొస్తోంది తను... ఎల్లుండి వీలేనా?"

ఆరోజు ఆదివారం.

"సరే... అట్లాగే"

"ఆదివారం పొద్దున మీ ఇంటికి కారు పంపిస్తాను. అందులోనే ఆమె వస్తుంది"

తల వూపింది అంగీకారంగా. మళ్లీ వెళ్లి కార్లో కూచున్నారు. ఇంటిదగ్గర దింపి వెళ్లిపోయాడాయన.

ఆయన ప్రవర్తనలో ఏదో అసహజతవుంది అనిపించింది పద్మకి.

రాత్రి చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయింది.




పొద్దున్నే ఆఫీసుకు రాగానే మహేష్ అడిగాడు నెమ్మదిగా—

"ఏమిటి మన బాస్ మాట్లాడిన అర్జంటు విషయాలు?"

"ఏంలేదు" అంటూ జరిగింది చెప్పింది.

"నాకో సందేహం వస్తోంది ఇన్నాళ్లూలేని అభిమానం నామీద ఇంత హఠాత్తుగా కలిగిందేమిటి" అని.

"ఆయనకి ఆడపిల్లలమీద హఠాత్తుగానే ప్రేమ, అభిమానం వగైరాలు కలుగుతాయి. మళ్లీ అంత అకస్మాత్తుగానే పోతాయిగూడా!" వెనకాలింకెవరో అన్నారు.

"ఛీ ఛీ" అంది పద్మ.

అంతలో ఎవరికివారే సర్దుకు కూచున్నారు. ఆఫీసరుగారొచ్చారు.

"హలో పద్మా... గుడ్‌మార్నింగ్!"

అందరూ ఆయన్ని విష్ చేస్తుంటే- ఆయన పద్మని విష్‌చేశాడు.

అందరూ కళ్లెగరేశారు.

పద్మ తనూ నవ్వుతూ విష్‌చేసి ఆయన వెనకే వెళ్లింది.

ఆరోజు ఆయన ఏదో వంకమీద పద్మని పిలుస్తూనే వున్నాడు.

సాయంత్రం వెళ్లేటప్పుడు- "మిస్ పద్మా మీరు వెళ్లకండి. నేను డ్రాప్ చేస్తాను" అన్నాడు.

అదేమాట మహేష్‌తో చెప్పివచ్చింది.

మహేష్ జాగ్రత్తంటూ హెచ్చరించాడా మెని. మరేం ఫరవాలేదన్నట్లు నవ్వుతూ తలూపింది పద్మ.

మహేష్ ఆమెకు మంచి స్నేహితుడు. మహేష్‌తో ఈమె మాట్లాడటం. ఇద్దరూ నవ్వుకోవడం, అంతా చూశాడు తన రూమ్‌లోంచి బయటికి వచ్చిన ఆఫీసరు.

ఇద్దరూ కలసి బయటికి వెళ్లగానే

"చేపకి ఎరవేస్తున్నాడు" అన్నారెవరో సన్నగా.

ఇద్దరూ కారెక్కారు.

ఈసారి ఫ్రంటు సీటులోనే కూర్చుంది పద్మ.

"చూడండి పద్మా... మీకూ మహేష్‌కీ మంచి స్నేహం అనుకుంటాను?"

"అవును... సహృదయులంతా నా స్నేహితులే. ఆమాటకొస్తే మీరూ నా స్నేహితులే"

అన్నది పద్మ.

"నువ్విక్కడికి కొత్త అంటున్నావుగదా... అతడు సహృదయుడని ఎట్లాచెప్పగలవు?"

"నాకు మంచివాడనే అనిపిస్తుంది సార్ అతడి మాటతీరు, ప్రవర్తన చాలా సంస్కార పూరితంగా వుంటాయి!"

నచ్చని ముఖం పెట్టాడాయన.

"ఈరోజుల్లో సంస్కారం అంటే వేరు. అందరూ మొదట్లో అట్లాగే ప్రవర్తిస్తారనుకుంటాను"

ఎందుకో వ్యర్ధ తర్కం అనిపించిందామెకి.

"ఏమో సర్... మీరు చెప్పిందీ నిజమేనేమో... కానీ... నా మనసుకి నచ్చనప్పుడు... ఏవనైనాసరే... సునాయాసంగా వదిలివేయగలను"

"మహేష్‌తో ఎక్కువ స్నేహం వద్దు. నేను చెప్తున్నాను. అతడు మంచివాడుకాదు"

"అంటే?"

"అంటే... అంటే... అతడు... పెళ్లయిన బ్రహ్మచారి... పెళ్లయిన బ్రహ్మచారి చాలా ప్రమాదకరమైన మనిషి"

"పర్సనల్ విషయాలతో మనకేం సంబంధం సార్... మేము కేవలం స్నేహితులం... ఆ స్నేహం ఆఫీసువరకే పరిమితం"

"అదిగో అక్కడే పొరబడుతున్నావు... నీ ఉద్దేశాలు, ఊహలు అవి! అతడి ఊహలు నీకేం తెలుసు?"

"........."

"నా మాటవిని వాడికి దూరంగావుండు"

అప్పుడూ మాట్లాడలేదు పద్మ.

పద్మవైపే తదేకంగా చూశాడాయన. ఎర్రటి షల్వార్ కమీజులో పువ్వులాగా వుంది పద్మ. ఈయన ఎట్లాంటివాడా అని మొదటిసారిగా అంచనా వెయ్యసాగింది మనసులోనే.

"మీ అంకుల్ నాతో స్పెషల్‌గా చెప్పడంవల్ల ఈ ఉద్యోగం నీకిచ్చాను. నాకు నువ్వంటే సదభిప్రాయం కలిగింది. నీమీద నాకు కొంత బాధ్యత కూడా వుందని నేననుకుంటున్నాను. నేనేది చెప్పినా నీమంచికోసమేనని గ్రహించు"

అన్నాడాయనే మళ్లీ-

పద్మ మౌనంగానే వుండిపోయింది.

"ఆ... అన్నట్టు మానీస్ వచ్చింది రేపు మీ ఇంటికొస్తుంది. నువ్వు రెడీగా వుండు"

అంతలో పద్మ ఇల్లు వచ్చింది. థాంక్స్ చెప్పి ఇంట్లోకి నడిచిందామె.

★ ★ ★

మర్నాడు పొద్దున ఎనిమిదిగంటలకల్లా కారు వచ్చింది. దాంట్లో ఒక యువతి వుంది. డ్రైవరు లోపలికి వెళ్లి పద్మతో చెప్పాడు. పద్మ బయటికొచ్చి ఆవిడకి నమస్కారంచేసి లోపలికి రమ్మంది.

ఆవిడ రానంటే, ఎక్కువ బలవంతం చేయకుండా తనే వచ్చి కూచుంది.

ఆవిడ పెద్ద ఫ్రెండ్లీటైపుకాదని గ్రహించింది పద్మ. ఆవిడ పేరు దీప.

ఆవిడకి అన్నీ దగ్గిరుండి చూపించడం ప్రారంభించింది పద్మ.

కాసేపయేటప్పటికి ఆవిడ ముభావాన్ని వదిలింది. పద్మని లైక్ చేసింది. ఆవిడ ఆఫీస






పరస్త్రీతో పరాచికం
"పద్మా... నా దగ్గర బోలెడు డబ్బుంది. అందుకని డబ్బుకాదు నాకు కావలసింది. నువ్వు. నిన్ను నేను తరచుగా బాధపెట్టను. ఈ రాత్రికి అప్సరా హొటల్లో గది తీసుకుంటున్నాను. ఈ ఒక్కరాత్రి నాతో గడిపితేచాలు..."
ఈ మాటలు అంటున్నది మహిళా మండలి సెక్రటరీ సరళాదేవి తమ్ముడు రమేష్- అదీ భర్తచాటున పరువుగా బతికే ఓ పక్కాగృహిణితో.
అతనికంత ధైర్యం ఎలా వచ్చింది?
అసలు ఆ పరిస్థితి అంతవరకు రానిచ్చిందెవరు?
తమిళ కథ 'రెండు రాత్రులు'
డిసెంబరు విపుల లో చదవండి.

రుగారికి ఏవిధంగా నీసో అర్థంకాలేదు.

"మీ అంకుల్" అని ఏదో చెప్పబోతే "ఆయన మా అంకుల్‌కాదు" అని తెంపేసింది... సంభాషణ. వీళ్లిద్దరిమధ్యా ఇంకేదోవుంది అనుకుంది. మళ్లీ తనకెందుకులే అని పూరుకుంది.

మొదట కుతుబ్‌మినార్ చూడాలంది సవిత. వెళ్లారక్కడికి.

సవిత తన కెమేరాతో వివిధ ఏంగిల్స్‌లో ఫొటోలు తీసుకుంది.

ఆ తరువాత రెడ్‌ఫోర్ట్ వెళ్లారు. అంతా చాలా జాగ్రత్తగా చూసింది సవిత.

తీన్‌మూర్తి భవన్. అంతా తిరిగి చూశారు. జనపథ్. రాజపథ్. రోడ్లమీదుగా వెళ్లారు.

రాష్ట్రపతి భవన్. పార్లమెంట్ హవుస్ బయటినుంచే చూశారు.

ఫారిన్ ఎంబసీ హవుస్‌లమీదుగా వెళ్తూ బయటినుంచే అన్నీ చూశారు.

ఓల్డ్ ఫోర్ట్‌కు వెళ్లారు. "ధృతరాష్ట్రుడి సభ. కృష్ణరాయబారం ఇక్కడే జరిగినాయట" అన్నది పద్మ. ఎన్నిసార్లు చూసినా పవిత్రమైన భావం కలుగుతుందామెకి అక్కడ.

జంతర్‌మంతర్, శాంతివనం, నెహ్రూగారి సమాధి, గాంధీగారి సమాధి, లాల్‌బహదూర్ సమాధి అన్నీ చూశారు. వివిధ రాష్ట్రాల ఎంపోరియంలు చూపించింది పద్మ.

అన్నీ చూసేటప్పటికి సాయంత్రం ఆరు గంటలయింది. మధ్యలో అక్కడక్కడా ఆగి కూల్‌డ్రింకులు, కాఫీలు తీసుకున్నారు. తిరిగొస్తూంటగా దారిలో ఖండారేగారు ఎదురుపడ్డారో టాక్సీలో. చెయ్యి చూపిస్తే ఆపారు కారు. ఆయన టాక్సీని పంపించేసి తనూ ఎక్కాడు కారులో. డ్రైవర్ని వెళ్లిపొమ్మని చెప్పాడు. తను కూచున్నాడు డ్రైవింగ్ సీట్లో. వెనక కూచున్న దీప ముందుకి వెళ్లింది. ఆయన ముందు ఆవిడ భుజంమీద, తర్వాత భుజం చుట్టూ చెయ్యేసి కూచున్నాడు. ఆవిడ ఆయన భుజంమీద తలపెట్టి ఏవో చెబుతోంది. వాళ్లీ లోకంలో లేరు.

"ఎక్స్‌క్యూజ్‌మీ ప్లీజ్... నేను దిగి వెళ్లిపోతాను" అన్నది పద్మ ఏం చెయ్యాలో తెలీక.

"నో నో... ఐవిల్ డ్రాప్ యూ" అన్నా తెలివి తెచ్చుకుని.

పద్మకి వాళ్ల ధోరణి వింతగా వుంది.

తనకెందుకని పూరుకుంది.

ఇంటివద్ద డ్రాప్‌చేశారామెని. ఇద్దర థాంక్స్ చెప్పారు.

కారు వెళ్లిపోయింది.

★ ★ ★

చాలాసేపు ఆలోచించుకున్నమీద మహేష్‌తో ఆయనన్న మాటలు, కిందటిరో సంఘటన వివరించి చెప్పింది పద్మ. ఒక క్షణం మొహంలో రంగులు మారాయి అత కి.

ఆతరువాత చిన్నగా నవ్వాడు.

"నామీద ఆయనకి జెలసీ... అంతే—" సింపుల్‌గా తేల్చేశాడు.

"నీమీద ఆయనకి జెలసీనా ఎందుకూ మహేష్ నువ్వేమీ అనుకోకపోతే ఆయన అన్నిటా నీకంటే అధికుడుకదా"

"అవును... పెద్ద ఆఫీసరు. కారు, బంగళా కుక్క, బాంక్ బేలన్స్, అందమైన భార్య.. అన్నిటా అధికుడే. అయినా జెలసీనే. అదే చిత్రం—"

"అదే... ఎందుకంటావు?—"

"నువ్వే ఆలోచించు. యు ఆర్ ఏన్ ఇంటలిజెంట్ లేడీ. ఆలోచిస్తే నీకు తప్పకుండా తడుతుంది—"

"సరే... ఆలోచిస్తాను. మరి ఆ నీస్ సంగతులేమిటి?—"

"అదా" నవ్వాడు మహేష్. "అట్లాంటి నీసులు ఆయనకెంతమందో వున్నారు. ఏంలేదు. ఇందులో రహస్యం. ఆయన వెంబడి ఎంతమంది ఆడవాళ్లు పడుతున్నారో నీకు తెలియజెప్పడానికి ఆ నీస్ పథకం—"

"నాకా... నాకెందుకు తెలియడం?—"

"అందులోనే వుంది అసలు కిటుకు. నువ్వు కొంచెం తెలివిగా ప్రవర్తించాలి—"

"అంటే?—"

"ఇంతకంటే ఎక్కువ చెప్పడం బావుండదు. నువ్వూ తెలివిగలదానివే... ఆలోచిస్తే తప్ప

ంండా అర్థమవుతుంది—''

''మహేష్... ఇవాళ నేను మీ ఇంటికొస్తాను'' అంది.

''ఓయస్... వెల్‌కమ్'' అన్నాడు మహేష్.

ఆతర్వాత తన సీటులోకి వెళ్లి కూచున్నాడు.

ఆలోచిస్తూనేవుంది పద్మ.

ఆ సాయంత్రం—

''పద్మా.. ఇవాళ నిన్ను మా ఇంటికి తీసుకెళదాం అనుకుంటున్నాను... మా ఆవిడ ఎన్నాళ్లనుంచో నిన్ను చూడాలనుకుంటోంది'' ఆఫీసరుగారన్నారు.

''సారీసర్... నేను రేపొస్తాను. ఇవాళ నాకో అర్జంటు పనివుంది''

''ఏమిటో అది... తెలుసుకోవచ్చా?''

''ఆ... దానికేం? నాకు వేరే ఎంగేజ్‌మెంటు వుంది''

''ఎక్కడ?''

''మహేష్ ఇంటికి వస్తానన్నాను''

''ఐసీ—'' ఆయన మొహం ఎర్రబడింది.

''వీల్లేదు... నువ్వు వాడింటికి వెళ్లద్దు'' ఉద్రేకంగా అరిచినట్లు అన్నాడు. ''అదేమిటి... ఎందుకు?''

మళ్లీ తన ఉద్రేకాన్ని అదుపులోకి తెచ్చుకున్నాడు.

''ముందు మా ఇంటికి రావాలి!''

''లేదు... నేను ముందు అక్కడికి వస్తానన్నానుగదా'' చిరాకు కలిగింది పద్మకి. 'తనని శాసించడానికి ఇతడెవరు? అంతగా అయితే తను ఉద్యోగానికి రిజైన్ చేసేస్తుంది! అంతేగానీ ఇదేమిటీ దౌర్జన్యం?'

''సారీ... నీఇష్టం''

మొహం ముడుచుకుని వెళ్లిపోయాడు. వెళ్లి కార్లో కూచున్నాడు. కారు రయ్యిమని దూసుకుపోయింది.

మహేష్ నవ్వుతూ వచ్చి కలిశాడు.

ఇద్దరూ కలిసి నడుచుకుంటూ బస్‌స్టాండుకి వచ్చారు.

మరుక్షణం ఆఫీసరుగారి కారు అటే వచ్చి వారి ముందునుంచే దూసుకుపోయింది.

''మళ్లీ ఈ కారు ఇటెందుకు వచ్చినట్టు?'' పైకే అనేసింది పద్మ.

''మనకోసం''

''మనకోసమా?''

''మనని కనిపెట్టడానికి''

నవ్వేసింది పద్మ. ''భలేవాడే మొత్తానికి!''

బస్సులో ఎక్కి ఒక రోడ్డుదగ్గర దిగారు. అక్కణ్ణుంచి కొంతదూరం నడిస్తేగానీ ఇల్లు రాదు.

''నువ్వు నిజంగా బ్రహ్మచారివా... మీ ఆవిడ?''

''నువ్వే చూస్తావుగా?''

ఇల్లు చేరారు.

తలుపు వేసివుంది. పరిసరాలు పరిశుభ్రంగా వున్నాయి. కాలింగ్‌బెల్ నొక్కి, చిన్నగా తలుపు తట్టాడు.

వెంటనే తలుపులు తెరుచుకున్నాయి.

చిరునవ్వుతో మహేష్ భార్య దర్శనమిచ్చింది.

స్వచ్ఛమైన మల్లెపూవులాగా వుందామె. మహేష్‌కి తగిన సహధర్మచారిణి అనుకుంది పద్మ.

పద్మని చూసి నవ్వుతూ చేతులు జోడించిందామె. ''రండి... మీరు పద్మగారేనా?''

''అరే... నేను మీకెట్లా తెలుసు?''

నవ్వుతూనే ఆశ్చర్యపోయింది పద్మ.

''సరేలెండి... ఈవిడకి మన ఆఫీసులో తెలియనివారులేరు''

నవ్వాడు మహేష్.

''కూర్చోండి. మల్లీ... ఈవిడ పద్మగారే. సరే ఈవిడ నాభార్య మల్లిక. నేను బ్రహ్మచారిని కాదండోయ్, అక్షరాలా గృహస్థుడినే. ఇప్పుడయినా నమ్ముతారా?''

నవ్వాడు మహేష్.

పద్మ కాస్త కంగారుపడింది మల్లిక ఏమనుకుంటుందోనని!

''మరేం ఫర్వాలేదులెండి. మా మల్లికి అన్నీ తెలుసు మన ఆఫీసరుగారి గురించి కూడా''



"ఈయన మాటలకేంలెండి పద్మగారూ... మీకీ జాబ్ నచ్చిందా? ఎన్నాళ్లుంటారీ ఢిల్లీలో?"

"అన్నీ చెప్పేశాడనమాట మహేష్. నేను ఎక్కువకాలం ఉండటానికి లేదండీ... ఈ జాబూ టెంపరరీ దేగా? బాగానే వుంది" అని-

"మీ సంగతులు చెప్పండి... మీరు టైము ఎట్లా స్పెండ్ చేస్తారు?" అడిగింది పద్మ.

"నేనా? నాకు క్షణంతీరిక వుండదండీ.

...ఇంటిపనీ, వంటపనీ ఇంకా ఈయన గారి పనీ" అని నవ్వుతూ-

"ఖాళీ వేళల్లో గుడ్డలుకుట్టి రెడీమేడ్ షాపులకి ఇస్తాను. చీరలకి ఎంబ్రాయిడరీ, పెయింటింగ్ చేస్తాను. అవీ షాపులకి ఇస్తాను. అది ఒకరకంగా ఇన్‌కం... ఇంకోరకంగా కాలక్షేపం"

"మీరు చాలా టాలెంటెడ్ అన్నమాట! వెరీగుడ్"

"ఏదోలెండి... ఉండండి ఇప్పుడే వస్తాను"

లేచి వెళ్లింది.

ఎంత చక్కటి జంట!

ఇల్లు అద్దంలాగా వుంది. వస్తువులన్నీ చక్కగా సర్దివున్నాయి ఎక్కడివక్కడ. 'మల్లిక మంచి గృహిణి' అనుకుంది పద్మ.

"ఏమిటి ఆలోచిస్తున్నారు? ఆఫీసరు ఎందుకట్లా అన్నాడా అని? చెప్పలేదూ జెలసీ అని"

"......"

"ఎందుకో ఈపాటికి మీకు అర్థమై వుండాలే!"

తలవూపింది పద్మ.

మల్లిక వేడివేడి పకోడీలు- కాఫీ తీసుకొచ్చింది.

ముగ్గురూ ఛలోక్తులు విసురుకుంటూ తిన్నారు. పద్మకి ఆ జంట ముఖ్యంగా మల్లిక ఎన్నాళ్లుగానో పరిచయం అయినట్లుగా వుంది. కబుర్లతో కాలమే తెలీలేదు.

ఆ తరువాత బస్సులో ఇల్లుచేరింది పద్మ.

★ ★ ★

ఆఫీసరుగారికంటే ముందే కారు దగ్గర నుంచుందారోజు పద్మ.

"వెరీగుడ్ పద్మా... అట్లా వుండాలి. సో యూ ఆర్ కమింగ్ విత్‌మి?"

"అవునుసార్... మేడమ్‌ని చూడాలని నాకూ వుంది"

"వెరీగుడ్. వెల్‌కం... ఒక్కనిముషం" లోపలికి వెళ్లాడు.

వెనకే నడిచింది పద్మ.

ఇంటికి ఫోన్ చేశాడాయన.

హిందీలో మాట్లాడాడు.

"హలో... ఎవరూ? నువ్వేనా... సుమా! ఏమిటీ... ఒక్క అయిదు నిమిషాలుండు. సుమా... ప్లీజ్... మళ్లీ వెళ్లిపోదువుగానిలే! నేను ఒక గెస్ట్‌తో వస్తున్నా. ఇప్పుడే... ఉండలేవా? ఏం... హల్లో... హల్లో... సుమా... సుమా... హల్లో..."

ఫోన్‌పెట్టేసి నిట్టూరుస్తూ లేచాడు.

"నాభార్య చాలా బిజీగావుంది. అయినా ఫరవాలేదు... వెళ్దాంరా"

"ఫోన్ కట్ అయిందాసార్?"

"అవును... అవును" దారితీశాడు బయటికి భండారే.

తనూ బయటికి వచ్చింది పద్మ.

కారులో ఏమీ మాట్లాడలేదు ఆయన.

పద్మ చెప్పింది.

"నిన్ననేను మహేష్ భార్యని మీటయ్యాను సార్... చాలా నైస్‌లేడీ"

"ఆఁ హా" అన్నాడాయన.

తర్వాత మౌనమే.

కారు ఆగింది.

ఆయన ఇల్లు చాలాపెద్దది. నౌకర్లూ చాకర్లూ హంగామా అంతావుంది. పెద్దకుక్క ఎదురొచ్చి ఆయన మీదికి ఎక్కింది.

దాన్ని మెడదువ్వి పాట్‌చేశాడు.

"కమిన్ పద్మా..." లోపలికి దారితీశాడు.

పెద్ద డ్రాయింగ్ రూమ్

కార్పెట్లు, సోఫాసెట్లతో అధునాతనంగా వుంది.

"కూచో పద్మా"




అన్నాడు తనూ కూచుని.

నౌకరు మంచినీళ్లు తెచ్చిచ్చాడు.

"కాఫీ తాగుతావా?"

"ఏదైనా ఫరవాలేదు సార్" అంది.

కాఫీ, బిస్కెట్లు, ఆపిలు ముక్కలు, మిక్స్చర్ తెచ్చాడు నౌకరు.

తనే కప్పుల్లో పోసింది కాఫీని పద్మ.

కాఫీ తాగుతుంటే అడిగింది.

"మేడమ్ లేరా?"

తెలీనట్లు మళ్లీ నౌకర్ని అడిగి చెప్పాడు-

"లేదు... క్లబ్‌కెళ్లింది. ఆవిడ క్లబ్‌కి ప్రె



సిడెంట్. ఇంకా రెండుమూడు క్లబ్బుల్లో మెంబరు. క్షణం తీరదు. అదో కాలక్షేపం. ఎప్పుడూ యానివర్సరీలనో పండగలనో ఏవో ప్రోగ్రామ్స్ వుంటాయి. అంతా ఈవిడ నిర్వహించాల్సిందే. ఈవిడ లేకపోతే ఒక్కటిగూడా చెయ్యలేరు వాళ్లు''

''ఆహా'' ఆశ్చర్యంగా చూసింది.

నవ్వాడు.

బూట్లువిప్పి వెనక్కి వాలాడు.

అక్కడున్న ప్రతి వస్తువునీ పరీక్షగా చూడసాగింది పద్మ.

''పిల్లలు?''

''లేరు''

నౌకరు ట్రేలో సీసాలు గ్లాసులు తెచ్చాడు.

''ఇప్పుడే వస్తాను'' అంటూ లేచివెళ్లాడాయన.

పద్మకి ఎప్పుడెప్పుడు వెళ్లి పోదామా అని వుంది.

మరో పదినిమిషాల్లో ఈవినింగ్ డ్రెస్ వేసుకుని వచ్చాడు.

''కమాన్ పద్మా... ఒక గ్లాసు''

''సారీసర్... నాకలవాటు లేదు. మరి నేనింక వెళ్తాను''

''ఇప్పుడెక్కడి కెళ్తావు? నా భార్యని చూడవూ?''

''ఇంకోసారి''

'నో నో... కూచో... వచ్చేస్తుంది ఆవిడ కూచో... కూచోమంటుంటే.''

కూచుంది. ''మీ నీస్ బయటికెళ్లారా?''

''నీసా?''

గ్లాసు నింపుకుని తాగసాగాడు. ''ఓహో... దీపా? అప్పుడే వెళ్లిపోయింది''

ఒకటి తరువాత ఇంకొకటి...

''నువ్వెందుకు తాగవు? నా భార్య చక్కగ తాగుతుంది తెలుసా?''

అప్పుడే మాటలు తడబడతున్నాయి.

అయినా ఆపడం లేదాయన తాగడం

''మీ భార్య...''

''భార్య'' పెద్దగానవ్వాడు.

''భార్య... భార్యంటే అర్థం నీకు తెలుసా? తెలీదు... నీకెట్లా తెలుస్తుంది? నువ్వింకాఎవరికీ భార్యవి కాలేదుగా... నేను చెప్తాను విను. భార్యంటే... భార్యంటే... వాడున్నాడే... నీఫ్రెండ్ మహేష్... వాడిపెళ్లాం... అట్లా వుండాలి భార్యంటే. నాకు వాడంటే ఈర్ష్య, అసూయ అందుకే, అందుకే నీకట్లా చెప్పాను. నువ్వూ పెళ్లిచేసుకుంటావుగా అట్లా వుండు సరేనా... నేను మోసపోయాను. నా పెళ్లాం వుట్టి తిరుగుమోతు... నాకు సుఖం ఇవ్వదు... నేనంటే లక్ష్యంలేదు... దానికి కావల్సింది నాహోదా... డబ్బు!! నేనక్కరలేదు. నా జీవితం నరకం చేస్తోంది. దానికి విడాకులు ఇచ్చి పారేస్తాను!''

తూలుకుంటూ లేచి పద్మ దగ్గరికి వచ్చాడు. పద్మ పక్కనే కూచున్నాడు. ఆమె భుజంమీద చెయ్యేశాడు.

పద్మకి చెమటలు పడుతున్నాయి.

''పద్మా... నన్ను చూస్తే జాలివెయ్యడం లేదూ? నేను ఏకాకిని పద్మా... నన్ను... నన్ను... పెళ్లిచేసుకుంటావా... నువ్వు నాకు కావాలి పద్మా... అందుకే.. అందుకే... నిన్నిక్కడికి తీసుకొచ్చాను''

ఒక్కసారి ఒళ్లు జలదరించింది పద్మకి.

అత్తయ్య మాటలు గుర్తుకొచ్చాయి.

మహేష్ మాటల్లోని గూఢార్థం తెలిసొచ్చింది. ధైర్యం తెచ్చుకుంది.

ఆయన మాటలు కొన్ని విన్నది.

''మిస్టర్ భండారే... దిగులు పడకండి. మీరు... మీరు... అట్లా పడుకోండి. మనం అన్నీ తరువాత మాట్లాడుకుందాం''

ఆయన్ని సోఫాలోనే పడుకునేట్లు చేసింది.

''పద్మా... పద్మా... నన్ను వదిలిపోకు... పద్మా...'' భోరున ఏడ్చాడు.

ఆయనకి తన ఒళ్లు తనకి తెలీడం లేదు. కళ్లుమూతలు పడుతున్నాయి. నిశ్శబ్దంగా అట్లాగే కూచుంది కొంతసేపు.

ఆ తరువాత చప్పుడుగాకుండా లేచింది. ''చూడు... నీపేరేమిటో? నాకు కాస్త ఒక టాక్సీ తెచ్చిపెడతావా?'' హిందీలో నౌకర్ని అడిగింది.

అతడు తెచ్చాడు.

"చూడు... అయ్యగార్ని జాగ్రత్తగా చూసుకో" అని టాక్సీ ఎక్కింది.

ఇంటికొచ్చాక కూడా చాలాసేపు ఆ భావనలు ఆమెని వీడలేదు.

ఆ రాత్రి ప్రొఫెసరుగారికీ, శ్రీరామ్‌కీ, అత్తయ్యకీ, తల్లిదండ్రులకీ కూడా ఉత్తరాలు రాశాక పద్మ మనసు కాస్త తేలికపడింది.

★ ★ ★

ఆ ఉద్యోగానికి రిజైన్ చేసింది పద్మ.

"పిన్నీ... రేపందరం కలిసి ఆగ్రా వెళ్దామా? ఎల్లుండి నేను వెళ్లిపోతాను" అంది.

"అట్లాగే గానీ.. ఎక్కడికి వెళ్తావు?"

"బొంబాయి వెళ్లాలి పిన్నీ... నాకక్కడ పని వుంది. బాబాయిగారు టిక్కెట్టు తెప్పిస్తే"

"ఏంపద్మా... నీకిక్కడ బాగోలేదా?" అంది భ్రమరాంబ.

పద్మంటే ఈ మధ్య ఆవిడకి ప్రేమ మరీ ఎక్కువైంది. పద్మ బోధనలవల్లే బావగారు మారిపోయి ఆస్తిలో నిజంగా సగంవాటా ఇచ్చేస్తున్నాడని ఆవిడ గట్టి నమ్మకం.

ఏదేవుడో పంపిన సహాయమే లక్ష్మీదేవిలాగా పద్మ రూపాన వచ్చిందని ప్రతి నిమిషమూ అంటుందావిడ.

ఆ ఇంట్లో మళ్లీ శాంతి నెలకొంది.

"బావుండకపోవడం కాదు పిన్నీ... నేను వచ్చిందే పనిమీద. నాకు బొంబాయిలో కూడా పని వుండటంవల్ల వెళ్లకతప్పదు."

"టిక్కెట్టుకేంలే... మీ బాబాయిగారు ప్రయత్నిస్తారు. ఒక్క టిక్కెట్టేగా ఫరవాలేదులే" తరువాత నాలుగయిదు రోజులకి టిక్కెట్టు దొరికింది పద్మకి.

ఆరోజు అంతాకలిసి ఆగ్రా బయల్దేరారు.

మహేష్, మల్లిక కూడా కలిశారు వాళ్లతో. భండారేగార్ని కూడా రమ్మన్నది పద్మ. ఆయన రాలేనన్నాడు.

అందరూ సరదాగా తాజ్ ఎక్స్‌ప్రెస్‌లో బయల్దేరారు. ఆ బండి చాలా కంఫర్టబుల్‌గా వుంది. ఆగ్రాలో దిగాక టూరిస్టు బస్సు ఎక్కారు. ఆ బస్సు ఆగ్రాలోని చూడదగిన ప్రదేశాలన్నిటినీ చూపిస్తోంది. ఫతేపూర్ సిక్రీ ఆగ్రాఫోర్ట్ అన్నీ...

మహేష్ అందరినీ కలిపీ, విడివిడిగానూ ఫొటోలు తీస్తున్నాడు.

లంచ్ బ్రేక్‌కోసం ఒకహోటల్ ముందు బస్సాపారు. అందరూ భోజనం చేశాక ఆ బస్సు డ్రైవరు గైడ్‌లతో మాట్లాడాడు మహేష్. తాము ముందే తాజ్‌మహల్ దగ్గరికి వెళ్తున్నామనీ మళ్లీ సాయంత్రం అక్కడ బస్సు బయల్దేరబోతూండగా కలుస్తామనీను!

అందరూ తాజ్‌మహల్ దగ్గరికి బయల్దేరారు టాక్సీలో.

తాజ్‌మహల్ రెండుమూడుసార్లు చూసింది పద్మ. కానీ ఇప్పుడు రావడంవేరు. ఎప్పుడు చూసినా కొత్తగానే వుంటుంది తాజ్‌మహల్.

అక్కడికి వెళ్లాలంటే ఎప్పుడూ ఉత్సాహమే.

చుట్టూ పచ్చని పచ్చిక పరుపులాగా వుంది.

తోట చాలా ఆహ్లాదకరంగావుంది.

దూరంనించి కళ్లార్పకుండా చూస్తూనే నడుస్తున్నారు.

మధ్యమధ్య ఫౌంటెన్లు. అటూ ఇటూదారి. అబ్బ! ఆ వ్యూ ఎంతబావుంది.

ఎండలో ఎంతగా మెరుస్తోంది ఆ కట్టడం? పవిత్ర ప్రేమ చిహ్నం. ప్రతి అంగుళంలోనూ అందమే. లతలు, పద్మాలూ ఎంతచక్కగా అమర్చారు?

ముందు పైకి ఎత్తుగా మెట్లున్నాయి. అవి ఎక్కివెళ్తే లోపలికి దారి. చెప్పులు విప్పి వెళ్లాలి. ఆ పాలరాళ్లమీద అడుగుపెడితే పాడవుతాయేమో ననిపిస్తుంది. లోపల రెండు సమాధులు. అక్కడ కాండిల్సు వెలిగించి వుంచారు. ముంతాజ్‌బేగం- షాజహాన్‌ల సమాధులవి.

వాళ్ల అమరప్రేమగాథ చిరస్థాయిగా నిల్చి వుంటుంది గదా ఈ భారతదేశంలో. వాళ్లెంత ధన్యులు.

చుట్టూ తిరిగి ఆ కట్టడం సౌందర్యాన్ని పరిశీలించారు. తాజ్‌మహల్ చూసిన ప్రతివారి హృదయంలోనూ, ఒక పవిత్రమైన భావం కలుగుతుంది. ప్రతి ఒక్కరి హృదయమూ చరిత్రలోవున్న ముంతాజ్ షాజహాన్‌ల చరిత్రను స్మరిస్తుంది. అదొక వింత అనుభవం.

మొత్తంచూసి కిందికి దిగివచ్చారు. ఈలోగా ఎన్నో ఫొటోలు తీశాడు మహేష్.

వచ్చికలో చాలాసేపు కూచుని తాజ్ అపురూప సౌందర్యం తిలకించారు.

ఎంత చూసినా తనివితీరదు.

"వెన్నెలలో తాజ్ అందం ఇంకా బావుంటుందిట. కానీ మనకు ఇవాళ వీలుపడదు" అన్నాడు మహేష్.

అదే అనుకున్నారు అందరూ.

"మీ అందరికీ నేనో మాట చెప్పాలి" అంటూ మొదలుపెట్టి పద్మ తమ అన్వేషణ గురించి చెప్పింది. అదే పనిమీద తను బొంబాయి వెళ్తున్నానని కూడా చెప్పింది.

విన్న అందరూ ఆశ్చర్యపోయారు. ఆ తరువాత తెగమెచ్చుకున్నారు. భ్రమరాంబకయితే కన్నీళ్ళు వచ్చేశాయి.

"నేనప్పుడే అనుకున్నాను... పద్మ అందరాడపిల్లల్లాంటిది కాదని" అన్నది.

అప్పుడే కొత్తగా పద్మని చూసినట్లుగా గట్టిగా కౌగిలించుకుంది.

అందరికీ అదొక రకమైన ఆవేశం కలిగింది.

"మేము కూడా మీ సొసైటీలో చేరొచ్చా?" అడిగాడు మహేష్.

"ఓ తప్పకుండా... మా అందరి రీసెర్చి అయ్యాక ప్రారంభించబోయే కొత్త సొసైటీ పైకి రావాలంటే మీ అందరి సహకారం కావాలి"

"ఓ.... తప్పకుండా వుంటుంది పద్మా మా సహకారం. కొంత విరాళాలు కూడా సేకరించి ఇస్తాం. నువ్వు వున్న కొద్దికాలంలోనే మంచికి పాటుపడ్డావు. ఇంక ఆ సొసైటీ అంటూ వెలిస్తే మాకంతకన్న ఏంకావాలి? విశ్వశాంతి తొందర్లోనే నెలకొంటుంది. ముందు మన దేశంలో శాంతి నెలకొంటుంది" అన్నారు నాగలింగంగారు కళ్ళు చెమర్చగా.

"అదంతా మీ మంచితనం ఆంటీ. నన్నాట్టే పొగడకండి. ఈ పొగడ్తలన్నీ మా ప్రొఫెసర్‌కి చెందాలి" అంది పద్మ.

ఇంతలో బస్సు వచ్చింది.

అందరి హృదయాలూ అనిర్వచనీయమైన అనుభూతితో నిండేయి.

తాజ్ ఎక్స్‌ప్రెస్‌లోనే తిరిగి వచ్చేశారు.

పద్మ ప్రయాణం ఆరోజే.

భ్రమరాంబకి పద్మని పంపించడం ఇష్టంలేదు.

కూతురు పెళ్ళై అత్తవారింటికి వెళ్ళిపోతుంటే తల్లి సారెపెట్టినట్లు భ్రమరాంబగారు పద్మకి పెట్టింది. పద్మ హృదయం కదిలిపోయింది ఆవిడ ఆప్యాయతకి. "పిన్నీ! మీకెట్లా కృతజ్ఞత చెప్పాలో తెలీడంలేదు. ఇన్నాళ్ళూ నన్ను మీ ఇంట్లో వుండనిచ్చిందేగాక, స్వంత కూతురికన్నా ఎక్కువగా చూసుకున్నారు" అంది.

అందరూ స్టేషనుకి వచ్చేసరికి అక్కడ మహేష్, మల్లిక ఉన్నారు.

భండారేని కూడా చూసి ఆశ్చర్యపోయింది పద్మ.

"సార్... మీరొచ్చారా?... చాలా సంతోషంగా వుందిసార్ నాకు"

అంటూ ప్రత్యేకంగా థాంక్స్ చెప్పింది పద్మ ఆయనకి.

"నీ రిసెర్చి సంగతి ఇప్పుడే తెలిసింది పద్మా. చాలా సంతోషం చాలా గొప్పపని చేపట్టారు మీరు. మే గాడ్ బ్లెస్‌యూ. ఈ విషయంలో ఏ సహాయం కావల్సినా నేను చెయ్యడానికి సిద్ధంగావుంటాను"

"థాంక్ యూ సార్"

బొంబాయిలో తమకి తెలిసినవాళ్ళ అడ్రసులు ఇచ్చారు అందరూ.

"రైలు కదులుతోంది ఎక్కమ్మా... పద్మా" భ్రమరాంబ అంది.

అందరి దగ్గిరా సెలవు తీసుకుని రైలెక్కింది పద్మ.

"ఉత్తరాలు రాయమ్మా... పద్మా" అంది భ్రమరాంబ కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ. తల వూపి చేతులు జోడించింది పద్మ.

రైలు కదిలింది.

★ ★ ★

బొంబాయిలో రైలు దిగగానే పద్మ టెలిగ్రాం అందుకున్న స్వాతి ఎదురొచ్చింది. పద్మ సంతో





షంగా కావలించుకుంది స్నేహితురాలిని. కాని స్వాతి అంత ఉత్సాహంగా లేకపోవడాన్ని గమనించి ఎందుకా అనుకుంది.

ఇద్దరూ టాక్సీలో ఇంటికివెళ్లారు. అంథేరీలో వుంది వాళ్ళిల్లు.

పద్మ తండ్రీ- స్వాతి తండ్రీ ప్రాణస్నేహితులు ఒకప్పుడు. స్వాతీ వాళ్ళు మధ్య తరగతి కుటుంబీకులు. స్వాతి తండ్రి మిలిటరీలో చేరాడు.

తండ్రి దగ్గర్నించి గత అయిదారేళ్ళుగా ఉత్తరాలు లేవంది స్వాతి. ఆయన ఉన్నాడా లేదా అనేదిగూడా సందిగ్ధమే వాళ్లకి.

'అందుకే స్వాతి విచారంగావుంది' అనుకుంది పద్మ.

పద్మ తండ్రి అమెరికా వెళ్ళిపోయాక- వీళ్ళ మధ్య ఆట్టే సంబంధాలు లేవు. అప్పుడప్పుడూ స్వాతీ పద్మా ఉత్తరాలు రాసుకునేవారు. కానీ ఏ ఉత్తరంలోనూ స్వాతి ఈ విషయం తెలియజేయలేదు.

అదే అంటే-

''ఏమని రాయాలి... ఈ విషయం?'' అంది. చిన్నప్పట్నించీ బాగాతెలిసిన వారవడంవల్ల పద్మ నిర్మొహమాటంగా తను వస్తున్నట్టు ముందు రాసి టెలిగ్రాం ఇచ్చింది స్వాతికి.

తల్లీకూతురూ వుంటున్నారా ఇంట్లో. ఆ తల్లి స్వాతికి సవతి తల్లి. పేరు శాలిని. పెద్ద వయసున్నదేమీకాదు. తల్లీ కూతురూ ఒక్కసారి చూస్తే అక్కా చెల్లెళ్ళలాగా వుంటారు. ఇద్దరూ ఉద్యోగాలు చేస్తున్నారు.

పద్మ ఢిల్లీలో తన ఉద్యోగపు అనుభవం చెప్పి తనకూ ఎక్కడన్నా వీలైతే ఉద్యోగం చూడమని చెప్పింది. వాళ్ళు సరేనన్నారు.

నాలుగయిదు రోజులయ్యాక చివరికి ఒక ట్యుటోరియల్ కాలేజీలాంటి దాంట్లో ఇంగ్లీషు చెప్పడానికి కుదిర్చారు. అదీ టెంపరరీ బేసిస్ మీదే.

అదే చాలనుకుంది పద్మ.

పొద్దున్నే భోజనం చేసి వెళ్ళిపోతారు తల్లీ కూతురూను.

తనది కాస్త ఆలస్యంగా మొదలవుతుంది కాలేజీకి ఎలక్ట్రిక్ ట్రెయిన్లలో వెళ్ళడం అలవాటయింది.

డూప్లికేట్ కీ తన దగ్గరవుంటుంది. తల్లీకూతుళ్ళు ఒకే ఆఫీసులో పని చేస్తున్నారు. అది విశేషమే మరి.

ముగ్గురూ స్నేహితుల్లాగా కలిసిపోయారు. వంట ముగ్గురూ వంతులు వేసుకుని చేసుకునేవారు. శాలిని గూడా పిల్లల్లో పిల్లలాగానే మెదిలేది. ఆవిడకి పుట్టింటివైపు ఎవరూ లేరు. వాళ్ళిద్దర్నీ కుతూహలంతో గమనించేది పద్మ.

శని, ఆదివారాలలో ఎక్కడికైనా వెళ్లేవారు. మహాలక్ష్మి గుడి, బీచ్, చర్చ్‌గేట్, గేట్‌వే ఆఫ్ ఇండియా- ఇట్లా ఎక్కడికో అక్కడికి వెళ్లేవారు.

స్వాతి, శాలిని ఇద్దరూ అందంలో ఒకరికొకరు తీసిపోరు.

చూడగాచూడగా వారిద్దరి బాంధవ్యంలో ఎక్కడో ఏదో లోపం పొడగట్టేది పద్మకి.

ఎవరిది లోపం.... ఎక్కడలోపం?

స్వాతి తీరు అదో మాదిరిగా వుంటుంది.

స్వాతి ప్రేమలోగానీ పడ్డదా?

అప్పుడప్పుడూ పరధ్యానంగా వుంటుంది. శని, ఆదివారాలలో కూడా ఓసారి వీళ్లిద్దర్నీ వదిలి ఎక్కడికో వెళ్లివచ్చింది.

అడపాదడపా ఆఫీసునుంచి శాలినితో చెప్పకుండా ఎక్కడికోవెళ్ళి రాత్రుళ్లు ఆలస్యంగా రావడం మొదలుపెట్టింది.

ఈ విషయం శాలిని పట్టించుకోనట్లు వుండేది. పద్మ ఒకటిరెండుసార్లు సూచనగా శాలినితో అందామనుకుని కూడా మానేసింది. మళ్లీ తనకెందుకు కొత్తగా వచ్చింది తను అని.

ఒకరోజు రాత్రి నిద్రపోతున్న పద్మ ఉలిక్కిపడి లేచింది.

ఏమిటో గల్లంతు - అర్థంకాలేదు.

పక్కగదిలోకెళ్లిచూసి స్థాణువైపోయింది! ఉగ్రమూర్తిలాగా ఊగిపోతోంది శాలిని. స్వాతిని ఆ చెంపా ఈ చెంపా వాయించేస్తోంది.

స్వాతి ఒకచెయ్యి చెంపమీదా, రెండోచెయ్యి శాలిని చేతిని పట్టుకుని దెబ్బలాపడానికి ప్రయత్నిస్తోంది.

పద్మకి క్షణం ఏంచెయ్యాలో తోచలేదు. ఆరోజు స్వాతి మరీ ఆలస్యంగా వచ్చింది.

తను పడుకునే టైముకి ఇంకా రాలేదు. తరువాతేం జరిగిందో? స్వాతి ప్రేమ విషయం బయటపడిందేమో? అది వాళ్ల స్వవిషయం తను కల్పించుకోకూడదు అనుకుంది.

ఇద్దరూ తనని గమనించలేదు. మెల్లిగా వెనక్కివచ్చి పక్కచేరింది. కానీ, శాలిని అలా కొట్టడాన్ని ఆపాలి. తనేంచెయ్యాలి?

తళుక్కున ఓ ఆలోచన వచ్చి కావాలనే మంచినీళ్లుతాగే గ్లాసు కిందపడేసింది చప్పుడయ్యేట్టు.

ఇద్దరూ గమనంలోకి వచ్చారు అప్పుడు మూడోమనిషి వున్నట్టు.

తరువాత ఏమీ జరగనట్లుగా ఎవరి మంచంమీద వాళ్లు పడుకున్నారు.

స్వాతి ఏడుస్తోందో లేదో గమనించలేకపోయింది పద్మ.

కానీ శాలిని వెక్కివెక్కి ఏడ్చిందని తెలుస్తూనే వుంది.

కనకపోయినా పెంచిన ప్రేమమరి! కొట్టడమయితే కొట్టింది కానీ బాధలేదూ? అనుకుంది పద్మ.

ఆరోజు ముగ్గురికీ నిద్రలేదు.

## 4



మర్నాడు శాలిని మామూలుగానే వుంది.

స్వాతి మాత్రం ముభావంగా వుంది.

అది సహజమేననుకుంది పద్మ.

ఆ సాయంత్రం స్వాతిముందే ఇంటికి వచ్చేసింది. శాలిని ఇంకా రాలేదు.

పద్మకి ఒంట్లో బాగోలేదని, తనూ ముందే వచ్చేసింది. మామూలుగా అయితే స్వాతి పాటలు పాడుకుంటూ ఇంట్లో ఏదో సర్దుతూ వంటల్లో రకరకాలు చేస్తూ ఒకటే హడావిడిగా వుండేది.

ఆరోజు నిశ్శబ్దంగా కూచుని ఏదో ఆలోచిస్తోంది.

పద్మ వచ్చి పలకరించింది. అయినా ముభావంగానే వుంది.

"ఎందుకట్లా వున్నావు స్వాతీ?"

ఆప్యాయంగా అడిగింది పద్మ.

ఏంలేదని తప్పించుకోబోయింది స్వాతి. కానీ అంతలోనే కన్నీళ్లు వచ్చేశాయి.

కన్నీళ్లు గట్టిగా తుడుచుకుని "నేనొక చిత్రమైన పరిస్థితిలో ఇరుక్కున్నాను పద్మా?" అంది.

"ఏమిటది"?

కాసేపేం మాట్లాడలేదు స్వాతి.

"శాలినికి నేనంటే జెలసీ" అన్నది ఉన్నట్టుండి. వయసుతేడా ఎక్కువ లేనందున పేరుపెట్టే. పిలుస్తుంది.

"ఎందుకు?" అంది పద్మ.

"ఎందుకో చెప్పనా?" ఫక్కున నవ్వింది. విచిత్రంగా చూసింది పద్మ.

"మేమిద్దరం ప్రేమలోపడ్డాం"

అంతలోనే గొంతుమారిపోయింది స్వాతికి.

"నేను ... నేను ... ఇక్కణ్నించి వెళ్లిపోతాను ... నువ్వు హెల్ప్ చెయ్యగలవా?" అంది హఠాత్తుగా.

"స్వాతీ ... నువ్వు విశ్రాంతి తీసుకో తరవాత మాట్లాడదాం"

అంది పద్మ లేస్తూ.

"లేదు పద్మా.... నేను చేతనావస్థలోనే వుండి మాట్లాడుతున్నాను. నువ్వు భయపడకు"

భుజాలు పట్టి పద్మని కూచోబెట్టి, పద్మ వడిలో తలపెట్టుకుని ఏడ్చేసింది స్వాతి.

స్వాతి తల నిమురుతూ-

"ఊరుకో స్వాతీ.... నీ సమస్య ఏమిటి? చెప్పు. నీకే సహాయం కావాలన్నా నేను చేస్తాను.... సరేనా?"

అంది పద్మ.

ఉద్ధృతం తగ్గాక స్వాతి లేచివెళ్లి ముఖం

కడుక్కువచ్చింది.

నెమ్మదిగా అంది- ''మాకథ నీకు తెల్సుగా? మా నాన్నతో శాలిని ఎక్కువ సుఖపడింది లేదు. పెళ్లవగానే మా నాన్న వెళ్లిపోయారు. నాకంటే ఎక్కువ పెద్దదేమీ కాదామె! మా నాన్నగురించి కబుర్లు ఇప్పుడనలేమీ తెలీవు. ఆవిడకీ కోరికలుంటాయి. తీర్చుకునే వయసే ఇది! అట్లాగే మోడుబారిపోవాలని ఎవ్వరమూ అనుకోము. మా నాన్నగురించి ఏ కబురూ తెలియనిది ఆవిడ ముందడుగు వేయలేదు అదీ సహజమే.

''మాబాస్ సతీష్ అందగాడు, సహృదయుడు. మేమిద్దరమూ ఒకరినొకరం అర్థం చేసుకున్నాం. పెళ్లిదాకా రాబోతున్నాం''

ఆగింది స్వాతి.

లేచి తలుపువేసి వచ్చింది.

''ఇప్పుడు నాకు తెలిసింది.... శాలినిగూడా ప్రేమించింది! ఎవర్నో తెలుసా? సతీష్‌నే!

కానీ సతీష్... సతీష్... ఓగాడ్... సతీష్‌కీ విషయం తెలుసో తెలీదోగానీ... నేను తెలుసుకుని ఆవేశపడ్డాను.

శాలిని నా అంత ఫ్రీగా అతనికి చెప్పలేదు. తన ప్రేమ విషయం. అతనితో చనువుగా వుండలేదు. తిరగలేదు. అందుకే... అందుకే జెలసీ! నామీద కోపం... కసి!! అందుకే నిన్న నన్ను కొట్టింది.

కానీ పద్మా... కానీ... కానీ నేను సతీష్‌ని వదులుకోలేను. సతీష్ నా ప్రాణం. పాపం... శాలిని! ఓహ్ పద్మా... నాకేంచెయ్యాలో తెలీడంలేదు.

అందుకే నేనిక్కణ్నించి అన్నీ వదిలి వెళ్ళిపోవాలనుకుంటున్నాను''

మళ్ళీ కళ్ళనీళ్ళు.

పద్మ అంది- ''అంటే శాలినికోసం నీ ప్రేమ త్యాగం చేస్తావా? చూడు... స్వాతీ... నేనొకటి చెప్పనా? నువ్వు నీ ప్రేమ త్యాగం చేసినా శాలిని మీ నాన్నగారి విషయం రూఢిగా తెలిసేదాకా సతీష్‌నేకాదు-- ఇంకెవ్వర్నీ పెళ్ళి చేసుకోలేదు. అందుకని నువ్వేం చెయ్యాలంటే-- నెమ్మదిగా మీ నాన్నగారి గురించి ఎంక్వయిరీ చెయ్యి. మీ నాన్నగారి విషయం తెలిసేదాకా తొందరపడి నువ్వే నిర్ణయానికీరాకు... సరేనా? అయినా సతీష్ ఒప్పుకుంటాడా? నువ్వు అతడి విషయం ఆలోచించవేం? అతడెందుకు తన ప్రేమని త్యాగం చెయ్యాలి? ఆలోచించు... నువ్వు చిన్నపిల్లవికావు-- అన్నీ సమర్థవంతంగా నిర్ణయించగలవు.

సవతి కూతురువైనా శాలినంటే నీకున్న కన్సిడరేషన్ ఇంకే కూతురికీ వుండదు. సామాన్యంగా ఆవిడ సుఖం తర్వాతే నీ సుఖం అనుకున్నావు చాలా గొప్పగుణం అది!''

స్వాతి ఏమీ మాట్లాడలేదు. కృతజ్ఞతగా చూస్తూ వుండిపోయింది పద్మవైపు.

★ ★ ★

నాగలింగంగారి దగ్గర్నించి పద్మరాసిన ఉత్తరానికి సమాధానం వచ్చింది.

దాంట్లో మళ్ళీ బొంబాయిలోవున్న తమ బంధుమిత్రులందరి అడ్రసులూ ఇచ్చారు.

ప్రొఫెసరుగారి దగ్గర్నించి కూడా ప్రోత్సాహకరమైన లెటర్ వచ్చింది.

నాగలింగంగారి ఆప్యాయతకి ఎంతో సంతోషం కలిగింది పద్మకి.

ఆ అడ్రసుల్లోని కొందరికి ఫోన్ చేసింది. ఒకటి రెండు ఇళ్ళకి వెళ్ళింది.

అందులో ఒకటి ప్రభాకర్ వాళ్ళది.

ప్రభాకర్ భార్య స్వర్ణ.

వాళ్ళింటికి వెళ్ళి తనను తాను పరిచయం చేసుకొంది.

వాళ్ళిల్లు స్వాతీవాళ్ళింటికి దగ్గిరే.

స్వర్ణ మర్యాదగానే పలకరించింది. మాట్లాడుతూండగా ఒక యువతి లోపల్నించి మంచి నీళ్ళతో వచ్చింది.

''ఈవిడ మా. ఆడబిడ్డ కాంచన'' పరిచయం చేసింది స్వర్ణ.

ఇంట్లో పని అంతా ఆ అమ్మాయే చేస్తోందని ఇట్టే అర్థమయిపోయింది పద్మకి.

స్వర్ణేమో అందంగా అలంకరించుకుని వుంది.

కాంచన సింపుల్‌గావుంది.

అయినా పరిశీలించి చూస్తే ఇద్దరూ ఒకీడు వాళ్ళే అయినా కాంచనే అందగత్తె అని రూ

ఢీగా తెలిసిపోతోంది.

కానీ నీరసంగా బలహీనంగా అలసటగా కనిపించింది.

"కాంచనా కాఫీ తెస్తావా?"

తలవూపి లోపలికెళ్ళింది కాంచన.

స్వర్ణ వెనక్కివాలి పద్మ గురించి వివరాలన్నీ అడగసాగింది.

నాగలింగం గారి కుటుంబం గురించి కుశల ప్రశ్నలు వేసింది.

ఆ అడగడంలో ఒకరకమైన రాజసం, నిర్లక్ష్యం కనబడ్డాయి పద్మకి.

తనో గొప్పదైనట్టూ మిగిలినవాళ్ళంతా తన కింద వున్నట్టూ వూహించుకునేవాళ్ళు చాలా మంది వుంటారు. అదే అహంకారపు మనుమల కోవకి చెందింది స్వర్ణ. మనసులోనే ఆమెని అంచనా వేసేసింది పద్మ.

కాంచనకి ఎక్కడో ఏదో లోపంవుంది. ఆమెని స్వర్ణ హీనంగా చూస్తోందని పసిగట్టింది.

కాఫీ తాగి వచ్చేసింది పద్మ. ఆ తరువాత కాంచనని వంటరిగా కలుసుకోవాలని నిశ్చయించుకుంది.

★ ★ ★

అనుకున్నట్లే మరోసారి ప్రయత్నించేందుకు వెళ్ళింది. కాంచనే తలుపుతీసి ఆహ్వానించింది. "కాంచనా ఇంట్లో ఎవరూ లేరా?"

"రండి... రండి" అన్నది కాంచన పద్మని ఆహ్వానిస్తూ.

"మీ వదినగారు లేరా?"

"లేరండీ... పెళ్ళికి వెళ్ళారు. అన్నయ్యా వదినా పిల్లలూను!"

"మరి నువ్వెళ్లలేదే?"

"నాకెందుకో పెళ్ళిళ్ళకి వెళ్ళబుద్ధికాదు"

"ఎందుకు?"

"ఏమో— నాకెందుకో ఇష్టం వుండదు. కూచోండి"

ఏమిటో... ఏదో బిజీగా వున్నావే?"

"సరుకులు తెచ్చుకున్నాం. అన్నీ బాగు చేసి డబ్బాల్లో పోస్తున్నాను"

"భోజనం అయిందా?"

"ఈ పనయ్యాక తిందామనీ"

"నేనూ సహాయం చేస్తాను ముందువెళ్ళి అన్నం తినిరా"

ఏదో భయం ఆమె కళ్ళల్లో.

"వద్దండీ నాకలవాటే, లేటుగా భోజనం చెయ్యడం"

పని ఆపలేదు కాంచన.

పద్మ కూడా సహాయం చేసింది.

పని తొందరగానే అయిపోయింది.

ఆ తరువాత వెళ్ళి భోజనం చేసింది.

భోజనం చేస్తుంటే వంటింట్లోకి వెళ్ళింది పద్మ. "అదేమిటీ... అన్నం స్టీలు గిన్నెలో వండావా? ఏమీ చేసుకోలేదూ?"

అడుగుతున్న పద్మకి చప్పునే అర్థమయిపోయింది. ఆ అన్నం రాత్రి అన్నం. పచ్చడి మజ్జిగతో తింటోంది!

కాంచన మాట్లాడలేదు.

పద్మ అట్లా అన్నీ తరచితరచి అడగడం చూడటం ఆమెకి ఇబ్బందిగా అనిపించింది. అన్నం తిన్నాక కంచం, గిన్నెలూ కడిగి వచ్చింది.

"రా... కాసేపు కూచో కబుర్లు చెప్పుకుందాం" పద్మఅంది.

"మీరు మాట్లాడుతూ వుండండి. నేను వింటాను. కొన్ని గుడ్డలున్నాయి ఇస్త్రీ చెయ్యాలి"

గుడ్డలమూట,ఇస్త్రీపెట్టెతో వచ్చింది.

"ఈమె మనిషా యంత్రమా?" అనుకుంది పద్మ

"కాంచనా... నువ్వెంతవరకుచదివావు?"

"చదువా?" పేలవంగానవ్వింది కాంచన.

"నేను మెట్రిక్‌వరకూ చదివాను. ఆతరువాత...ఆతరువాత ఆపేశారు"

"ఎందుకు?-"

"నాకు పెళ్లయింది"

"మరి... మరి... పెళ్ళయితే"

"ఇక్కడెందుకున్నావంటారా?" నవ్వు. కళ్లల్లో నీళ్లు- "నాభర్త మరణించాడు"

తలెత్తిచూసింది పద్మ.





బొట్టువుంది. "అది నేను అప్పుడప్పుడూ పెట్టుకుంటాను

నాభర్త తరవుస ఎవ్వరూలేరు. నాకు పిల్లలూలేరు. అందుకే అన్నయ్య దగ్గిరుంటున్నాను. అన్నయ్యకి నేనంటే చాలా ప్రేమ-...కాని ఏంలాభం... నేనీయింట్లో దాసీని!"

కన్నీరొలికింది.

"మీ అన్నయ్యకి నిజంగా ప్రేమయితే నీస్థానం ఇంకోలాగా వుండాలి"

"అన్నయ్య మంచివాడే. కానీ వదిన మాటలకి ఎదురు చెప్పలేడు. వదినకి నేనంటే



ఈర్ష్య. మొదటిపాయింటు నేను బాగుంటాను. రెండోపాయింటు- అన్నయ్యకి నేనంటే ఇష్టం- మా ఇద్దర్నీ సమానంగా అన్నయ్య ట్రీట్‌చెయ్యడం వదినకి ఇష్టంలేదు. అందుకని నన్ను హీనంగా చూస్తుంది. నేను ఇక్కడ పనులు చెయ్యడానికి మాత్రం వున్నాను. నాకు ఆస్తిపాస్తులులేవు. వున్నవన్నీ దాయాదులు లాక్కున్నారు. నేను ఎవరిదగ్గిర వుంటే వాళ్లకి భారాన్ని''

''పోనీ- పైచదువు చదువుకుని ఉద్యోగం చూసుకోవచ్చు గదా-?''

''అది మా వదిన కిష్టంలేదు- అందుకని పడనీదు. ఇంక నాజీవితం ఇంతే''

''నీకు మళ్లీ పెళ్లి చేసుకోడానికి అభ్యంతరమా?-''

ఉలిక్కిపడింది పద్మ ప్రశ్నవిని!

ఆతరువాత ఆశ్చర్యపోయింది.

''నేనా... మళ్లీపెళ్లా?''

''ఏం?''

''నన్నెవరు చేసుకుంటారు?''

''పోనీ ఎవరన్నా చేసుకోడానికి ఇష్టపడ్డారనుకో... నువ్వు ఒప్పుకుంటావా''

''ఇవన్నీ ఉత్తమాటలు. ఎవరూ ఇష్టపడరు''

ఇస్త్రీ అయిన బట్టలు లోపలపెట్టి, కాఫీ కలపడానికి లేచింది కాంచన. కాఫీకలిపి ఫ్లాస్కులోపోసి, పద్మకోకప్పు అందించింది. తను మాత్రం తాగలేదు.

ఎంతో బలవంతం పెట్టింది పద్మ. అయినా వినలేదామె.

''స్వర్ణవచ్చాక... ఒక కప్పు కాఫీ తక్కువుంటే తిడుతుంది. అందుకే కాంచన తాగలేదనుకుంది'' పద్మ.

ఆతరువాత- ఇల్లుఊడ్చి, గదులన్నీ సర్దింది కాంచన.

సాయంత్రం వంటకి కూర తరుగుతూ కూర్చుంది.

''మా వదిన వచ్చేటప్పటికి వంటయిపోవాలి''

''నువ్వెందుకు ఎదురు చెప్పవు?'' పద్మ అడిగింది.

''ఈనీడ కూడా వుండదేమోనని!''

''మెట్రిక్‌కి కూడా ఏదో ఒక ఉద్యోగం రావచ్చు. ట్రైచెయ్యి. ఏసేల్స్‌గరల్‌గానో, లాబ్‌అసిస్టెంట్‌గానో, ఏదో ఒకటి, నీకాళ్లమీద నువ్వు నిలబడితే- నీకు కొంత కాన్ఫిడెన్సు వస్తుంది'' అని-

''ఇంక నేను వెళ్తాను కాంచనా... నేను కూడా నీకోసం ఏదన్నా ప్రయత్నిస్తాను''

అనిలేచింది పద్మ. ''చాలాథాంక్సండీ. మిమ్మల్ని చూస్తుంటే అక్క జ్ఞాపకం వస్తోంది. నాకొక అక్కవుండేది. ఆమె ఇప్పుడు లేదు. చనిపోయింది. ఆమె వుంటే మీలాగే ఆత్మీయంగా వుండేదేమో ననిపిస్తోంది''

అంది కాంచన.

ఆరాత్రి స్వాతితో కాంచన విషయం చెపితే స్వాతి అంది-'' నాకా పిల్ల విషయం తెలును. కొంత ఆ అమ్మాయి మూర్ఖత్వం వల్లనే అట్లావుంది. తనకి తోచదు. చెప్తే వినదు. నేనూ మొదట్లో నీలాగే చెప్పాను. వింటేగా?''

''కాదుస్వాతీ... ఆ అమ్మాయికి మీ సతీష్‌తో చెప్పి ఎక్కడన్నా ఉద్యోగం చిన్నదో పెద్దదో వేయించు. ఉద్యోగం ఇప్పిస్తే చేస్తుంది''

''ప్రయత్నిస్తాను'' అంది స్వాతి.

ఆ మర్నాడే స్వాతి ఆఫీసునుంచి వచ్చాక - 'సతీష్ ఏదన్నా ఉద్యోగం చూస్తానన్నాడని, ఆమె బయోడేటా ఇమ్మన్నాడనీ, అంది.

తరువాత కొద్దిరోజులకే - ఏదో లేబరేటరీలో లేబిల్స్ అంటించే జాబు వచ్చింది కాంచనకి. నెలకి నూటయాభై రూపాయలు ఇస్తానన్నారు వాళ్లు.

ఇంట్లో కాస్త గొడవ జరిగినా జాబులో చేరగలిగింది కాంచన.

ఆ సాయంత్రం తనంత తానుగా వచ్చి- పద్మకి కృతజ్ఞతలు తెల్పుకుంది.

పద్మ చాలా సంతోషించింది. టైపు నేర్చుకుంటే ఆ లాబ్‌లోనే కాస్తమంచి ఉద్యోగం ఇస్తానన్నారుట. తనా ప్రయత్నంలో వున్నానంది.

''నేను నిజంగా సంతోషించేది ఎప్పుడో

తెలుసా? నువ్వు మళ్లీ పెళ్లి చేసుకున్న రోజున. సరే గానీ ఒక మాట చెప్పాలి నీకు. నీ మంచి తనంతో మీ వదినలో జెలసీని పోగొట్టు. అది మీ ఇద్దరికీ మంచిది'' అంది పద్మ.

''మీకు నామీద ఎందుకింత అభిమానం? దేవుడు పంపించినట్లే నాకోసం వెతుక్కుంటూ వచ్చారు మా ఇంటికి. నాకో దోవచూపించారు. నా భవిష్యత్తుకో వెలుగు రేఖ వుందని తెలిసేట ట్లు చేశారు. నేనిన్నాళ్లూ అంధకారంలోనే వుండిపోయాను'' అంటూ పదేపదే కృతజ్ఞత లు తెలిపింది కాంచన. ఆమె మొహం ఇప్పు డు ఉత్సాహోత్తేజాలతో మరింత అందంగా మెరిసిపోతోంది.

★ ★ ★

పద్మకిచ్చిన ఆర్నెల్ల టైము అయిపోతోంది. కలకత్తా రమ్మనీ అక్కణ్నుంచి ఇద్దరం కలిసి హైద్రాబాద్ వెళ్దామనీ రాశాడు శ్రీరామ్.

పద్మ టిక్కెట్టు కూడా కొనేసుకుంది కలకత్తా కి.

అందరికీ చెప్పింది తను వెళ్తున్నాని.

''అదేమిటి... ఇంత అర్థాంతరంగా వెళ్లడం ఎందుకు?''

స్వాతి అడిగింది.

అది చెబుదామనే అనుకుంటున్నాను. ఇన్నా ళ్లూ పడనేలేదు.

''నేను ఒక రిసెర్చి పనిమీద వచ్చానిక్కడి కి'' అంటూ అంతా చెప్పింది.

అక్కడ శాలిని- స్వాతి- స్వర్ణ- కాంచన - ప్ర భాకర్వున్నారు. సతీష్కూడా వచ్చి చేరాడు.

అందరూ పద్మ చెప్పింది విని ఆశ్చర్యపో యారు.

''మా సొసైటీస్టార్ట్ చేశాక మీ అందరూ మాతో జాయిన్ అవ్వాలి''

''తప్పకుండా'' అన్నారు అంతా.

''పద్మా... నాన్నగారిని వెదకడానికి నేనూ శాలినీ బయల్దేరాలనుకుంటున్నాం. సతీష్ కూడా సహకరిస్తానంటున్నాడు'' అందిస్వాతి.

స్వాతి పద్మతో మాట్లాడినప్పట్నించీ తండ్రి కోసం - వీలైనన్ని ప్రయత్నాలు చేస్తూనేవుంది.

''అవును పద్మా... నేను స్వాతిని ఇప్పుడు పూర్తిగా అర్థం చేసుకున్నాను'' అంది శాలిని కూడా.

ఆమెలో ఎంతో మార్పు అన్నిట్లోనూ -- వేష భాషల్లో కూడా

అట్లాగే కాంచనలోనూ చాలా మార్పొచ్చింది. ఎంతో ఉత్సాహంగా వుంటోందిప్పుడు.

తనకంటూ ఒక వ్యక్తిత్వం వచ్చింది. స్వర్ణ కూడా ఏం మాట్లాడకపోయినా-- కొంత కాంచన విలువని గుర్తించినట్లుంది.

'కాంచన ఒకింటిదైతే ఇంకా బావుంటుంది' అనుకుంది పద్మ.

అందరూ వచ్చి స్టేషన్లో వీడ్కోలు ఇచ్చారు పద్మకి.

అందరికీ తప్పకుండా ఉత్తరాలు రాస్తాననీ, టచ్లో వుంటాననీ చెప్పి, రైలెక్కింది పద్మ.

రైలు కదిలాక సరిగ్గా కూచుని తన డైరీతీ సి -- తనుస్టడీ చేసినవీ -- రాసినవీ అన్నీ చదు వుకోసాగింది.

తను జెలసీకేసులు నాలుగుస్టడీ చేసింది. అన్నదమ్ములు --

పై ఆఫీసరు -- కిందవాడు.

తల్లీకూతురు

వదిన ఆడబడుచులు -- వీళ్లందరూ మంచివాళ్లే.

'జెలసీ దిగ్రీన్ ఐడ్ మాన్స్టర్! అంటాడు షేక్స్పియర్'

అదే లేకపోతే వీళ్ల జీవితాలు సాఫీగానే వుండేవి.

వెనక్కి వాలి కళ్లు మూసుకుంది పద్మ.

★ ★ ★

కలకత్తా చేరేసరికి రైలు లేటయింది. శ్రీరామ్ వచ్చివున్నాడు -- స్టేషన్లో.

''హల్లో... శ్రీరామ్...''

''హల్లో... పద్మా...''

ఒక్కసారి చేయిపట్టుకుని వూపేశాడు.

''ఓ మైగాడ్... నువ్వు చాలా మారిపో యావు''

అన్నాడు శ్రీరామ్.

''నేనా?'' నవ్వింది పద్మ.

''నేనేం మారాను?'' తనని తను చూసు

కుంటూ అంది.

''మొహంలో అలసట -- అనుభవం'' నవ్వాడు శ్రీరామ్.

''నువ్వూ అంతే మైడియర్ శ్రీరామ్! నేను నా ఎక్స్‌పీరియన్సన్నీ ఎప్పటికప్పుడు నీకు తెలియజేస్తూనే వున్నాను నా ఉత్తరాలద్వారా. నువ్వు మాత్రం అన్నీ దాచుకున్నావు. ఇప్పుడయినా చెప్తావా? తిరిగి వెళ్ళేదాకా చెప్పవా?''

''ఇప్పుడా? ఈ స్టేషన్లోనా? పద పద''

ఇద్దరూ టాక్సీఎక్కి శ్రీరామ్ రూమ్ చేరారు

స్నానం, టిఫిను అయ్యాయి.

''నువ్వు విశ్రాంతి తీసుకో -- నేను ఆఫీసుకి వెళ్ళొస్తాను. సాయంత్రం మాట్లాడుకుందాం''

''సాయంత్రమా? అంతదాకా నేనేం చెయ్యాలి? ఇంతకీ మన ప్రయాణం -- హైద్రాబాద్‌కి ఎప్పుడు?''

''ఇన్ని ప్రశ్నలు ఒకేసారి అడిగితే ఎట్లా? అదిగో నాడైరీ... దాంట్లో వున్నాయి. నా అనుభవాలు చదువుతూవుండు సాయంత్రందాకా. మన ప్రయాణం ఎల్లుండి నువ్వు కలకత్తా చూడవ్?''

''శాంతి నికేతన్ చూడాలి!''

''చూద్దాం తప్పకుండా. నేను అరేంజ్ చేసే వుంచాను. అది రేపు. నేను వెళ్ళొస్తాను... రైట్?''

తలవూపింది.

''అన్నట్టు డైరీని నేను డైరీగా రాయలేదు... చదువుకో...''

''ఓ కే!''

వెళ్ళిపోయాడు శ్రీరామ్.

ఆత్రుతనాపుకోలేక డైరీ విప్పింది పద్మ.

★ ★ ★

''నేను సరాసరి కలకత్తాలో నా ఫ్రెండ్ రామకృష్ణ దగ్గిర దిగాను.

వాడు ఆశ్చర్యపోయాడు 'ఎట్లావచ్చావురా -' అని!

నేను వస్తున్నానని రాశానుగానీ ఫలానా రోజని వాడికి తెలీదు.

వాడి ఇల్లు, పరిసరాలు చూసి నేను ఆశ్చర్యపోయాను. వాడు చిన్నప్పటినించీ ప్రిన్సిపుల్స్ వున్నవాడు.

కానీ ఇంతకొద్ది వ్యవధిలో ఇంతమంచి యిల్లు (అద్దెదయినా అద్దె కట్టాలిగా?) సర్వెంట్లు -- అంతా వీడి పనిబావుంది. నేను చాలా సంతోషించాను. నా ఫ్రెండ్ హేపీగా వుంటే నాకూ సంతోషమేగా?

''నువ్వు స్నానం చేసి భోజనం చెయ్యరా?'' అన్నాడు వాడు.

వాడి బాత్‌రూమ్ చూస్తుంటేనే మూర్ఛవచ్చింది నాకు. అంత పోష్‌గావుంది.

స్నానం, భోజనం అయ్యాయి.

రామకృష్ణ నా దగ్గిరికి వచ్చి కూచున్నాడు.

''నీ కథ చెప్పరా?'' అన్నాను.

''కథేమిటి?''

''ఈ భాగ్యమంతా ఎట్లావచ్చింది?''

''..............................................................''

''ఏమిటి మాట్లాడవేం? పిల్లనిస్తానన్న మామగారిచ్చారా? అదీ నీ ప్రిన్సిపుల్స్‌కి విరుద్ధమేగా?''

''ప్రిన్సిపుల్స్... వాట్ ప్రిన్సిపుల్స్? ఇప్పుడు నాకేం ప్రిన్సిపుల్స్ లేవురా''

అదిరిపడ్డాను. ''ఏమిటిరా నువ్వనేది?''

''అవున్రా... నాకూ విచారంగానే వుంది అంతా నీకు చెప్తాను''

నేను వింటున్నాను.

''మా కుటుంబం సంగతి నీకు తెలుసు మా నాన్న జీతంమీద మా జీవితాలు ఆధరంగా వుండేవి. ఇద్దరు చెల్లెళ్ళు, మా అత్తయ్య, నేను, మా అమ్మ, మాకు అప్పుడప్పుడూ భోజనానికే కటకటగా వుండేది. మాకేమీ ఆస్తిపాస్తులు లేవు. నాన్న ఎంతో ఖచ్చితమైన ప్రిన్సిపుల్స్‌వున్న మనిషి. నీకూ తెలుసు. మలమల మాడుతున్నా ఒకళ్ళని దేహీ అని అడక్కూడదు. పరువు అనేది ఎంతో ముఖ్యం ఆయనకి. మాకు ట్యూషన్లులేవు. స్వశక్తితోనే పైకిరావాలి....

అట్లాగే వచ్చాంగూడా. నాన్న ఉన్నన్నాళ్ళూ మా సంసారం గుట్టుగానే నడిచింది. ఆ తరువాత మేము గుంటూరెళ్ళాం. నా డిగ్రీ చదువు పూర్తయింది. నాన్నపోయారు. మేమందరం నడిసముద్రంలో పడిపోయాం.




# అందం — ఆరోగ్యం

## JEEVANTONE

బలహీనమైన కణాలకు మంచి రక్త ప్రసరణను అందజేస్తుంది. ఇదికాక ఆరోగ్యాన్ని, బలాన్ని, కండరాలకు దారుఢ్యాన్ని ప్రసాదిస్తుంది.



ఒక సీసా తాగింతర్వాత
ఇంకా ఎన్ని సీసాలు తాగాలో
మీరే నిర్ణయిం చేసుకోగలరు

ఆరోగ్యంగా లేకపోతే
రోగాలపాలవుతారు

మంచి ఆరోగ్యం, బలం, శక్తి
పుష్టిగా కండరాలు పొందిన తర్వాత
ఈ మందును ఆపివేయడం మంచిది

'' MFG. LICENCE No. AUS 59/75''

Contact our new sole Distributors

**M/S. New Shakti Pharma,**
No. XXV/475, Havanapet,
Adoni-518 301,
Kurnool Dist., A.P.
**Phone: 2866**




450 Grams Rs. 40/-



ఏ.పి.పి
కొరకు

జీవన్‌టోన్ ప్రొడక్ట్స్
పి.బి.నం. 880 17/2
కేంబ్రిడ్జి రోడ్
బెంగుళూర్-560 008

SINDU

చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు అట్లాగే వుండిపోయాయి. పెళ్ళిళ్ళదాకా ఎందుకు? మాకు కొన్నాళ్ళు తిన డానికి తిండేలేదు. ఒక్కపూటే తిని వున్నరోజులు లెక్కలేనన్ని. చెల్లెళ్ళ చదువులు హైస్కూలుతోటే ఆగిపోయాయి.

నేను ఉద్యోగం కోసం తిరగని చోటులేదు. మా నాన్నకి తెలిసినవాళ్ళందరిళ్ళకీ వెళ్ళాను. అందరూ నాన్నని పొగిడారు. కానీ ఒక్కళ్ళూ నాకో దారి చూపలేదు. కనబడ్డ వుద్యోగానికల్లా అప్లికేషన్ వేస్తూ వచ్చాను. ఎన్నాళ్లయినా ఎక్కడా ఏమీ దొరకలేదు. అద్దెకట్టకపోవటాన యిల్లు ఖాళీచేయాల్సి వచ్చింది. అమ్మకి, చెల్లెళ్ళకి వున్న కాస్తా, కూస్తా బంగారం కరిగిపోయింది. ఒక పూరింట్లో వుండాల్సి వచ్చింది. దానిక్కూడా అద్దె కట్టడం బ్రహ్మాండమైపోయింది. ఇల్లు గడవడానికని కొన్నాళ్ళు నేను పేపర్‌బాయ్‌గా పనిచేశాను. చెల్లెళ్ళు బయటికెళ్ళి పనిచేస్తామంటే నేనే అభ్యంతరపెట్టాను. అమ్మ చివరికి ఎవరింట్లోనో వంటచెయ్యడానికి వప్పుకుంది. ఆ రోజు నేనుపడ్డ బాధ వర్ణనాతీతం! చెల్లెళ్ళు ఎవరో ఒకావిడ దయాధర్మంగా కుట్లు, కత్తిరింపులు నేర్పుతానంటే వెళ్ళి నేర్చుకుంటామన్నారు. సరేనన్నాను. కానీ వాళ్ళు నేర్చుకున్నా నేను మిషనెక్కణ్ణుంచి తేగలను? నిజంగారా శ్రీరామ్... అంతదరిద్రం మేము ఎట్లా అనుభవించామా అనిపిస్తుందిప్పుడు ఆలోచిస్తే. టెర్రిబుల్'

"తరవాతేమయింది?"

"అమ్మ వంటచేసిన వాళ్ళింట్లోనుంచి వాళ్ళు ఇచ్చినవి తెస్తూంటే తినడానికి సగం చచ్చిపోయేవాళ్ళం అవమానంతో.

అట్లాంటి సమయంలో బాంకులో ఖాళీలున్నాయని పేపర్లో ప్రకటన పడింది. నేను అప్లైచేశాను. ఇంటర్వ్యూకి రమ్మని పిలిచారు... వెళ్ళాను.

ఈసారి నేనో నిశ్చయంతో వెళ్ళాను. ఆ ఇంటర్వ్యూ చేసేవాళ్ళతో కొంత వీలయితే నా స్థితిగతులు మాట్లాడదామనుకున్నాను.

నా ప్రయత్నం ఫలించింది. ఆ ఇంటర్వ్యూ చేసే ఆయన నన్ను ఇంటిదగ్గర కలవమన్నాడు. వెళ్ళాను. ఆయన చాలా బాగా మాట్లాడాడు. చాలా కైండ్‌గా మాట్లాడాడు. నాతో అన్నాడు- "నీకీ బాంక్ జాబ్ ఎందుకుగానీ- మా తమ్ముడు కొత్తగా ఒక కంపెనీ పెట్టాడు. అది ఎరువుల కంపెనీ. దాంట్లో మంచి జాబు నీకిస్తాడు. కానీ నువ్వు దానికి అయిదువేలు డిపాజిట్‌గా కట్టాలి" అన్నాడు.

నేను వెంటనే కుర్చీలోంచి లేచి- "థాంక్స్" అని చెప్పి వచ్చెయ్యబోయాను.

"ఈ ప్రిన్సిపుల్స్ తిండిపెట్టవు మైబాయ్. జాగ్రత్తగా ఆలోచించుకో నువ్వు కాదంటే ఎందరో వస్తారు. నువ్వు చెప్పిన నీ సంగతులన్నీ విని నేను జాలిపడి నీకో ఛాన్సు ఇస్తున్నాను... అంతే, మంచి జీతం, పెర్క్‌లూ ఆలోచించుకుని ఏ సంగతీ రేపు చెప్పు" అన్నాడు.

నేను వచ్చేశాను. ఆ రోజంతా ఆలోచించాను.

అమ్మతో చెప్తే "అయిదువేలు ఎక్కణ్ణుంచి తెస్తాంరా?" అంది.

నేను ఆలోచించాను. చెల్లెళ్ళకి తిండే పెట్టలేకపోతున్నాను. ఇంక పెళ్ళిళ్ళు ఎట్లా చేస్తాను? అందుకే ఆయనన్న మాటలు నా మనసులో పనిచేస్తూనే వున్నాయి.

"సరేనంటే బావుండేదా?" అనే శంక నన్ను పీడించి పిప్పిచేసింది.

ఇంతలో అమ్మకి బి.పి., షుగర్ ఉన్నాయన్నాడు డాక్టర్. మందులిప్పించడానికి డబ్బుల్లేవు. ఎక్కణ్ణుంచితేను? అమ్మ ఇంక పనిచెయ్యలేకపోయింది. ఇల్లు నరకంగా తయారవుతోంది. ఎక్కడచూసినా దరిద్రమే! నన్ను చూస్తే నాకే అసహ్యమేస్తోంది.

ఒకరోజు అమ్మ పెద్దచెల్లెల్ని మందలించడం నా చెవిన పడింది.

నాతల తిరిగిపోయింది. ఏంజరుగుతోంది? నేను... నేను పెళ్ళిచెయ్యకపోతే చెయ్యలేకపోతే నా చెల్లెళ్ళు పరువుతక్కువపని చేస్తారా? ఛీ... అవినీతికెన్నడూ పాల్పడరు. ఏమో... ఎవరు చెప్పగలరు? అంత మంచి ప్రిన్సిపుల్స్ వున్న నాన్నకి పుట్టి అట్లా చేస్తారా? నాకు మనశ్శాంతి లేకుండాపోయింది.

అమ్మ ఆరోగ్యం రోజురోజుకీ చెడిపోతోంది. నేనేం చెయ్యాలి? ఏంచెయ్యగలను? ఉద్యో





గమెక్కడా కనుచూపు మేరలో దొరికేట్టులేదు.

ఆ పరిస్థితిలో నువ్వైతే ఏంచేస్తావు శ్రీరామ్? చెప్పు శ్రీరామ్?''

అడిగాడు రామకృష్ణ.

నేను మాట్లాడలేదు. ''ఊఁ... ఆ తర్వాత జరిగింది చెప్పు'' అన్నాను.

''నాకు ఇంక అప్పుడు నా ప్రిన్సిపుల్స్ అంటే విరక్తి కలిగింది.

ఏ ప్రిన్సిపుల్స్‌తో అమ్మని రక్షించుకోగలను? ఏ ప్రిన్సిపుల్స్‌తో చెల్లెళ్ళు అవినీతిపాలు కాకుండా కాపాడగలనూ?

ఎంతో ఆలోచించాను.

చెల్లెల్ని పిలిచి మందలించాను. చెల్లెలు ప్రేమించానంది. ఆ ప్రేమించిన వాడి దగ్గరికి కెళ్ళాను. అతడు కట్నం కావాలన్నాడు.

అన్నమే పెట్టలేని నేను కట్నమేం ఇవ్వగలను? అతణ్ని తప్ప పెళ్ళిచేసుకోనంది చెల్లెలు.

అట్లాంటి టైములోనే నా ప్రిన్సిపుల్స్ నానించి పారిపోయాయి.

నేను లంచం అదే డిపాజిట్‌ఇచ్చి ఉద్యోగంలో చేరడానికి నిశ్చయించాను'' నవ్వాడు రామకృష్ణ.

ఉలిక్కిపడ్డాను.

''ఎంతో సంఘర్షణ చెలరేగింది నా మనసులో. చాలారోజులు నిద్రపోలేదు నేను. కానీ ఏంచెయ్యను... గత్యంతరం లేకపోయింది నాకు.

అప్పుడే వచ్చింది నాకీ అవకాశం. అమ్మ జాగ్రత్తగా దాచిన మంగళసూత్రాలు అమ్మాను.

అంతే... ఉద్యోగం వచ్చింది. అంతేనా! మూడునెలల తర్వాత మా బాసు తన కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తానన్నాడు. కట్నంగా పెద్దమొత్తం, కంపెనీలో షేర్లు ఇస్తానన్నాడు. ఆలోచించకుండా ఓకే అన్నాను.

అందులో కొంత ముందే అడ్వాన్సు తీసుకుని అమ్మకి వైద్యం చేయించాను. చెల్లెలిపెళ్ళి చేసేశాను. ఇంకో చెల్లెలికి కూడా సంబంధం ఖాయంచేశాను. డబ్బువుంటే చెయ్యలేంది ఏముంది? నువ్వేచెప్పు... శ్రీరామ్?''

నేను ఆలోచిస్తూ వుండిపోయాను. డబ్బు ఫలితమేగదా ఇవన్నీ. ఈ బంగళా... ఈ సౌకర్యాలు, సూకలూను.

''సరే... నువ్వు పడుకో... గుడ్‌నైట్''

రామకృష్ణలేచి వెళ్ళిపోయాడు.

రామకృష్ణ లంచం ఇచ్చాడు.

కట్నం తీసుకున్నాడు.

రామకృష్ణ సుఖంగా వున్నాననుకుంటున్నాడు

ఇది సుఖమా?

నేను చేసింది తప్పా?

అని అడుగుతున్నాడు.

తప్పుకాదా?

ఈ డబ్బు శాశ్వతమా? భోగాలు శాశ్వతమా? మళ్ళీ అతడు జీవిత సత్యాలు తెలుసుకుంటాడా?

ఆ తరువాత రోజు నేను వచ్చిన కారణాలు వాడికి చెప్పాను.

మొదటవాడు బిత్తరపోయాడు. నన్ను పిచ్చివాణ్ని చూసినట్లు చూశాడు.

''దీనివల్ల నీకేం వస్తుంది? నువ్వు సాధించేదేముంది?'' అనడిగాడు.

నేను నవ్వాను. అన్నీ వివరించి చెప్పాను.

''కానీ శ్రీరామ్...మనం అనుకుంటాంగానీ సత్యసంధత, నీతి-అనేవి మంచి మార్గాలే. సరే... కానీ ఇవి పాటిస్తున్నన్నిరోజులూ మనకి కష్టాలే కలుగుతాయి. ఏమో... నామటుకు నాకు అవినీతి, అన్యాయంలోనే సుఖం వుందేమోననిపిస్తోంది''

అన్నాడు రామకృష్ణ.

''అది శాశ్వత సుఖంకాదురా.. నీకిప్పుడు తెలీడంలేదు''

''తెలుసుకున్ననాడు వచ్చి నీతో కలుస్తాను. సరేనా?'' నవ్వాడు తేలికగా.

రెండు-మూడురోజులు వున్నాక నాకో రూముచూసిపెట్టమని వాణ్ని అడిగాను. వాడు ముందు ఎగిరిపడ్డాడు. నన్ను ఆశ్చర్యంగా చూశాడు. కోపం తెచ్చుకున్నాడు.

నేను వివరించి చెప్పాను- నా పనికి అది అవసరం అని.

చివరికి ఒప్పుకున్నాడు.

"నీను నీ హెల్ప్ తీసుకుంటూనే వుంటా నులే" అన్నాడు.

నాకీ రూం చూసిపెట్టాడు. నాకిది అన్నివిధాలా నచ్చింది. నేనో జాబ్ చేద్దామనుకుంటున్నానని వాడితో చెప్పాలనుకున్నాను. కానీ మళ్ళీ వద్దనుకుని నేనే నా ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టాను.

టెంపరరీ బేసిస్‌మీద ఉద్యోగమంటే ఇవ్వడానికి ఎవరూ ముందుకురాలేదు.

చివరికి ఎట్లాగో ఒక లీవ్ వేకెన్సీలో అతికష్టంమీద క్లర్క్ ఉద్యోగం వచ్చింది. ఫరవాలేదు... నా అవసరాలు గడుస్తాయి. ఇంక నా అన్వేషణ మొదలు పెట్టాలి.

ఇప్పటికి కొంత మొదలయినట్లే రామకృష్ణ కేను!

మెల్లగా రోజులు గడుస్తున్నాయి.

ఏం చెయ్యాలో తెలీడంలేదు.

ఒకరోజు రామకృష్ణ నా రూంకి వచ్చాడు.

"ఒరేయ్... నీకు జగన్నాథం మాష్టారు తెలుసుగా!"

"తెలీక పోవడమేమిటి? నా జీవితాన్ని మార్చిందే ఆయన" అన్నాను అప్రయత్నంగా.

"అదేమిటి... అది నాకు తెలీదే?" అన్నాడు రామకృష్ణ.

"అవునురా... చెప్తాను నీకాసంగతి! అవి మనం థర్డ్‌ఫారం చదువుకునే రోజులు... ఆరోజు సైన్సు పరీక్ష మనకి. అప్పుడు నేను కాపీ కొట్టబోయాను... గుర్తుందా?"

"ఏమోరా... నాకు గుర్తులేదు. నువ్వో సెంటిమెంటల్ ఫూల్‌వి. అందుకే నీకన్నీ ముఖ్యంగా అట్లాంటివి గుర్తుంటాయి"

అవును... నాకు బాగా జ్ఞాపకం ఆరోజు. నేనేమీ చదవలేదు. అవి పెద్ద పరీక్షలు. అంతకుముందు రెండు పేపర్లూ పాడు చేశాను నేను. ఇది కూడా పాడయితే పరీక్ష తప్పుతాను. ఏం చెయ్యాలి? ఎంతో ఆలోచించాను. కాపీకొట్టడమే ఉపాయంగా తోచింది. అదే మొదటిసారి నేను కాపీకొట్టడం. గంగయ్య వుండేవాడే మన క్లాసులో... ఎప్పుడూ కాపీలు కొడుతుండేవాడు. వాణ్ని అడిగాను ఎట్లా ఏంచెయ్యాలి అని. వాడు నాకు కొన్ని మెళకువలు నేర్పించాడు. నేనెట్లా తీసుకెళ్ళానో నాకే తెలీదు. కానీ ఆన్సర్లు వున్న పేపర్లు తీసుకెళ్ళాను.

మెల్లగా చూసి రాయబోయాను. ఆరోజు వాచరు మన జగన్నాథం మాష్టారే!

నాకు వూరికే భయం చెమటలు. మాష్టారు పట్టేశారు. నన్ను బయటికి పంపించేశారు. ఇంక పరీక్ష రాయనివ్వలేదాయన. నేను ఏడుస్తూ వుండిపోయాను మూడు గంటలూను. ఇంటికి వెళ్ళలేదు.

పరీక్ష పూర్తయ్యాక మాష్టారు తనపని పూర్తి చేసుకుని వెళ్తూ నన్ను తనవెంట రమ్మన్నారు.

ఆరోజు నేనీ జన్మకి మర్చిపోలేను. నాకు జ్ఞానోదయం అయినరోజది. నేనీ అన్వేషణకి ఎన్నుకోబడ్డానంటే ఆనాటి మన మాష్టారి హితబోధే కారణం!

నా మనసు ఇప్పటికీ ఆయనంటే కృతజ్ఞత, భక్తిభావాలతో నిండిపోతుంది.

ఆయన నన్నేమీ తిట్టలేదు. "ఎందుకు కాపీ కొట్టబోయావు?" అనడిగారు. నేను చెప్పాను.

"నువ్వు కాపీకొట్టి మార్కులు తెచ్చుకుంటే అవి నీ మార్కులు ఎట్లా అవుతాయి? నీకు విద్య ఏం వచ్చినట్లు? నువ్వే ఆలోచించు. పరీక్షల ఉద్దేశ్యమేమిటో తెలుసా? నీకు తెలీని విషయాలు నేర్చుకొని, విజ్ఞానం పెంచుకొని అవే విషయాలని కాగితంమీద రాసి నీ విజ్ఞానాన్ని ఒక విధంగా నిరూపించుకోవడం. చూసి రాస్తే దాంట్లో తెలుసుకునేది ఏముంది? నేర్చుకునేది ఏముంటుంది? ఒకసారి చూసి రాయడమంటూ అలవాటయితే అదే ఎప్పుడూ చేయబుద్ధవుతుంది. నువ్వింకేమీ నేర్చుకోవు. నీకింకేమీ రాదు. అట్లాగే పెద్దవుతావు. నువ్వు టీచరువయితే పిల్లలకి నష్టం.

డాక్టరువయితే పేషంట్లకి నష్టం. ఏదైనా మన దేశానికే నష్టం.

మీరు భావిభారత పౌరులు. ఎవరు చెప్పగలరు మీరు మినిస్టర్లే అవుతారో, ప్రెసిడెంట్లే అవుతారో.

కాబట్టి బుద్ధిగా చదువుకుని వచ్చిందే రాయి. తప్పుతావా... ఫేస్ఇట్! పిరికివాడిలా భయపడకూడదు. చూసి రాస్తే పరీక్ష పాసవుతా





వేమోగానీ నీ విజ్ఞానం పెరగదు. అర్థం అయిందా?'' అంటూ గాంధీగారి కథ చెప్పారు.

నేను వెక్కివెక్కి ఏడ్చి- ''ఇంకెప్పుడూ కాపీ కొట్టనుసార్'' అని ప్రామిస్ చేశాను.

ఆనాటినుంచీ ఈనాటిదాకా కాపీ కొట్టడమేకాదు ఏ విధమైన చెడ్డపనీ చేయలేదు. ఒకవేళ ఆలోచనే వచ్చినా నాకు వెంటనే జగన్నాథం మాష్టారే గుర్తుకు వస్తారు.

ఆయన రూపమే కళ్ళముందు కనబడుతుంది నాకు.



''జగన్నాథం మాష్టారు ఏదో పెళ్ళికి ఈ వూరువచ్చారు. చూద్దాం వస్తావా?' అన్నాడు రామకృష్ణ.

''తప్పకుండా'' అంటూ బయల్దేరాను.

అది ఎవరిల్లో, ఎవరి పెళ్లో నాకు తెలీదు.

అయినా మాష్టారికోసం రామకృష్ణతో బయల్దేరాను.

అది తెలుగువారింట్లో పెళ్లే.

అక్కడ కొంతమందిని పరిచయం చేశాడు.

రామకృష్ణని అక్కడివాళ్ళు గౌరవంగా చూడటం గమనించాను నేను.

బయట కూర్చున్నాం మాష్టారికోసం చూస్తూ పెళ్లి తతంగం పూర్తయినట్లుంది- అందరూ రికామిగా వున్నారు.

''అరుగో మాష్టారు!'' అన్నాడు రామకృష్ణ.

ఎవరితోనో కలిసి గేటుదాటి లోపలికొచ్చిన జగన్నాథం మాష్టార్ని చూసి నేను శిలాప్రతిమలాగా నిలబడిపోయాను.

రామకృష్ణ భుజంతట్టి ''ఏమోయ్... బావున్నావా?'' అన్నారు నవ్వుతూ.

ఆయన మాష్టారేనా?

జగన్నాథం మాష్టారేనా? 'కాదు.. కాదు..' అని అరిచింది నా అంతరంగం.

నా కళ్ళు నమ్మనన్నాయి.

కారణం... ఆయన మన స్పృహలో లేరు! తాగి వున్నారు!!

జగన్నాథం మాష్టారు తాగుతారా?? నో... నెవర్!! ఈయన ఇంకెవరో!! నేను సందిగ్ధంలో వుండగానే రామకృష్ణ నన్ను చేయిపట్టి లాక్కువచ్చి మాష్టారుకి చూపిస్తూ ''మాష్టారూ... ఇతడెవరో గుర్తుపట్టారా?'' అనడిగాడు.

ఆయన ఒక్కక్షణం నన్ను తేరిపారచూశారు. ఎగాదిగా చూశారు. కానీ ఆ చూపుల్లో నిశ్చలత్వం లేదు.

''ఎవరో గుర్తుకు రావడంలేదోయ్''

కుర్చీలోకి జారిపోయి జారగిలబడి కూర్చున్నారు.

నా ఉత్సాహం చచ్చిపోయింది.

నేను నీరుకారిపోయాను.

''శ్రీరామ్ మాష్టారూ...!'' అన్నాడు రామకృష్ణ.

''ఎవర్రా... శ్రీరాముడు?'' అప్పటికే ఆయన కళ్ళు మూతలుబడ్డాయి.

''ఇంక లాభంలేదు. ఈయన మాట్లాడరు. రేపు రండి'' అన్నారు అక్కడివాళ్ళు.

మేము లేచాం. దార్లో నాకేమీ మాట్లాడబుద్ధి కాలేదు. నా మనసు ఒకటే మధనపడసాగింది. నా మనసులోని జగన్నాథం మాష్టారు గౌరవప్రదమైన పీఠాన్ని అధిష్ఠించి వున్నారు... వుంటారు ఎప్పుడూగూడా.

ఇవాళ్టి ఆయన స్థితి చూశాక నా మనసులో ఆయనకున్న గౌరవం కిందికి దిగిందా? ఆయనతో మాట్లాడేదాకా ఏదీ నిర్ణయించలేము.

కానీ ఒక్కటిమాత్రం నిజం. ఆయన్నట్లా చూడకుండావుంటే ఎంత బావుండేది?

అసలు చూడకుండావున్నా బావుండేదేమో?— అని నా మనసులో పదేపదే అనుకోసాగాను.

ఆ రాత్రి నిద్ర శూన్యం!

మర్నాడు వెళ్లగూడదనే అనిపించింది నాకు. కానీ తీరా రామకృష్ణ వచ్చేసరికి కాదనలేకపోయాను.

మళ్లీ ఇద్దరం వెళ్లాం.

ఈసారీ ఆయన తాగే వున్నారు. కానీ నిన్నటికన్నా తక్కువే.

''రావోయ్ రామకృష్ణా...''

ఈసారీ నన్ను గుర్తుపట్టలేదు

ఈసారి నన్ను నేనే పరిచయం చేసుకున్నాను.

''మాష్టారూ... నేను శ్రీరామ్‌ని. మీరు నన్ను కాపీకొడుతుంటే పట్టుకుని మందలించారు. జ్ఞాపకం వుందాండీ... ఆరోజు'' అంటూ జరిగింది చెప్పాను. అప్పుడాయన అన్నమాటలు కూడా చెప్పాను.

ఒక్కసారి ఆయన ముఖంలో రంగులు మారాయి.

చాలాసేపటికి ఆయన పెదవులనించి ఆ మాటలు వచ్చాయి. ''అదంతా పూర్వాశ్రమం... పూర్వజన్మ! గుర్తుకొచ్చిందిలే'' అన్నారు తాపీగా.

ఆయనతో మాట్లాడేవాళ్లంతా వెళ్లిపోయారు. మేము ముగ్గురం మిగిలాం.

"శ్రీరాం... నన్నీస్థితిలో చూసి నువ్వు ఆశ్చర్యపోతున్నావుకదూ?" విషాదంగా నవ్వారాయన.

"నన్నీస్థితికి తీసుకొచ్చిన పరిస్థితులు చెప్తాను విను!"

నేను కుతూహలంతో ఉగ్గబట్టుకుని చూస్తున్నాను.

"నాకు లేకలేక ఒక కొడుకు కలిగాడు... నీకు తెలుసుగా?"

"నేను చదివేటప్పటికింకా..."

"అవును... నాకు అప్పటికింకా పిల్లల్లేరు. మాకు చాలాకాలం పిల్లల్లేరు. ఎన్నో పూజలూ, వ్రతాలూ చేశాక కలిగాడు వీడు. తేజస్వి అని పేరుపెట్టి అల్లారుముద్దుగా పెంచుకున్నాం. వీడు పుట్టాక నా భార్య ఆరోగ్యం దెబ్బతింది కూడా. అయినా ఆవిడ తన ఆరోగ్యాన్నికూడా లెక్కచెయ్యకుండా వీణ్ని ఆడింది ఆటగా-పాడింది పాటగా చూసుకుంది. వీడికి చదువా ట్టే అంటలేదు. ప్రతి క్లాసులోనూ తప్పేవాడు. నాతోటి టీచర్లు వీడికి మార్కులువేసి పాసుచేస్తామనేవారు. నేను ఒప్పుకునేవాణ్నికాదు. ఫలితంగా ఒక్కొక్క క్లాసూ రెండుసార్లు చదివాడు. నామీద వాడికి కోపంగావుండేది నేను మార్కులేయించి పాసుచేయించలేదని. ట్యూషను పెట్టించమని ఏడిస్తే సరేనన్నాను. కానీ ట్యూషన్లు చెప్పిన టీచర్లు పరీక్షల్లో వచ్చే ప్రశ్నలు ముందేచెప్తూండటంతో నాకు నచ్చక మాన్పించేశాను అదికూడా. మళ్లీ యథాప్రకారం వీడు తప్పడం.

ఒకసారి రెండుసార్లు వీడు పరీక్షల్లో కాపీచేశాడు. టీచర్లు నాకు చెప్పలేదు. తరువాత ఆ విషయం తెలిసి నేను వీణ్ని గొడ్డుని బాదినట్లు బాదాను. నామీద కోపం ఇంకా ఎక్కువైంది వాడికి. నాతో సరిగ్గా మాట్లాడేవాడుకాదు. ఏదన్నా కావాలన్నా తల్లిద్వారానే జరిగేది. ఆవిడ ఆరోగ్యం అంతంతమాత్రం అవడంతో కొడుకుని గురించిన బెంగ ఇంకా ఆమెని కుంగదీయసాగింది. కొడుకుని వెనకేసుకొచ్చి నాతో వాదించేది. కానీ నేను వూరుకునేవాణ్నికాదు గట్టిగా మందలించేవాణ్ని.

నాక్కూడా తేజస్విని గురించి చాలా బాధగా వుండేది ఎట్లా వీడు పైకివస్తాడా అని!

కాపీలే కొట్టాడో, ఏంచేశాడో ఎట్లాగో యస్.యస్.యల్.సి. అయిందనిపించాడు కాలేజీలో చేరాడు. మరీ విచ్చలవిడి అయ్యాడు. ఇతర అలవాట్లూ వచ్చి చేరాయి. సిగరెట్లు, చెడు సావాసాలు, పేకాట— ఇంకా ఎన్ని రావచ్చో అన్నీ వచ్చాయి. చదువు పూర్తిగా శూన్యం.

నాకు వీడి ప్రవర్తన చూస్తున్నకొద్దీ పిచ్చెక్కిపోసాగింది. నయానా భయానా ఎట్లా చెప్పినా వినడంలేదు. పరీక్షలొచ్చాయి. మళ్లీ కాపీలు. పాసయ్యాడు. నాకు వీడు కొడుకని చెప్పుకోవడమే అసహ్యంగా వుంది. చూసీ చూడనట్లు ఊరుకోసాగాను.

ఏ కాలేజీలోనూ నేను ప్రయత్నించనన్నాను సీటుకోసం. వాడే ఎట్లాగో సీటు సంపాదించుకున్నాడు. మూడేళ్ళు అన్నివిధాలా చెడ్డపేరు తెచ్చుకుని పూర్తిచేశాడు బి.కామ్.

వీడు ఆ తరువాత ఏంచేశాడో తెలుసా? వీడూ వీడి స్నేహితులూ కలిసి ట్యుటోరియల్ కాలేజీ ఓపెన్‌చేశారు.

అంతదాకా బానేవుంది. కాని, వీడో బ్రోకరులా తయారయ్యాడు. లంచాలు పుచ్చుకోవడం ఇప్పించడం ప్రతి విషయంలోనూ చెయ్యసాగాడు. ఆ ట్యుటోరియల్ కాలేజీలో చదువుతున్న పిల్లలు పరీక్ష రాసేటప్పుడు కాపీలందించేవాడు. తను తీసుకునీ, అవతలివాళ్ళకి ఇప్పించీ పరీక్షల్లో మార్కులు వేయించేవాడు. ఇంకా ఏమేంచేసేవాడో నాకు తెలీదు. డబ్బు మాత్రం బాగా సంపాదించాడు.

అన్నిటితోబాటు తాగుడు రేసులుకూడా తోడయ్యాయి వాడికి.

నా మనసు ఇంక విరిగిపోయింది. అహర్నిశలూ ఇదే ఆలోచనలతో నా బుర్ర పాడయిపోయింది. నాకు మనశ్శాంతి లేకుండాపోయింది. ఆ సమయంలోనే నా భార్య మనోవ్యాధితో మరణించింది. నాకు నిజంగా పిచ్చెక్కింది.

నేనెంత ప్రిన్సిపుల్స్ కలవాణ్నో మీకు తెలుసు. ఎంత నియమబద్ధంగా- పరువుగా

జీవితం గడిపేవాణ్నో మీకు తెలీందికాదు. నా దగ్గర చదువుకున్న పిల్లలు, మీకున్న అభిమానంలో వెయ్యోవంతు వాడికున్నా నాకు బాధ వుండేది కాదు శ్రీరాం...

మరి నాకు బాధ ఎట్లా తీరుతుంది? మన శ్శాంతి ఎట్లా వస్తుంది? మీరేచెప్పండి... వచ్చినవాళ్ళనల్లా పిచ్చివాడిలాగా ఇదే అడిగేవాణ్ని. ఎవరో నాకిది అలవాటుచేశారు.

నిజంగా శ్రీరాం... ఇది అలవాటయినప్పట్నించీ. చిత్రంగా నాకు మనశ్శాంతి లభించసాగింది... శాంతిగావుంది!

కానీ శ్రీరాం... నా కొడుకు నీతిలేనివాడయ్యాడు. అవినీతిపరుడయ్యాడు!

నేను నీతిలేనివాడ్ని కాదయ్యా శ్రీరాం... నన్ను అవినీతిపరుడిగా అంచనా వెయ్యకు. తాగినంతమాత్రాన నేను... నేను...'' హఠాత్తుగా ఏడవడం మొదలుపెట్టారాయన.

''నేను శాంతికోసం తాగుతున్నానయ్యా నేను అసమర్థుడిని. నాకొడుకు చెడుమార్గాన నడుస్తున్నా ఏంచెయ్యలేకపోయాను. నా అసమర్థత నన్ను వెక్కిరిస్తూ వుంటుంది. ఈ సమయంలో నా భార్య మరణం నాకు అశనిపాతం. అందుకే ప్రశాంతతకోసం... నేను పిరికివాణ్నికదూ?''

''మాస్టారూ...'' హృదయం ద్రవించిపోయింది నాకు. ఎట్లావుండే మాస్టారు ఎట్లా అయిపోయారు?

''మీరు దిగులువడకండి. మీ అబ్బాయి తన తప్పు తానే తెలుసుకుంటాడు'' అన్నాను.

ఆయన నవ్వి ''అది ఈ జీవితంలో జరగదు'' అన్నారు. ''సరే... ఆ సంగతి వదిలెయ్యి నీసంగతి చెప్పు'' అన్నారు మళ్ళీ తనే. నేను అంతా చెప్పాను.

ఆయన సంతోషంతో ఉప్పొంగిపోయారు. నన్ను గాఢాలింగనం చేసుకున్నారు.

''నేను ఇవాళ నిజంగా ఆనందంగా వున్నానోయ్. గర్వంగా... మహాగర్వంగా...ఉన్నానోయ్. నా స్టూడెంట్... నాదగ్గిర చదువుకున్న పిల్లవాడు జీవితసత్యాలు కనుగొనడానికి నడుంకట్టాడంటే ఎంత గర్వించదగ్గ విషయమది''

ఆనందభాష్పాలు రాలాయి.

''నిజంగా నిన్నుగన్న తల్లిదండ్రులు ఎంత అదృష్టవంతులోయ్... వారిజన్మ ధన్యం...''

''నన్ను మీరు మరీ పొగిడేస్తున్నారు సార్'' అన్నాను నేను తలవంచుకుని.

''నిన్ను చూస్తేనే ముచ్చటేస్తోంది. సరేగానీ శ్రీరాం... మీ సొసైటీలో నన్నూ చేర్చుకుంటారా?'' పసిపిల్లవాడిలాగా అడిగారు.

''తప్పకుండా మాస్టారూ... నేను ఈమాత్రం వున్నానంటే మీ చలవే...

మనం... పట్టుబట్టి తేజస్విని మార్చాలి... మారుస్తామనే విశ్వాసం నాకుంది'' అన్నాను.

ఆ తరువాత తిరిగి వచ్చేశాము.

లంచ్ టైమయింది.

పద్మ డైరీ మూసి లేచింది.

శ్రీరామ్ వచ్చాడు.

''పద్మా మనం రేపు శాంతినికేతన్ చూడటానికి వెళ్తున్నాం. మనతో ఇంకా కొంతమంది ఫ్రెండ్స్‌కూడా వస్తున్నారు''

చాలా సంతోషించింది.

ఆరోజు ఇంక చదవలేకపోయింది పద్మ.

''నీకు ఓపికుంటే ఊరు చూపిస్తాను''

''ఓపికకేం అదేవస్తుంది'' లేచింది పద్మ.

బిర్లామందిర్, విక్టోరియా మెమోరియల్, ప్లానిటోరియం, మ్యూజియం, కాళీఘాట్, దక్షిణేశ్వరం, రామకృష్ణామఠం అన్నీ చూశారు ఒక రొండు.

తీరిగ్గా చూడటానికి టైములేకపోయినా దక్షిణేశ్వరం- రామకృష్ణామఠం చాలా నచ్చాయి పద్మకి. కాళికాదేవివిగ్రహంకూడా ఎంతోబావుంది. చాలాసేపు చూస్తుండిపోయింది.

అట్లాగే దక్షిణేశ్వరంలోని శివలింగాలు చూస్తుంటే ఒళ్ళు పులకరించిందామెకి.

రామకృష్ణామఠం ప్రశాంతంగా ఎంతో బావుంది.

ఇంటికి తిరిగి వచ్చేసరికి చాలా ఆలస్యమైపోయింది.

మళ్ళీ తెల్లవారుఝామునే ప్రయాణంకావడంతో- రాత్రి డైరీ చదవలేదు.

ఆ తరువాతరోజు పొద్దున్నే బయల్దేరి- బస్‌లో శాంతినికేతన్‌కి వెళ్ళారు.



మీ సస్యాలకు రక్షణ... అన్నదాత

మీ పశుపోషణలో శ్రీరామరక్ష... అన్నదాత

మీ ఆర్థిక స్థోమతకు పునాది... అన్నదాత

మీ పంటలకు జవం జీవం... అన్నదాత

చీడపీడలపై బ్రహ్మాస్త్రం... అన్నదాత

రైతులకు, సంస్థలకు వారధి... అన్నదాత

---

## బోనస్ బుక్

నెలనెలా ఇచ్చే వార్తలు, వ్యాసాలు, వివరాలు సలహాలేకాక, వ్యవసాయ రంగానికి, దాని అనుబంధ రంగాలకి చెందిన ముఖ్యమైన ఒక్కో అంశాన్ని కూలంకషంగా చర్చిస్తూ పూర్తి వివరాలతో, ఫోటోలతో కూడిన సప్లిమెంట్‌ను ఒక క్రమపద్ధతిలో ఇచ్చే 'బోనస్‌బుక్' 'అన్నదాత' పాఠకులకొక అమూల్యమైన కానుక.

నెలనెలా అన్నదాత చదవండి!
మీ పురోభివృద్ధికి మీరే మార్గంవేసుకోండి!!

డిసెంబర్ 87 సంచిక అన్నదాత కానుక
'నూనెగింజలు'పై బోనస్‌బుక్.

సంవత్సర చందాకై రు. 30/- అన్నదాత పేరిట డి.డి.ని అన్నదాత, ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్‌కి పంపండి.

శాంతినికేతన్‌కి మనదేశంలో ఎప్పుడూ ఒక ప్రత్యేకతవుంది.

విశ్వకవి శ్రీ రవీంద్రనాథ్‌ఠాగూర్ నిర్మించిన శాంతినికేతన్ ఆ రోజుల్లో కళలకి పుట్టినిల్లై అలరారింది.

అక్కడికి దేశదేశాలనుంచీ విద్యార్థులు వచ్చి నృత్యం- చిత్రలేఖనం- సంగీతం- మొదలైనవి నేర్చుకుంటూ వుండేవారు.

ఇప్పుడదే విశ్వభారతి అని యూనివర్శిటీ అయింది.

పద్మకి ఆ చోటులో అడుగుపెడుతూనే హృదయం పులకరించింది పవిత్రమైనభావంతో చుట్టూ చెట్లు. గురుకులాశ్రమంలాగా వుండేదేమో మొదట. చుట్టూతిరిగి అన్నీ చూశారు.

రవీంద్రుని ఛాయాచిత్రాలూ, ఆయన రాసిన పుస్తకాలు అన్నీ తరచి తరచి చూసింది పద్మ. మాటల సందర్భంలో అన్నాడు శ్రీరామ్

"నాకు అనుభవంలో కొన్ని అవాంఛనీయ సంఘటనలు జరిగాయి."

"అవేమిటి?" బయటకివచ్చి తోటలో కూచున్నప్పుడు అడిగింది పద్మ.

"నువ్వే చదువుతావుగా?" అన్నాడు.

"ఏదో వుంది" అనుకుంది పద్మ. ఆరోజు చదవలేకపోయింది.




తెల్లవారుఝామునే లేచి డైరీ తెరిచింది. శ్రీరామ్ వరండాలో పద్మలోపలా పడుకుంటూండటంవల్ల శ్రీరామ్‌కి పద్మ లైటు వేసినా తెలీలేదు. నిద్రలోనే వున్నాడు.

డైరీ చదవసాగింది పద్మ.

"ప్రొఫెసర్‌గారి ఉత్తరాలు చాలా ఉత్సాహన్నిస్తున్నాయి.

మా ఆఫీసువాళ్లంతా కలిసి రెండువలు ఒరిస్సా టూర్ వెళ్లాలని ప్లాన్ వేశా కోణార్క్, పూరీ, కటక్, భువనేశ్వర్ చూడా

మా ఆఫీసులో ఇద్దరు ముగ్గురు ఆడవా వున్నారు. వాళ్లల్లో స్మిత అందంగా వుంటుం అందరితో చనువుగా వుంటుంది. ఒరిస్సా చాలాకాలంగా సెటిల్ అయ్యారట. తన త దండ్రులు అక్కడే వున్నారంది.

నేను మొదట ఆ అమ్మాయి బెంగాలీ లేక ఒరియాన్ అనుకున్నాను. కానీ అమ్మాయి పదహారణాల తెలుగుపిల్ల.

ప్రయాణంలో చాలా చలాకీగా వుం అందరికీ కేంద్రం ఆ అమ్మాయే అయింది. అమ్మాయి చూపులు నామీద నిలిచిపోవడ నేను రెండు మూడుసార్లు గమనించాను. క అంతగా పట్టించుకోలేదు..

మా అందరికీ బస వాళ్లింట్లోనే అంది అమ్మాయి. వాళ్లుండేది భువనేశ్వర్‌లో.

వాళ్లు చాలా ధనవంతులు. వాళ్ళ నా వ్యాపారంలో చాలా గడించాడు. చాలాపె ఇల్లు. మాకు చాలా హాయిగావుంది అక్క వుండటం.

ఎక్కడికి వెళ్లాలన్నా కార్లు-! ఈ అమ్మాయ ఒక్కతే కూతురు వాళ్లకి. ఒక కొడుకున్నాడ మరి ఈ అమ్మాయి కలకత్తాలో ఎందుకుంది ఇంత ధనవంతుల కూతురు క్లర్క్ ఉద్యోగ చెయ్యడం ఏమిటి? అన్నీ ప్రశ్నలే.

నాకెందుకని ఊరుకున్నాను.

ఒరిస్సాలో అన్ని ప్రదేశాలూ దగ్గరుం చూపిస్తున్నారు వాళ్లు.

ఒకరోజు అంతా వెళ్లిపోయారు సైట్‌సీయింగ్‌కి. నేను జ్వరం రావడం వల్ల వెళ్లలేకపోయాను.

పడుకుని వుంటే స్మిత వచ్చింది. ఆమెని చూసి నేనాశ్చర్య పోయాను.

"మీరు వెళ్ళలేదా-?" అనడిగాను.

"లేదు" అంది నవ్వుతూ.

ఆమెది అద్భుతమైన సౌందర్యం. దానికిత

జగన్మోహనంగా అలంకరించుకుంది.

ఆడవాళ్ల అలంకరణ వర్ణించడం నాకు ు. కానీ నాకు ఆమె చాలా అందంగా పించింది.

మేము తెలుగులోనే మాట్లాడుకునేవాళ్లం.

'ఎట్లావుంది?'' అనడిగింది.

నాకు ఇంకా జ్వరం వుంది. కళ్లుమండుతు యి. వంటరితనంగా వుంది. అమ్మ గుర్తు స్తోంది. ఈ అమ్మాయి వచ్చి నా క్షేమసమా ారాలడగడం నాకు ఓదార్పునిచ్చింది.

''ఫరవాలేదు'' అన్నాను.

''ఒక్కరోజులోనే బలహీనమయ్యారు. పాలు గుతారా?''

''వద్దు''

''వద్దంటే కాదు... తాగాలి!''

పాలల్లో గ్లూకోజ్ కలిపి ఇచ్చింది.

ఇచ్చింది అనేకంటే తాగించింది అనడం వుంటుంది.

నాకు శక్తివచ్చింది కొంతదాంతో.

టవల్‌తో నాముఖం తుడిచింది. మధుర ైన పరిమళం. నా మనసు ఏవేవో లోకాల్లో ిలిపోతోంది. వంగి నన్ను...

ఉలిక్కిపడ్డాను.

''స్మితా... ఏమిటిది?'' అరిచాననుకున్నాను. ానీ నామాట బలహీనంగా వుంది.

''ఐలైక్ యూ... మీరు చాలా అందంగా ఉంటారు'' అంది.

అని వెళ్లిపోయింది.

జీవితంలో మొదటిసారి ఒక ఆడపిల్ల నా అందాన్ని మెచ్చుకోవడం!

మధురస్మృతి!!

నాలోనూ ఆమె అంటే ప్రేమతరంగాలు లేచాయి.

కానీ ఇది సమయంకాదు. నేను వచ్చినపని వేరు అనుకున్నాను.

ఆమె మాత్రం అనునిత్యం నన్ను కవ్వించ సాగింది. నా మనసులో వివిధమైన వూహాలు. వికారాలు!

మనసుపెట్టి ఏ ప్రదేశమూ ఆ తరువాత వివరంగా చూడలేకపోయాను.

నా మనసంతా స్మితే నిండిపోయి వుంది!

మూన్‌లైట్ డిన్నర్ అరేంజ్‌చేశారు వాళ్ల గార్డెన్‌లో.

అందరూ కబుర్లాడుకుంటూ భోజనం చేస్తున్నారు. రికార్డులు వింటున్నారు కొందరు.

ఒకపక్కన మేమిద్దరమే వున్నప్పుడు స్మిత నాకు అతి సన్నిహితంగా వచ్చి నా రెండు చేతులూ పట్టుకుని ''నువ్వు నాకు కావాలి'' అంది!

''నాకూ అంతే స్మితా'' అనుకున్నాను. కానీ ఆరోజు రాత్రి...

ఆమె అంత సాహసిస్తుందనుకోలేదు. ఎట్లా అరేంజ్ చేసిందో నా రూమ్‌లోవున్నవాళ్లని సెకెండ్‌షో సినిమాకి పంపించేసింది.

తలుపు తెరుచుకుని వచ్చి నాపక్కమీద కూచుంది!

నా మనసు వివశమౌతోంది.

ఎంత అందం! ఎంత ఆకర్షణ!...

నన్ను నేను నిగ్రహించుకోవడం కష్టమౌ తోంది!

ఒక ట్రేలో సీసాలు గ్లాసులు!!

ఎప్పుడు పెట్టిందివి??

నాతల తిరిగిపోయింది.

ఆమె ఒక గ్లాసు నింపుకుని గడగడా తాగింది. స్త్రీలు తాగడం.... ఛీ ఛీ!!

నా మత్తు ఒక్కసారిగా దిగిపోయింది.

నేను ఏవేవో అనుకున్నాను.

స్మితని ప్రేమించాను.

వాళ్ల తల్లిదండ్రులనడిగి ఆమెని పెళ్లి చేసుకుందామనుకున్నాను.

వాళ్ల డబ్బు మాత్రం వద్దని చెబుదామనుకున్నాను. ఆమె అందం నా స్వంతమయితే చాలనుకున్నాను. ఇద్దరం వుద్యోగాలు చేసుకుని బతకొచ్చనుకున్నాను.

ఆమెతో అమరసౌఖ్యాలు అనుభవిద్దామనుకున్నాను. కాని నాదంతా భ్రమ.

ఈమె హైసొసైటీ స్త్రీ!

ఆ సొసైటీలోనే పెరిగింది. కొన్ని ఫాషన్లు

మరికొన్ని అలవాట్లు... ఇవి ఇవి వదులుకో లేదా?

డబ్బుతో వచ్చే ఈ సుఖాలు రేపు నేనివ్వగలనా? వాళ్లు మంచినీళ్లు తాగేగ్లాసే నా నెలజీత మంత. వుంటుంది.

నేనీమెని భరించలేను...

తాపీగా కుర్చీలో కూచున్నాను.

ఆమె లేచి మరో గ్లాసులో ఆ ద్రవాన్ని నింపి వయ్యారంగా నాకందించబోయింది.

కాదు ... తాగించబోయింది.

నాకనిపించిందప్పుడు,

ఆరోజు పాలు- తియ్యని పాలు. అందరికీ అందుబాటులో వున్నపాలు. స్వచ్ఛమయినపాలు- నిర్మలమైన పాలు అందించింది.

కానీ ... ఇవాళ?

కల్మషమైన ద్రవం, విషంలాంటి ద్రవం మనుషుల్ని నాశనం చేసే ద్రవం, మనసులను చంపివేసే ద్రవం, ఖరీదైన మనుషులు తాగే ద్రవం, ఇస్తోంది.

ఎంత తేడా ఈ రెండింటికీ?

నాకు కావల్సింది ఎప్పుడూ పాలవంటి నిర్మలమైన మనసు, అంతే!

నేను ఆ గ్లాసు చేతిలోకి తీసుకుని బల్లమీద పెట్టేశాను.

ఆమె నావెనక్కొచ్చి నిల్చుంది...

నేను చటుక్కున లేచాను.

"నాకు నువ్వు కావాలి"

ఆ అనడంలో మత్తు, కవ్వింపు, మోహం కామం, ... ఇంకా ఎన్నెన్నో

"అయాం సారీ..." అన్నాను అక్కణ్నించి ఇవతలికి వచ్చి.

ఆమె తెల్లబోయింది.

అది అవమానంగా భావించిందేమో....

వెక్కి వెక్కి ఏడవసాగింది.

"ఏడవద్దు స్మితా... నేను నీకు తగను. నీకు కావాలంటే నన్నుమించిన వాళ్లు దొరుకుతారు. నేను నీ భర్తనయితే నువ్వు సుఖపడవు. నీకు బాగా డబ్బున్నవాళ్లయితేనే మంచిది... నువ్వు సుఖపడగలవు"

"కాదు ... కాదు" తలాడించింది.

"డబ్బు సుఖం ఇవ్వదు, శాంతి నివ్వ ఆమె ఇంకా ఇంకా ఏదో అంటూ రోదించి

ఆమె తల్లి, తండ్రి ఎట్లా, ఎప్పుడు లోప వచ్చారో మేము గమనించనేలేదు.

"స్మితా.... లోపలికి పద"

నెమ్మదిగానే అయినా, గంభీరంగా అ డు ఆమె తండ్రి.

తల్లి ఆమెని లోపలికి నడిపించుకుని కెళ్లింది.

ఆమె తండ్రి నావంక ఒకమారు చ "పెద్దమాటలు మాట్లాడుతున్నావు. భర్త ఇదీ అంటూ?! స్మితకి పెళ్లయింది. భర్త బ ఉన్నాడు!"

అని వెళ్లిపోయాడు.

నా నెత్తిన పిడుగుపడింది!

నేను శిలా ప్రతిమనైపోయాను.

"స్మి-త-కి - పె- ళ్ల- యిం-దా?"

★ ★ ★

నేను తిరిగి వచ్చేశాను ... ఆ మర్నాడ

చాలారోజులదాకా మామూలు మనిషినిక కపోయాను.

తరువాత నాకు కొన్ని విషయాలు తె శాయి ఆమె గురించి-

ఆమెకీ, ఆమె భర్తకీ మాటామా వచ్చిందని. భర్త ఆమె విచ్చలవిడితనా భరించలేకపోతున్నాడు. అందుకే స్మి విడిగా వుంటోంది. ఆమె భర్త కూడా కలక లోనే ఉన్నాడు. అతడు వీళ్లకన్నా ధనవం డు.

స్మిత తిరుగుడు, పోకడలు భరించలేక అతడు దూరంగా ఉన్నాడని తెలిసింది నాక

అప్పట్నించీ నేను స్మితని కన్నెత్తి చూడ దు.

కొంతకాలమైనాసరే నా మనసు తప్పు రిలో నడిచినందుకు నేను ఆ తరువాత చా పశ్చాత్తాపపడ్డాను. నన్ను నేనే నిందించుకున్ను.

ఆ తరువాత స్మిత కాపురాన్ని చక్కదిద్దాల కోరిక నాకు కలిగింది.

స్మిత భర్తని కలుసుకుందామని వెళ్లాను.

అతడు చాలా డబ్బున్నవాడు.

నన్ను చూసి మొదట నీచంగా మాట్లాడాడు.

"నువ్వు దానికి ఎన్నో మొగుడివి?" అన్నాడు.

ఈ ప్రశ్నకి నా రక్తం ఉడికిపోయింది. అయినా తమాయించుకున్నాను.

నాగురించి ఒకటొకటే చెప్పుకొచ్చాను.

నేను చేస్తున్న సత్యాన్వేషణ సంగతి చెప్పగానే అతడు తగ్గాడు. నెమ్మదిగా, మంచిగా



మాట్లాడటం ప్రారంభించాడు.

అతడి చూపులోనూ, మాటలోనూ కూడా మార్పొచ్చింది. అప్పుడే గ్రహించింది నామన ను ఇతడు సహజంగా చాలా మంచివాడనీ, స్మిత తప్పులన్నీ ఎంతో సహనంగా భరించి భరించి చివరికి, విధిలేక దూరమయ్యాడనీ. అది కూడా ఆమె మారవచ్చనే ఆశతోనే అనీ

అతణ్ని చూస్తుంటే స్మితతో వియోగం అత ణ్ని బాగా కుంగదీసినట్లు తెలుస్తోంది స్ప ష్టంగా. కానీ స్మితంటే చాలా కోపంగా ఉందత డికి.

నేనా విషయం ఎత్తితే అతడంత లైక్ చెయ్యకపోయినా, నాతో ఇట్లా అన్నాడు-

"నాకు అన్నీ ఉన్నాయి. నేనూ కాస్తోకూస్తో అందగాడినే. అయినా కూడా నా భార్య నా కళ్లె దుట పరాయివ్యక్తితో తిరుగుతుంటే నేనెట్లా సహించగలనో మీరే చెప్పండి!"

"ఆవిడ ఇంక తన ప్రవర్తన మార్చుకుంటా నని ప్రామిస్ చేస్తే మీరు కలిసి ఉంటారా?"

"ఆవిడ ప్రామిస్‌లు నేను నమ్మను.

పైగా ఆవిడకి తల్లిదండ్రుల మద్దతు ఉంది. అయినా మా విషయంలో మీకెందుకు ఇంటరెస్ట్?"

"మిమ్మల్ని చూస్తే సంతోషం వేస్తోంది. అంతకంతకీ గౌరవం పెరుగుతోంది"

"అదంతా మీ మంచితనం అంటే"

నేను లేచాను. నెమ్మదిమీద అతణ్ని ఒప్పించగలనని తోచింది.

"నిజంగా స్మితలో మార్పంటూ వస్తే- మీరా మెని స్వీకరిస్తారా?"

"నిజంగా ఆమెలో మార్పంటూ వస్తే-... కలిసి ఉండటానికి నాకు అభ్యంతరంలేదు ... సరేనా"

ఈ మాట చాలనిపించింది నాకు. ఉత్తము లు మాటఇచ్చి తప్పరు.

ఇంక స్మితని కలుసుకున్నాను.

స్మిత కూడా మొదట్లో నాతో సరిగ్గా మాట్లాడ లేదు. నేనే కల్పించుకుని మాట్లాడాను.

అసలు విషయానికి వచ్చాను.

ఆమె ఉద్రేకంగా నాతో వాదించింది.

నేనూ గట్టిగానే మాట్లాడాను.

తగ్గింది.

అట్లా రెండుమూడుసార్లు ఆమెతో మాట్లా డగా మాట్లాడగా చివరికి అంది- "ఆయన ఉట్టి అనుమానం మనిషి. నేను ఆడవాళ్లతో మాట్లాడినా అనుమానమే"

"అనుమానం అనుమానమేనని నిరూ పించు" అన్నాను.

"ఇంకా నిరూపణ ఎందుకూ? మనిద్దరి విషయమే తీసుకో... దీనికి కూడా నిరూపణ కావాలా?" అంది.

నేను క్షణం మాట్లాడలేదు. నాకేదోగా అని పించింది.

"అన్నీ ఇంతేనా?"

"ఆ... ఇంతే!"

నా బలవంతంమీద భర్తతో కలిసివుండటా నికి వప్పుకుంది.

ఉన్న ఇల్లు ఖాళీచేసి భర్తతో వుండసాగింది. కానీ ఉద్యోగం మానలేదు.

ఆమెలో మెల్లగా మార్పు వస్తోంది. "ఎందుకు శ్రీరామ్... మామీద ఇంత శ్రద్ధ నీకు? మేము కలిస్తే నీకేం వస్తుంది? కలవక పోతే ఏంనష్టం నీకు?" అన్నారాయన ఓసారి.

"ఏదన్నా మంచిపని చెయ్యడం అంటే నాకిష్టం" అన్నాను.

"ఎంతోమందిని చూస్తూవుంటాం ఈ ప్ర పంచంలో. కానీ ఈ వయసులోనే నీలా తయా రయిన మనిషిని ఇంతవరకూ మేము చూడలే దు. నీకెట్లా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీ డంలేదు" అన్నాడు స్మిత భర్త.

నేను నవ్వాను.

స్మిత అంది- "మేము కూడా నీ సొసైటీలో చేరచ్చా?"

"ఓ తప్పకుండా... మాకు డబ్బుకూడా అవ సరమే" అన్నాను నేను.

★ ★ ★

"నీకింకో అవినీతికేసు చూపిస్తాను" అన్నా డు రామకృష్ణ.

"ఎవరు?" నేనడిగాను.

"సేతురామయ్యగారని ఇక్కడో ఇంజినీరు





న్నాడు. రిటైరుమెంటు వయసు వచ్చేసిందను కో ఆయనకి.

ఆయన చాలా కష్టపడి చదువుకుని పైకివచ్చాడు. చదువులో ఫస్టు వచ్చినా పైచదువు చదవడానికి డబ్బులేక ఎవరో పెద్ద డబ్బున్నవారిని ఆశ్రయించి నెలనెలా వాళ్లు కొంత డబ్బు పంపించేలాగున ఏర్పాటుచేసుకుని చదువుకున్నాడుట. ఎట్లాగో పైకివచ్చి ఇంజినీరింగు పాసయ్యాడు.

ఉద్యోగం కూడా ఎవరి సహాయంవల్లనో సంపాదించుకున్నాడు.

అప్పటిదాకా మంచితనం, నెమ్మది స్వభావంమీదే నెగ్గుకొచ్చాడు.

ఉద్యోగంలో చేరిన తరువాత పెళ్లయింది. ఆతరువాత వరసగా ఆడపిల్లలు పుట్టారు. కొడుకుకోసం చూసి నిరాశ చెందాడు! వచ్చిన జీతంతోనే పిల్లల్ని చదివించుకుంటూ వాళ్ల కోరికలు తీర్చుకుంటూ వచ్చాడు. ఏనాడూ లంచాల గురించి ఆలోచించేవాడు కూడా కాదు.

ఆతరువాత ఏమైందో తెలుసా? ఈయన పైఆఫీసరు తప్పుదారిన నడిచేవాడు. లంచాలు పుచ్చుకోవడం చాలా ఎక్కువ. దాంట్లో కిందివాళ్లని పావులుగా వాడుకునేవాడట. ఈయనకది చాలా బాధగా వుండేది. రక్తం ఉడికిపోయేది. ఎబ్బెట్టుగా వుండేది. తను మంచిదారిన నడిచినా లాభంలేకపోయేది.

ఏది మంచి- ఏది చెడు? పై ఆఫీసరు చెడ్డవాడైతే కిందివాడికి కూడా మాటలు, అపవాదులు తప్పవు. ఈయన చాలా ఫ్రస్టేటు అయ్యేవాడు.

ఆ సమయంలోనే ఇంట్లో చాలా ఖర్చులొచ్చాయి. పిల్లల పెళ్లిళ్లు, తల్లి చావుబతుకులు, భార్య అనారోగ్యం. పరిస్థితులు విషమిస్తున్నాయి. డబ్బుకి కటకటగా వుంది.

అట్లాంటి పరిస్థితిలో ఎవరో సహాయం ఆఫరుచేశారు. తీసుకుంటే తప్పులేదనుకున్నాడు. తీసుకోకుండావున్నా తనగురించి ఎవరో ఏదో చెప్పుకుంటూనే వున్నారు. ఇంక కొత్తగాపోయే పరువేంలేదు. ఏమాత్రం లేదు అనుకున్నాడు. అంతే, గీటు దాటాడు- ఆ గీటు దాటడానికి కారణాలున్నాయి అనుకుంటూ తనని తనే సమర్థించుకున్నాడు.

తను డబ్బు రూపేణా ఏదీ తీసుకోలేదు అంటాడు, తప్పులేదు అంటాడు.

ఆడపిల్లల పెళ్ళిళ్లు చేశాడు. తనకో ఇల్లు ఏర్పరచుకొన్నాడు. కారు కొన్నాడు. ఇది అవినీతేనా కాదా?'' అన్నాడు రామకృష్ణ.

తను ఆదర్శాలు వల్లించడంలో ఇప్పటికీ దిట్టే.

''ఆయన్నొకసారి కలుద్దామా? ఒక్క చిన్న మాట అడగాలి. ఆయన గీత దాటకముందు వున్నంత నిశ్చింతగా ప్రశాంతంగా ఇప్పుడు న్నాడా'' అని.

''ఓ యస్ తీసుకెళ్తాను'' అన్నాడు రామకృష్ణ.

ఆతరువాత ఒకరోజు ఆయనదగ్గరకి తీసుకెళ్లాడు రామకృష్ణ.

ఆయన మమ్మల్ని చూడటానికే అంగీకరించలేదు మొదట.

ఆతరువాత అంగీకరించినా సరిగా మాట్లాడనేలేదు. మాట్లాడినా పొడిపొడిగా జవాబులిచ్చాడు.

నా విషయాలన్నీ రామకృష్ణ వివరించగా చివరికి కాస్త బాగా మాట్లాడటం ప్రారంభించాడు.

కానీ ఆ టాపిక్ ఎత్తలేదు. మమ్మల్ని ఎత్తనివ్వలేదు. చివరికి రామకృష్ణే నెమ్మదిగా ఎత్తాడు అసలువిషయం.

అయినాగూడా తననితను సమర్థించుకుంటూ మాట్లాడాడు, వాదించాడు.

వాదించగా వాదించగా ఎట్టకేలకు తనకి ఇదివరకటి మనశ్శాంతి, ప్రశాంతత లేవని ఒప్పుకున్నాడు.

దానికేంచెయ్యాలో చెప్పమన్నాడు.

ఇప్పుడన్నా మించిపోయిందిలేదు. మంచి మార్గాన మళ్లవచ్చునని చెప్పాను. చేసినవి తప్పులని మనస్ఫూర్తిగా ఒప్పుకుంటే చాలన్నాను. ఆలోచించుకుని మా సమాజంలో చేరమన్నాను.

ఆలోచిస్తానన్నాడు.

మేము లేచి వచ్చేశాము.

ఈ ప్రపంచంలో ఎన్నిరకాల మనుషులు? ప్రతిఒక్కళ్లనీ మనం మార్చగలమా?

శాంతిని నెలకొల్పగలమా?

ఆలోచిస్తూ నిద్రపోయాను.

ఆ మర్నాడు ఆఫీసుకి వెళ్తే మా ఆఫీసులో పనిచేస్తున్న రీటా అనే ఇంకో అమ్మాయి చుట్టూ అంతా మూగివున్నారు.

ఏమిటా అని నేనూ వెళ్లానటు.

ఆ అమ్మాయి ముఖం పాలిపోయి వుంది.

అంతకుముందు రెండురోజులు ఆ అమ్మాయి ఆఫీసుకు రాలేదు. ఆరోజే వచ్చింది.

ఆ అమ్మాయి ఇంట్లో దొంగతనం జరిగిందిట! నగలు, డబ్బు మొత్తం పోయాయట.

అన్నింటికన్నా ఆశ్చర్యం ఆ తీసినవాడు వాళ్లింట్లో నమ్మకంగా ఎన్నేళ్లనించో పనిచేస్తున్న పనివాడు. వాణ్ని వాళ్ల వూరునుంచి తీసుకొచ్చి స్వంతమనిషిలా చూసుకున్నారు. వాడేమో ఇలా చేశాడు.

పాపం ఆ అమ్మాయి ఎంతో కష్టపడి డబ్బు దాచుకుని సొమ్ములు చేయించుకుందిట.

పిల్లలు ఇద్దరు ఆవిడకి. వాళ్లింకా చిన్నవాళ్లు. వాళ్లిద్దరికీ కూడా ఏవో చేయించిందిట. పండగ వెళ్లాక అవి బాంకులో పెడదామనుకుంటోందట.

అంతలో ఇది జరిగింది.

ఇంట్లో వాణ్ని కాపలాపెట్టి ఎక్కడికోవెళ్తే వచ్చేటప్పటికి ఇల్లు ఖాళీ.

ఆ పిల్లవాడికి నిండా ఇరవై ఏళ్లుగూడా లేవుట.

ఇక్కడ పనివాళ్లు దొరకడంలేదంటే వాళ్ల అమ్మ ఈ అబ్బాయిని నాలుగేళ్ల కిందట పంపించిందిట.

ఇన్నాళ్లూ బాగానే వున్నాడట. బాగానే ఏమిటి... ఇంట్లో పిల్లవాడిలాగానే వుండేవాడు. వీళ్లూ అట్లాగే చూసుకున్నారు.

ఇది వాడికి పుట్టినబుద్ధికాదు- అంటుంది రీటా.

ఆమెకి సొమ్ములు పోయాయని దిగులేకాదు- ఆ పిల్లవాడు ఏమయ్యాడో అనికూడా భయం. పోలీసు రిపోర్టు ఇచ్చార్ట.

నేను వింటూండిపోయాను. దొంగతనం, మోసం- రెండూ అవినీతి పనులే. అసలివి ఎందుకు జరుగుతాయి? మొగవాడు. వాడికి సొమ్ములు అక్కర్లేదు. డబ్బుకావాలి. డబ్బుకోసం సొమ్ములు కాజేశాడు. ఆ కాజేసేటప్పుడు ఆకలివేస్తే అన్నంపెట్టే అమ్మగారుకానీ సినిమాకి సొమ్మని డబ్బులిచ్చే అయ్యగారుకానీ అమ్మ తిడితే ఏడుస్తూ ఎత్తుకొమ్మని వచ్చే చిన్నపిల్లలుగానీ గుర్తుకొచ్చి వుండరు వాడికి! అన్నింటినీ మించిన అవసరం ఏదో డబ్బుతో వచ్చి వుండాలి వాడికి.

అదే నిజమయితే ఆ అవసరం తీరాక మళ్లీ వీళ్లదగ్గరికే వస్తాడు వాడు.

అదే చెప్పాను నేను.

అన్నట్టే జరిగింది. తరువాత వారానికి ఆ అబ్బాయి మొహం వేళ్లాడేసుకుని తిరిగి వచ్చాడుట.

సొమ్ములు ఎత్తుకుపోయినట్లు ఒప్పుకున్నాడుట. కానీ ఆరోజే ఎవరో వీడు నిద్రపోతుండగా వీణ్ని తన్ని ఆ సొమ్ములు వీడిదగ్గర్నించి ఎత్తుకుపోయారుట! వీడికి వారంనించి తిండిలేదు- నీళ్లులేవు. తిరిగి రావడానికి మొహం చెల్లలేదుట. అట్లాగే మాడుతూ రైల్వేస్టేషన్లో వుండిపోయాడుట. ఇంక ఉండలేని పరిస్థితి వచ్చేటప్పటికి తిరిగి వచ్చాడుట. వాణ్ని బాగా మందలించామని చెప్పింది రీటా. ఇంక వాణ్ని వాళ్లవూరికి పంపించేస్తున్నామని చెప్పింది రీటా. నేనొకసారి వాణ్ని చూస్తానన్నాను. వాళ్లింటికి తీసుకెళ్లింది.

"ఇదిగో వీడే..." చూపించింది.

పిల్లవాడు కుదురుగ్గా చక్కగా వున్నాడు. పాపం చదువుకుంటే ఎలా ఉండేవాడోకదా అనిపించింది.

వాణ్ని కదిలించి మాట్లాడాను. వాడు పశ్చాత్తాపంతో బాగా కుమిలిపోతున్నాడు.

"నాతో చెప్పు... ఎందుకు తీశావా సొమ్ములు?" అని అడిగాను.

వాడు బావురుమని ఏడిచాడు "నాకు ఇంటికి వెళ్లాలనిపించిందండీ. మా అమ్మకీ,

చెల్లెళ్లకీ ఏమన్నా తీసుకెళ్దామంటే ఏమీ లేకపోయాయి. అందుకని... అందుకని... బుద్ధి గడ్డి తింది''

''అంటే బంగారునగలు వాళ్లకిద్దామనుకున్నావా? లేకపోతే అవి అమ్మి వచ్చిన డబ్బుతో ఏమన్నా కొందామనుకున్నావా?''

''నా దగ్గరసలు రైలుఛార్జీలకే డబ్బుల్లేవు. అందుకని...''

''వెళ్లాలంటే రైలుఛార్జీలు అయ్యగారివ్వరూ?'' రీటా అంది.

''వచ్చేఏడు ఇంటికి వెళ్దామన్నారు అందుకని అడగడానికి ధైర్యం చాలలేదు''

''అందుకని దొంగతనం చేశావు? నువ్వుచేసిన దొంగపనికి నిన్ను జైల్లోపెట్తారు... తెలుసా?''

వాడు పెద్దగా ఏడ్చాడు.

నేను వాణ్ని ఓదార్చి, హితవుచెప్పి తిరిగి వచ్చాను. వాడు స్వతహాగా మంచివాడే. వాణ్ని కూడా సొసైటీ స్టార్టుచేశాక తీసుకుందామనుకున్నాను.



స్మిత ఆరోజు వచ్చి నా రూము తలుపు కొట్టింది. తలుపు తీశాను.

''మీరు తొందరగా మాతో హాస్పిటల్‌కి రావాలి'' అంది.

అప్పుడు రాత్రి ఎనిమిదిగంటలయింది. గబగబా రెడీఅయి బయటికివచ్చాను.

టాక్సీలో ఎవరో పడుకుని వున్నారు. 'ఎవరు?' అడిగాను.

''మా పక్కింటివాళ్లమ్మాయి. కిరసనాయిలు పోసుకుని అంటించుకుంది. మావారు ఊళ్లోలేరు. నాకేంచెయ్యాలో తోచలేదు. వెంటనే ఇక్కడికి తీసుకొచ్చాను. ఆ అమ్మాయి స్పృహలోలేదు'' అంది.

తనకి తెల్సిన డాక్టరు దగ్గిరికి తీసుకెళ్లమంది టాక్సీని. వెంటనే అడ్మిట్ చేశారు. లక్కీగా ఎక్కువ కాలలేదు శరీరం. షాక్‌వల్ల స్పృహ కోల్పోయింది ఆ అమ్మాయి. ప్రాణభయం లేదన్నాడు డాక్టర్.

ఆ అమ్మాయికి ట్రీట్‌మెంట్ ప్రారంభించారు. బాధ తెలీకుండా వుండటానికి మత్తు ఇచ్చారు.

నేనడిగాను- ''ఏమైందసలు... ఆ అమ్మాయి ఎందుకిట్లా చేసింది?'' అని.

''ఈ అమ్మాయి ప్రేమించి పెళ్లిచేసుకుంది. దానివల్ల అత్తగారూవాళ్లకి కట్నకానుకలు కుదరలేదు. ఆ అత్తగారు తెగబాధలుపెడ్తూ వుంటోంది కోడల్ని. మాటలనడమేకాదు... కొట్టడం- తిట్టడం- వాతలుపెట్టడం ఒకటే హింసిస్తోంది''

''మరి భర్త?''

''అదే వచ్చింది. భర్త అండగా నిలిస్తే ఈ అమ్మాయికి బాధేలేదు. కానీ ఆ భర్త ఏమీ మాట్లాడడు. అన్నిబాధలూ సహిస్తూనేవుంది. కానీ ఇవాళ క్లైమాక్సు కొచ్చిందిట. ఆ అత్తగారు కొడుక్కి వేరే పెళ్లిచేస్తానందిట. అనడమేకాదు సంబంధాలు కూడా చూస్తోందిట. భర్తేం మాట్లాడడు. ఆ అమ్మాయి చాలా నరకం అనుభవించింది. ఎంత బాధపడకపోతే ఈ పనిచేస్తుంది?''

''వరకట్న దురాచారం ఎంతెంత పనులు చేయిస్తోంది?'' అన్నాను.

మేము అక్కడే కూర్చున్నాం తెల్లవార్లూ నాకొక్కటి మాత్రం సంతోషం- స్మిత పూర్తిగా మారిపోయింది.

వారం పదిరోజులు అయ్యాక ఆమెని హాస్పిటల్‌నించి డిశ్చార్జి చేశారు.

నేను ఆమె భర్తని కలుసుకుని మాట్లాడాను. అప్పుడు స్మిత- ఆమె భర్త కూడావున్నారు. ''నీ భార్యని నువ్వే కాపాడుకోవాలి. మీ అమ్మకి అర్థమయ్యేటట్లు నువ్వు మాట్లాడాలి. లేకపోతే నీ భార్య నీకు దక్కదు. నువ్వు ఆ అమ్మాయిని

పెళ్లాడావు. ఆ అమ్మాయి అన్నివిధాల సుఖ పడేటట్లు చూసే బాధ్యత నీది. నువ్వు ఆమెపై ప్రేమ చూపిస్తే ఇంక ఆమెకేం అక్కర్లేదు... తెలిసిందా?''

ఆ అబ్బాయి అప్పటికే మానసికంగా బాగా దెబ్బతిని వున్నాడు. ఈ సంఘటనతో పూర్తిగా కదిలిపోయాడు. మేము చెప్పినవాటన్నిటికీ తలవూపాడు.

నాకూ ఆ అబ్బాయిని చూస్తే జాలేసింది.

ఈ సంఘటనలన్నీ నా స్టడీకి ఉపయోగించాయి. వరకట్న దురాచారం ఒక అవినీతి-

దొంగతనం- మోసం- కూడా అవినీతి పనులే-

లంచగొండితనం అవినీతి-

పరీక్షల్లో కాపీకొట్టడం అవినీతి-

శీలాన్ని పవిత్రంగా భావించకపోవడంకూడా అవినీతే-

ప్రస్తుతానికి నా రీసెర్చి ముగిసినట్లే-

రేపు పద్మ వస్తోంది.

★ ★ ★

డైరీ మూసేసి లేచింది పద్మ.

ఆ తరువాత ప్రయాణంలో వివిధరకాలుగా చర్చించుకున్నారు ఇద్దరూ.

''జెలసీ అనేది చిన్నాపెద్దా అనేది లేకుండా అందరికీ వుంటోంది. ఎక్కడ చూసినా ఈర్ష్యే. ఈర్ష్యనించే ఓర్వలేనితనం. ఒక వస్తువు తనకి వుంటే చాలదు, అది ఇంకోడికి కూడా వుండకూడదు. వీటన్నింటికీ మూలం స్వార్థమే''

అన్నది పద్మ.

''అవును... మనిషెప్పుడూ, నేను- నావాళ్ళు, నా సుఖం- నా సంతోషం, నా వాళ్ళు మాటపడకూడదు, నా వాళ్ళకి ఏదీ తక్కువ కాకూడదు, నా వాళ్ళకి అన్నీ ఇవ్వాలి. అన్నీ నేను- నేను- నాది- నాది. ఆ స్వార్థంఅనేది పుట్టుకతోనే వస్తుంది కాబోలు''

''అవును... నిజమే అవినీతి ఎక్కడ లేదు? రైలు టిక్కెట్లూ, సినిమా టిక్కెట్లూ బ్లాకులో అమ్మడం కొనడం కూడా అవినీతే''

''మందుల షాపుల్లో ఫ్రీశాంపుల్స్ అమ్మడం అవినీతికాదూ? మందుల్లో కల్తీ అవినీతి కాదూ? దానివల్ల ప్రాణాలు కూడా పోతున్నాయి

''ఎక్కడ చూసినా అవినీతే! ప్రతి వస్తువులనూ కల్తీనే! ఇంక లంచాలు బాహాటంగానే సాగుతున్నాయి! ఎందుకీ ప్రపంచం ఇట్లా అయిపోతోంది? దీనికంతటికీ స్వార్థమే కారణం!''

''అవును... స్వార్థమే. మనిషి స్వార్థాన్ని జయించాలి. జయించగలడా? ఏమో?''

రైలు హైదరాబాద్ చేరేదాకా వాళ్ళలా చర్చించుకుంటూనే వున్నారు.

★ ★ ★

ప్రొఫెసర్ మూర్తిగారు ఇంట్లో అందరూ సమావేశమయ్యారు.

ఆయన రివాల్వింగ్ ఛైర్లో కూర్చుని వున్నారు. చుట్టూరా రెండు దివాన్‌లూ, రెండు సోఫాసెట్లూ, మధ్య కార్పెట్, దానిమీద టీపాయ్ దానిమీద ఫ్లవర్‌వాజూ. మొత్తం కుషన్లూ, కవర్లూ అన్నీ మెరూన్‌కలర్లో మెరుస్తున్నాయి. కర్టెన్లు గూడా అదేరంగు. నాలుగు వైపులా డోమ్‌లతో లైట్లు వున్నాయి. ప్రియ- ప్రవీణ్- పద్మ- శ్రీరామ్‌లు ఆయన ఎదురుగా కూర్చున్నారు.

ఆయన మొహంలో ఆప్యాయత వెల్లివిరుస్తోంది.

నలుగురి పిల్లల ముఖాలూ వింత తేజస్సుతో ఇదివరకటి అమాయకత స్థానే ఇప్పుడు విజ్ఞానం- అనుభవం కనబడుతున్నాయి.

పెదవులు చిరునవ్వుతో విచ్చుకునే వున్నాయి.

అందరికీ చల్లని పానీయాలు అందాయి.

అందరూ అవి తాగుతూ ప్రొఫెసర్‌గారు ఏమి చెబుతారా అని ఎదురు చూస్తున్నారు.

''మైడియర్ ఎంగ్ ఫ్రెండ్స్... మీరు అనుకున్న సమయానికి మీమీ రీసెర్చి అంటే అన్వేషణ పూర్తిచేసి తిరిగి వచ్చారు... చాలా సంతోషం.

ఇంక మనం మన అనురాగనందనవనం ప్రారంభించవచ్చును. నేను కొన్ని ఫండ్స్ కలెక్ట్ చేసివుంచాను. స్థలం కూడా దొరికింది. దీని నిర్మాణం త్వరలో ప్రారంభించి ఉగాదినాటికి అంతా రెడీ చేద్దాం.




ముందుగా మీరందరూ రోజుకొకరు చెప్పిన మీమీ అనుభవాలు మా అందరికీ అందజే యాలి.

ఇవాళ ముందుగా ప్రియ లేచి తన అనుభ వాల్ని తెలియజేస్తుంది....''

అందరూ ప్రియ వైపు చూశారు.

ప్రియలేచి నుంచుంది.

''ఫరవాలేదు. కూచునే చెప్పు ... ఇట్లా వచ్చి కూచో'' అన్నారు ప్రొఫెసరుగారు.

ప్రియ నెమ్మదిగా నడిచి వచ్చి ప్రొఫెసర్ గారి పక్కన కూచుంది.

మెల్లిగా చెప్పడం ప్రారంభించింది ప్రియ. శ్రద్ధగా వినడానికి లైటు తీసేసి టేబుల్ లైట్ వేశారు ప్రొఫెసరుగారు.

''నేను- ప్రవీణ్ కలిసే బయలుదేరాం. 'నేను ఆంధ్ర- కన్నడ దేశాలు పరిశీలిస్తాను. నువ్వు తమిళ, మలయాళ దేశాలు పరిశీలించు' అని చెప్పాను. అతడు సరేనన్నాడు. నేను విజయవాడ, బెంగుళూరు వెళ్ళడానికి, అతడు మద్రాసు - త్రివేండ్రం వెళ్ళడానికి నిశ్చయించుకున్నాం.

''నేను దుఃఖాన్నీ సుఖాన్నీ స్టడీ చేస్తానన్నాను. అతడు సంబంధ- బాంధవ్యాలు పరీక్షచేస్తానన్నాడు.

''నేను బెజవాడలో దిగిపోయాను రైలు. మా అక్కయ్యగారింటికి వెళ్లాను. ప్రవీణ్ మెడ్రాసు వెళ్ళిపోయాడు.

మొదట్లో నేను రీసెర్చి వర్కు చెయ్యగలనా అని భయంవేసింది.

రెండు మూడురోజుల తరువాత ధైర్యం తెచ్చుకున్నాను.

ఇంట్లో అక్కయ్యకి వంటలో సహాయం. పిల్లల్ని చూసుకోవటం చేసేదాన్ని.

సుఖదుఃఖాలూ, సారో- హేపీనెస్ వీటిగురించే ఆలోచిస్తూ వుండేదాన్ని.

శ్రీజిడ్డు కృష్ణమూర్తిగారి పుస్తకాలు చదివేదాన్ని. అర్థంచేసుకోడానికి ప్రయత్నించేదాన్ని.

దుఃఖం అంటే ఏమిటి?

దుఃఖమూ- దుఃఖపడేవాడూ వేరా?

కాదు- దుఃఖం దుఃఖపడేవాడిలోనేవుంది.

కాబట్టి దుఃఖమూ, దుఃఖపడేవాడూ ఒకటే. ఇది అర్థం చేసుకుంటే బాధేలేదు. దుఃఖమే లేదు.

అంతలో ఆ వారంలోనే మా వీధిలోనే ఒక మరణం సంభవించింది.

ఆయనకి వయసు అరవై యేళ్ళుండవచ్చు. రిటైరయ్యాడు. భార్యా, పిల్లలు వున్నారు. అకస్మాత్తుగా మరణించాడాయన.

ఆక్రితంరోజువరకూ బాగానే వున్నాడు. పిల్లల బాధ్యతలింకా పూర్తిగా తీరనేలేదాయనకి.

అక్కయ్యతోబాటు నేనూ చూడటానికి వెళ్లాను. శవాన్ని బయటపడుకోబెట్టారు. ఆయన భార్య కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తోంది. పిల్లల సంగతి సరేసరి. మా అక్కయ్యని పట్టుకుని మరింత ఏడ్చింది ఆవిడ.

మరణం ఎవరికైనా తథ్యం అని తెలుసు. అయినా మనం ఆ దెబ్బకి తట్టుకోలేము. ఏడుస్తూనే వుంటాము.

ఆయన మంచితనం-

ఆయన గతంలో చేసిన పనులు- మాటలు అన్నీ ఏకరువుపెట్టి ఏడుస్తోందావిడ.

ఆవిడ ఏడుస్తుంటే హృదయం కదిలిపోతోంది.

ఇదేనా నిజమైన శోకం?

అవును ... ఇదే నిజమైన దుఃఖం.

ఆయన్ని తీసుకువెళ్ళేటప్పుడు ఆవిణ్నిపట్టడం ఎవ్వరి శక్యం కాలేదు.

ఆమెకి శోష వచ్చినట్లు సొమ్మసిల్లిపోయింది.

ఆతరువాత పదిరోజులూ ఆవిడకి రకరకాల అలంకరణలూ చేశారు.

పదోరోజు ఆవిణ్ని క్రూరంగా బాధించారు.

ఆవిడ బొట్టు తీసేశారు-

గాజులు పగలగొట్టారు-

నల్లపూసలూ, మంగళసూత్రాలూ, మట్టెలూ- తీసేశారు.

తెల్లచీర కట్టారు.

ఏమిటి మనసమాజం? ఏంచేస్తోంది?

చనిపోయిన ఆయన్ని తీసుకురాలేము.

ఆయన్ని చనిపోకుండా ఆపేపని కూడా మనం చెయ్యలేము.

ఆవిడ దుఃఖాన్ని తీసెయ్యలేము.

ఆవిడ లోటుని పూడ్చలేము.

కాని ఆవిడకి మనశ్శాంతి నివ్వాలి.

ఆవిడ దుఃఖాన్ని తగ్గించే ఉపాయం చూడాలి. మరి ఏం చేస్తోందీ సంఘం??

ఆవిడ అలంకారాలన్నీ ఒలిచేసి- ఆవిణ్ని వికారంగా తయారు చేసి-

ఆవిడ దుఃఖాన్ని మరింత ఎక్కువ చేస్తోంది.

తనరూపం చూసుకుని క్షణక్షణం ఆవిడ దుఃఖించాలి. చిత్రవధ ననుభవించాలి. ఆవిడ తన దుఃఖాన్ని ఈ జన్మలో మర్చిపోకూడదు. ఇదేనా వీళ్ల ఆలోచన?

అసలు ఎవరీ నిబంధనలు పెట్టింది?

బొట్టు భర్తతో వచ్చిందా? పుట్టుకతోనే వచ్చింది. గాజులూ అంతే. పువ్వులూ అంతే!

ఆయన పోయినంత మాత్రాన ఈవిడ అవన్నీ ఎందుకు ధరించగూడదు? అన్యాయం!

'కాలమే ఆమె దుఃఖాన్ని మాన్పుతుంది' అంటారు. కానీ మనవాళ్లు ఆమె దుఃఖాన్ని మాననివ్వరు.

ఆమె జీవితాంతం దుఃఖిస్తూనే వుండాలి.

నామనసు ఉడికిపోయింది.

'దీనికేదో చెయ్యాలి' అనుకున్నాను.

నేను రోజూ వెళ్లి ఆవిడదగ్గిర కూచుని నేను చదివిన పుస్తకాల్లోని వేదాంతసారాన్ని చెప్తు వుండేదాన్ని.

ఆవిడ ఏడుస్తూనే వుండేది.

నేను బొట్టు, పూలగురించి నా అభిప్రాయాలు ఆవిడకి చెప్తే ఆవిడ నిర్లిప్తంగా- "ఆయనే లేనప్పుడు నాకవన్నీ ఎందుకమ్మా?" అంది.

నేనెంత నచ్చచెప్పినా ఆవిడ ససేమిరా అనేసింది.

ఒప్పుకోలేదు. ఏంచెయ్యలేక నేనూ వూరుకున్నాను.



జీవితం పంచుకున్న పురుముడిపట్ల స్త్రీకున్న గౌరవాభిమానాలు ప్రత్యేకమయినవి, చెప్పుకోతగ్గవి.

అవి ఆయన మరణించినా పోవు.

ఆమె అన్నీ త్యాగం చేసెయ్యగలదు ఆయన కోసం. ఆయన ముందు ఆమెకి అన్నీ తృణప్రాయాలే.

భర్త మరణానంతరం ఆమె జీవచ్ఛవమే. ఏదీ అక్కరలేదు ఆమెకి.

శేషజీవితం ఆయన్ని స్మరించుకుంటూనే గడిపివేస్తుంది.

ప్రతిక్షణం దుఃఖమే ఆమెకి!

ఆ దుఃఖించడమే ఆమెకి సుఖం!!

ఇదే రాసుకున్నాను నాడైరీలో.

★ ★ ★

అక్కయ్య ఏదో పనిమీద గుంటూరు వెళ్తోంది. నేనూ వెళ్లాను అక్కయ్యతో.

అక్కడ దొరికింది నాకింకో ఉదాహరణ.

మేమున్న పక్కపోర్షనావిడ కాన్సరొచ్చి చనిపోయింది నాలుగురోజులక్రితం. భర్త ముఖం వేలాడేసుకుని వున్నాడు. పిల్లలు మరీ చిన్నవాళ్లు.

ఎవరన్నా పలకరిస్తే వెక్కివెక్కి ఏడుస్తున్నాడు. మాకు చాలా జాలేసింది.

ఆయన తల్లీతండ్రీ వచ్చారు.

ఆవిడ తల్లి వచ్చింది.

పిల్లల్ని పిల్లలతో ఆడుకోడానికి పంపిస్తున్నారు. పిల్లలకేమీ తెలీడంలేదు.

పదోరోజు వచ్చింది. సంస్కారం చేశారు. కానీ ఆ భర్తని ఎవరూ ముట్టుకోలేదు. ఆయనీ ఆయన డ్రస్సునీ మార్చలేదు. ఆయన మామూలుగానే వున్నాడు.

భార్యపోయి అప్పటికి పదిరోజులు. ఆ అబ్బాయి తల్లిదండ్రులతో ఇంకెవరో వచ్చి మాట్లాడుతున్నారు. ఆమాటలు నాచెవిన పడ్డాయి.

నేను ఆశ్చర్యంతో తలమునకలయ్యాను. ఆ అబ్బాయికి పిల్లనిస్తామని ఆఫరు. మళ్లీ పెళ్లి!

అది భార్య చచ్చిపోయిన పదోరోజు!

ఏమిటీ సమాజం? ఏమిటీ సంఘం? ఆ భర్త బాధపడకూడదు. దుఃఖించకూడదు !

తన దుఃఖాన్ని మర్చిపోవాలి! మరో పెళ్లిచేసుకొని ఆనందంగా వుండాలి. మంచిదే! మంచిదే! కానీ ఆడదానికోన్యాయం మగవాడికోన్యాయమా?

ఆడదానికి అదే పదోరోజున ఎంత క్రూరమైన శిక్ష వేస్తున్నారు? ఆ శిక్షని మాట్లాడకుండా స్వీకరిస్తోందే- ఆడది.

కానీ, మగవాడికి అదే పదోరోజున మళ్లీ పెళ్లికి ఆఫరు. కొత్త సుఖాలకి నాంది.

అంటే ఆభార్యనీ, ఆపెళ్లినీ, ఆ గతసంసార సుఖాన్నీ అన్నీ మ ర్చిపొమ్మనేగా?



జీవితం క్షణభంగురం!

అందులో మగవాడిజీవితంలో భార్య స్థానం క్షణభంగురమేనా? ఆమెకే విలువా? స్థానం లేవా? అదేఇంట్లోకి మరో ఇల్లాలు!

ఆ పిల్లలకి ఓ సవతి తల్లి!

అన్నీపన్లూ సవ్యంగా జరిగిపోతాయి!

ఆ భార్య ఫొటోకో దండమాత్రం వుంటుంది, నామమాత్రంగా.

ఆ మగవాడి జీవితంలోతన స్థానమేమిటో తెలుసుకోలేని ఆడది- అతన్నే నమ్ముకుని జీవిస్తుంది.

చిత్రంగా లేదూ?

నాలో ఏదో సంఘర్షణ... ఏదో ఆవేశం. **ఆరోజు** తరువాత రోజు కూడా నిద్రలేదు.

గుంటూర్నించి వచ్చాక అక్కయ్యతో నాభావాలు వ్యక్తంచేస్తే చిరునవ్వు నవ్వింది.

''అందరూ అట్లా వుండరు ప్రియా. భార్య పోయాక పెళ్లి చేసుకోకుండా వుండిపోయిన మగవాళ్లు కూడా వున్నారు. అట్లాగే భర్తపోయాక ఆభర్తని తలవని ఆడవారూ వున్నారు. ఉదాహరణలు కావాలంటే బోలెడు చూపిస్తాను.'' అంది. నేనాలోచిస్తూ వుండిపోయాను.

★ ★ ★

''ప్రియా ... ఇట్లారా'' పిల్చింది అక్కయ్య. అక్కడొకాయన కూర్చుని వున్నాడు. నలభై అయిదేళ్లు వుండవచ్చునేమో ఆయనకి. ఎంతో ప్రశాంతత ముఖంలో.

అప్రయత్నంగానే నమస్కారం చేశాను. మా అక్కయ్య నన్ను పరిచయం చేసింది.

''వీరు రమణయ్య గారని మనకి దూరపు చుట్టాలు''

ఆయన కొంచెంసేపు అవీ ఇవీ మాట్లాడాక భోజనంచేసి వెళ్లిపోయాడు. ఆ తరువాత చెప్పింది అక్కయ్య ''ఈయన భార్య చనిపోయి పదేళ్లయింది. పిల్లలు అప్పటికి చిన్నవాళ్లు. ఈయన మళ్లీ పెళ్లిచేసుకోలేదు. తనే పిల్లల్ని పెంచి పెద్ద చేశాడు. కష్టనష్టాలకి ఓర్చుకున్నాడు. పిల్లలకి తల్లీతండ్రీ తనే అయ్యాడు. మరోస్త్రీని కన్నెత్తిగూడా చూడలేదతడు. మొహంలో నువ్వు గమనించే వుంటావు ఆ ప్రశాంతత! సుఖదుఃఖాలంటే నిర్లిప్తత!

ఇప్పుడు ఇద్దరు పిల్లలకి పెళ్లిళ్లు చేస్తున్నాడు. పిల్లలకి ఒక దోవ చూపించడం తన ధర్మం. ఆ తరువాత ఏదో ఆశ్రమంలో చేరిపోతనంటున్నాడాయన. ఆయనకి భార్యమీద ఎంత గౌరవం, ప్రేమా లేకపోతే ఆయనట్లా వుండిపోగలడంటావు? ఆ భార్య చనిపోయినా అదృష్టవంతురాలంటాను నేను! ఆయన జీవితంలో ఆమెకు తప్ప స్థానం మరెవరికీ లేదు. కాబట్టి ప్రియా ... అంత తొందరగా ఆవేశాలకు లోనుగాకు. నీ రీసర్చి ప్రకారం లోకాన్ని పరిశీలించు తప్పులేదు'' అన్నది అక్కయ్య.

నేను తలవంచాను.

★ ★ ★

''ఎవరూ... రా రా ... ఊర్మిళా''

అక్కయ్య అన్నం ముందునించి లేచింది.

''భోజనం చేస్తున్నారా? కానీండి ... నేను కూచుంటాను'' అంది ఊర్మిళ.

''లేదు ... అక్కడ కాదు నువ్వు కూచోవాల్సింది. రా... ఈ పీటమీద కూచో. నువ్వూ భోజనం చెయ్యాలి మాతో. ఇది మా చెల్లెలు ప్రియ.''

అక్కయ్య మరో కంచంపెట్టింది.

ఊర్మిళ మాట్లాడకుండా వచ్చి కూర్చుంది.

''ఏమిటి విశేషం?''

''కొబ్బరి పచ్చడి చాలా బావుందండీ... వంకాయకూర ఎక్సెలెంట్''

''నీ పొగడ్తలు చాలుగానీ– ఏమిటీ పట్టు చీర, నగలు?''

''మా అబ్బాయి పుట్టినరోజండీ, రేపు! పేరంటానికి రావాలి మీరు''

''అన్నీ నువ్వే చేస్తున్నావా? వంటమనిషిని పెట్టావా?''

''లేదండీ ... నాకునేనే అన్నీ చేస్తేగాని తృప్తి లేదు. పిలుపులు ఇవాళ పెట్టుకుని, రేపటికి మిగిలినవి... వాడికిది మొదటి పుట్టిన రోజుకదా!''

మాటలేగాని అన్నం తినడం లేదు ఊర్మిళ. ఎందుకో కళ్లనీళ్లు కారిపోతున్నాయి.

''అదేమిటి ఊర్మిళా... తప్పు కదూ?''

''అక్కయ్యగారూ-- మీరు చెప్పండి. నేను




చేసింది తప్పేమో? నా మనసులో ఏదో శంక, ఏదో బాధ!''

''అదేమిటమ్మా? నువ్వు చేసింది తప్పు ఎంతమాత్రం కాదు. పోయిన ఆయనతో నువ్వూ పోలేవు. ఉన్నంతలో సుఖపడటం తప్పేమీ కాదు. ఆయన చెప్పాడన్నావుకదా చివరి మాటగా? ఆయన ఆత్మ సంతోషిస్తుందే తప్ప దుఃఖించదు. అందులోనూ నువ్వు తల్లిలేని నెలలగుడ్డుకి తల్లి వయ్యావు. గతాన్ని మర్చిపోవాలి. నీది మరోజన్మ ఇది!''

కన్నీరు తుడిచింది అక్కయ్య.

''మీతో మాట్లాడితే నా మనసుకి ఏదో శాంతి కలుగుతుంది అక్కయ్య గారూ. లేకపోతే లేకపోతే ఈలోకం వేసే నిందలకు, అవహాస్యాలకూ నేను తట్టుకోలేను. మొగుడు చచ్చిన ముండకి ఇవన్నీ ఏమిటని ప్రతిక్షణమూ అవహేళనే నాకు!''

కన్నీళ్లు ఎంత తుడిచినా ఇంకా ఇంకా కారుతూనే వున్నాయి.

అక్కయ్య ఆమెని భుజంతట్టి ఓదార్చింది.

నేను చూస్తూ వుండిపోయాను.

ఎంతోసేపటికిగాని అన్నం దగ్గర్నించి లేవ లేదు మేము!

ఆ తరువాతరోజు సాయంత్రం బావతోబాటు ఒకమ్మాయి వచ్చింది.

చాలా నవనాగరీకంగా అలంకరించుకుంది. నైల్ పాలిష్‌నించీ లిప్‌స్టిక్ వరకూ అన్నీ మాచింగ్‌లే.

ఆవిడ మాటలు ఏదో కృత్రిమంగా వున్నాయి.

బావతోనే ఎక్కువ మాటలూ, కబుర్లూను! అక్కయ్య ఇబ్బందిగా ఫీలవుతున్నట్లు తోచింది నాకు.

అక్కయ్య చెప్పింది ఆమె వెళ్లాక ఆమె భర్తపాపం ఈమధ్యనే పోయాడని.

నాకు జాలేసింది.

కాని అక్కయ్య చెప్పిన ఇతర విషయాలు విని నేను అవాక్కై పోయాను.

ఆమె మా బావగారి ఆఫీసరుతో సంబంధంపెంచుకుందిట—

రేపో మాపో పెళ్లాడబోతోందిట ఆయన్ని! ఆయన భార్య, పిల్లలు వున్నవాడు.

మరి ఆ భార్యకి ఈ భర్తవుండీ దూరమవుతాడా? ఇది ఇంకొక ఉదాహరణ నాకు.

★ ★ ★

అక్కయ్యతో చెప్పాను నేను బెంగుళూరు, మైసూరు వెళ్తానని.

''నువ్వొక్కదానివే ఎట్లావుంటావే. నీ రీసర్చి అంటే నాకూ కుతూహలంగా వుంది. నేనూ వస్తాను ... పద. ఏమండీ—?''

పర్మిషనడిగింది బావని.

''నేనేమంటాను? వెళ్లు. నువ్వు పురిటికెళ్లినప్పుడు వుండలా నెలల తరబడి. ఏం చేస్తాను'' అన్నాడు బావ హాస్యంగా.

''నేనేం నెలల తరబడి వుండను లెండి— పదిహేనురోజులు. ఏమే?'' ''అవును'' అన్నాను నేను.

''సరే ... ఎగ్రీడ్. వెళ్లండి. టిక్కెట్లు కొనాలా?''

''కొనద్దూ మరి?''

బావ టిక్కెట్లు కొని తెచ్చాడు.

ఆరోజే మా ప్రయాణం.

కాఫీలు తాగుతున్నాం పొద్దున.

బయట ఎవరివో మాటలు వినబడ్డాయి.

''ఎవరే?'' అడిగాను అక్కయ్యని.

బావ కొలీగ్ కృష్ణారావులే!

అతడు తన బాధలన్నీ పొద్దునేవెళ్లబోసుకుంటున్నాడు బాధతో.

''ఆ ముసలిప్రాణం పోతేనన్నా బాగుండునండీ! మమ్మల్ని ఒకటే పీక్కుతింటోంది. డబ్బుకు డబ్బూ వందలూ, వేలూ అయిపోతున్నాయి. రోగమూ తగ్గడంలేదు. ఆ మంచంలో అట్లా వుండటంవల్ల మమ్మల్నీ సుఖపడనివ్వదు. తనూ సుఖంగా ఎటూ వుండలేదు. ఎప్పుడెప్పుడు దేవుడు ఆవిణ్ణి తీసుకుపోతాడా అని ప్రార్థిస్తున్నాను''

నేను ఉలిక్కిపడ్డాను.

అతడట్లా అనేది తల్లిగురించి.

నవమాసాలూ మోసి అష్టకష్టాలూ పడి కని పెంచి పెద్దచేసిన తల్లికి ఇదీ అతడిచ్చే

ప్రతిఫలం!

నిజానికి కన్నతల్లిఋణం ఏమిస్తే తీరుతుంది? అసలు తీరేదా ఆ ఋణం?

అందుకే అన్నారు లక్కాంటి తల్లి-రాయంటి బిడ్డ అని.

తల్లి చావాలని తనయుని కోరిక!

ఈ ప్రపంచం ఇంకేం బాగుపడుతుంది. ఆలోచిస్తూ వుండిపోయాను.

★ ★ ★

రైల్లో మేము ఎక్కిన కంపార్టుమెంటులో ఒక జబ్బుమనిషి వుంది.

ఆమె కూతుళ్ళిద్దరు కాబోలు ఆమెకి అటూ ఇటూ కూర్చుని వున్నారు. వాళ్ళ కళ్ళల్లో విషాదం, విచారం. ఆ తల్లి ఓపికంతా ఉడిగిపోయి చాలా నీరసించివుంది.

అక్కయ్య అడిగింది "జబ్బేమిటి"అని.

"ఇది ఇవ్వాల్టిది కాదమ్మా... చావాలన్నా చావనీయడంలేదు నా పిల్లలు"

"ఆవిడకి కీళ్లవాతం వయసుతోబాటే మరీ ముదిరిందితప్ప తగ్గలేదు. రోజు రోజుకీ క్షీణించిపోతోంది. ఏమందులూ పనిచెయ్యడంలేదు. ఇంక బెంగుళూరులో ప్రకృతివైద్యం చేయించాలని తీసుకువెళ్తున్నాము" అని చెప్పింది ఆవిడ కూతురు.

ఆ పిల్లల కళ్ళల్లో తల్లిని ఎట్లాగన్నా కాపాడుకోవాలన్న ఆత్రుత.

"మీ అమ్మకి తప్పకుండా తగ్గుతుందమ్మా" అంది అక్కయ్య.

ఆ మాటకే వాళ్ళెంతో సంతోషించారు.

"ఆవిడ కోలుకోవాలనే మేమూ మనసారా కోరుకున్నాం"

ఆ ప్రయాణం మొత్తంలో మాకు వాళ్ళే మనసంతా నిండిపోయారు.

వాళ్ళకి కావల్సిన సహాయమంతా చేశాం. బెంగుళూరు వివరాలన్నీ చెప్పాం. వాళ్ళ ఎడ్రసు తీసుకున్నాం. వచ్చి అప్పుడప్పుడూ చూసిపోతూవుంటామని చెప్పాం.

బెంగుళూరులో మేము మాకు తెలిసినవాళ్లింట్లో ఒక రూము తీసుకుని తాత్కాలికంగా వున్నాం.

నేను ఉద్యోగమేమైనా చూసుకుంటానం అక్కయ్య అంది "మనకి, డబ్బుకేమీ లోటు దుకదా. నువ్వు ఉద్యోగం చెయ్యనక్కర్లేదు. మూడు నెలలూ నీకు కాలక్షేపంకావాలం కొంతమంది పిల్లల్ని పరీక్షలకి కోచ్‌చెయి ట్యూషన్లు చెప్పు. డబ్బుకోసం కాదనుకో క మనం డబ్బు తీసుకోమంటే ఎవరూ మనదగ్గ కి రారు"

అక్కయ్య చెప్పింది సమంజసంగా వుంది. నలుగురైదుగురు పిల్లల్ని చేరదీ ట్యూషను చెబుదామనుకుంటూ వుండగ మా పక్కింట్లో ఒకావిడ కొంతమందికి ట్యూ ను చెప్తోందని తెలిసింది. నేను అక్కడికి వె నేనూ ఆవిడకి సహాయంచేస్తానన్నాను. ఆవి ఒప్పుకుంది. ఆవిడ సైన్సు, లెక్కలు చెప్తోం నేను హిస్టరీ, జాగ్రఫీ, లెక్కలు చెప్తానన్నా

క్రమంగా ఆవిడకి వచ్చేపిల్లలసంఖ్య ఎక్ వయింది. ఇద్దరం సమర్ధవంతంగానే నడు తున్నాం టీచింగ్ క్లాసులు.

ఆవిడ అంతకుముందు టీచరుగా పని సిందిట! నాకూ బానే వుందది.

డబ్బు ఆవిడే కలెక్ట్‌చేసి ఇచ్చేది. నే కాదనేదాన్ని కాదు.

అట్లాగే నా రీసర్చి వర్కు కొనసాగిస్తు వున్నాను. నాకూ ఇది ఆనందంగానే వుం

వచ్చే పిల్లలందర్లోకీ నీల నన్ను బ ఆకర్షించింది. పెద్దపెద్ద కళ్ళతో చా అందంగా వుండేది. ఏడోతరగతి చదువు న్నా వయసుకి చిన్నదిగానే వుండేది.

ఎప్పుడూ నాదగ్గరే వుంటూ అన్నిటికీ స ధానాలు ఇస్తూ, ప్రశ్నలు అడుగుతూ నా ట షన్ క్లాసులని చైతన్యవంతం చేస్తూండేది

ఒకరోజు ఆ పిల్ల క్లాసులో యాక్టివ్‌గా లే సంగతి గమనించాను.

అడిగాను ఎందుకట్లా వున్నావని. త ప్పిగా వుందంది. ఒళ్ళుపట్టుకుని చూశా వేడిగా వుంది.

వెంటనే ఇంటికి పంపించేశాను ఇ అమ్మాయినిచ్చి.

ఆ తరువాతిరోజూ ఆపిల్ల రాలేదు.

వాళ్ల పక్కింటి అమ్మాయి చెప్పి

నీలని హాస్పిటల్‌లో జాయిన్‌చేశారని.

నేను ఉలిక్కిపడ్డాను. నా మనసేదో కీడుని శంకించింది. నేను ఆదుర్దాగా వెంటనే హాస్పిటల్‌కి అక్కయ్యతో వెళ్ళాను. ఆ అమ్మాయి స్పృహలేకుండా పడివుంది.

ఆమెతల్లి పక్కనే వుంది. ఆ తల్లి పరిస్థితి వర్ణనాతీతం! ఆ కళ్ళల్లో భయం, దిగులు, విచారం, విషాదం, నిర్వేదం! మమ్మల్ని చూసి ఏడ్చేసింది!

మేము ధైర్యం చెప్పాం. కానీ ఏమాత్రం ధైర్యంవుండని పరిస్థితే ఆమెది.

"నా కూతురు బతుకుతుందంటారా?"

బేలగా అడుగుతోంది.

ఏ డాక్టరు వచ్చినా చేతులు పట్టేసుకుని ఏడుస్తూ ఇదే ప్రశ్న అడుగుతోంది.

వాళ్లునామమాత్రంగా ఫరవాలేదంటున్నారు.

"మీ కాళ్ళు పట్టుకుంటాను. నా చర్మంతో చెప్పులు కుట్టిస్తాను. చచ్చి మీ కడుపున పుడతాను. ఎంత డబ్బైనా ఇస్తాను. నా తల్లిని బతికించండి. దాన్ని నాకు దూరం చేయకండి... ప్లీజ్"

ఇంగ్లీషులో, కన్నడంలో ఎంతో దీనంగా అడుగుతోంది.

ఆమె చాలా చదువుకున్న స్త్రీ.

ధనవంతురాలు.

భర్త ఫారిన్‌లో వున్నాడు.

అసహాయస్థితిలో వుంది.

మాకు నిజంగా కడుపు తరుక్కుపోయింది. గుండె చెరువయింది.

కానీ, నీల పరిస్థితి ఆశాజనకంగా లేదు. ఆమెకి బ్రెన్ హేమరేజ్ వచ్చింది.

"ఏదన్నా మిరకిల్ జరిగి దేవుడు కాపాడాలి తప్ప మేమేం చెయ్యలేము" అన్నారు డాక్టర్లు.

ఆ ఊళ్ళో ఎన్ని గుళ్ళు ఉన్నాయో అన్ని గుళ్ళకీ వెళ్ళొచ్చింది ఆ తల్లి.

ఎన్ని మొక్కులూ, ముడుపులూ మొక్కుకోవచ్చో, కట్టవచ్చో అన్నీ కట్టింది.

దేవుణ్ణి అహర్నిశలూ ప్రార్థిస్తూనే వుంది. కానీ... కానీ...

చెప్తూవున్న ప్రియ ఆపుకోలేక ఏడ్చేసింది.

ఎంతోసేపటికిగాని మళ్ళీ కొనసాగించలేపోయింది.

అంతా నిశ్శబ్దం...

వింటున్నవాళ్ళు ఏం జరిగివుంటుందో ఊహించుకున్నారు.

"నీల మరణించింది!!

ఆ తల్లికి పిచ్చెక్కింది! మైండ్ ఎఫెక్ట్ అయింది.

ఆమె మాటలు ధోరణి చూస్తుంటే అందరికీ భయమేసింది.

ఆపిల్లతండ్రి ఆ తరువాత వచ్చాడు అంతా జరిగిపోయాక.

నాకర్థమయింది ఒకటే.

కడుపు శోకాన్ని మించిన దుఃఖం ఈ ప్రపంచంలో మరొకటిలేదు! అంతే!!

నిజమయిన దుఃఖం అదే!

కడుపుశోకం దేనివల్లా తీరదు.

కాలం మాన్పలేదు ఆ గాయాన్ని.

"పుత్రశోకం పునఃపునః"

ఆ తరువాత ఇంకా పిల్లలు పుట్టినా, ముందు ఇంకా పిల్లలు వున్నా పోయిన బిడ్డ కోసం ఆ తల్లి పడేబాధ వర్ణించలేనిది.

అది మనం మాటల్లో చెప్పలేం.

ఆ బాధగలవాళ్ళకి మనం ఏవిధంగానూ ఉపశమనం కలిగించలేం.

ఆ తరువాతగూడా నేను ఇద్దరుముగ్గురు పిల్లల్ని కోల్పోయిన తల్లుల్ని చూశాను.

చూసినకొద్దీ నాకు అర్థమయింది.

వారి శోకం, దుఃఖం అనిర్వచనీయం.

నా మనసులో ఆ విషాద సంఘటన చిరస్థాయిగా నిలిచిపోయింది. నిలిచిపోతుంది ఎప్పటికీగూడా" కళ్ళు తుడుచుకుంది ప్రియ.

ఆ బాధనించీ కోలుకోవడానికి నాకూ కొంత టైముపట్టింది.

అక్కయ్య, నేను, చుట్టుపక్కల కొంతమంది కలిసి టూరిస్ట్ బస్సులో మైసూరు వెళ్ళాం, ఒక ఆదివారం.

మైసూరు చాలా బావుంటుంది.

మొదట శ్రీరంగపట్నం చూశాక అక్కణ్నించీ మైసూరు చేరాము. అక్కడ ముందు లలితమహల్‌కి తీసుకెళ్లారు. దాన్ని ఇప్పుడు ఫైవ్‌స్టార్ హోటల్ చేశారు.

ఆ తరువాత చాముండీ హిల్‌కి వెళ్ళాం. ఆ గుడి ఎంతో బావుంది. అమ్మవారి దర్శనం చేసుకున్నాం.

అక్కణ్నించి తిరిగివస్తూ పెద్దనందిని చూశాం. ఆతరువాత జగన్మోహినీ పాలెస్‌లో ఆర్ట్‌గాలరీ- రవివర్మ పెయింటింగ్స్ అద్భుతంగా వున్నాయి. అన్నీ చూశాం.

సాయంత్రం బృందావన్ గార్డెన్స్‌కి వెళ్ళింది బస్సు. అక్కడ రెండుగంటలు టైమిచ్చారు.

బృందావన్ గార్డెన్స్‌లో నా మనసు తిరిగి యథాస్థితికి వచ్చింది. చాలా ఆహ్లాదకరంగా వుంది. ఆ జలపాతాలు, ఫౌంటెన్లు, ఆ కావేరి నది, ఆ చెట్లు, ఆ పచ్చిక, చీకటిపడ్డాక లైట్లతో మెరిసే ఆ నీటితీరు, ఎక్కడ నిల్చున్నా పడే నీటితుంపరలు- ఎంతో పరవశించింది నా మనసు. రంగులైట్లలో ఇంకా బావుంది బృందావనం.

అక్కడ కూర్చుని కావ్యాలే రాసెయ్యొచ్చునని పించింది.

తిరిగి వచ్చాక నిశ్చింతగా నిద్రపోయాను.

## 7



కొన్ని సుఖదుఃఖాలు మనం ఊహించుకునేవేమోననిపిస్తుంది నాకు.

ఉదాహరణకి బాగా ధనవంతులు వున్నారు. వాళ్ళకి కష్టాలేం వుంటాయి కల్పించుకునేవి తప్ప!

కల్పన ధనవంతుల అమ్మాయి.

మా పక్కింటికి వస్తూపోతూ అలా పరిచయమైంది నాకు.

వాళ్లనాన్న పెద్ద బిజినెస్‌మాన్.

ఆ అమ్మాయికి రోజూ కొత్తబట్టలే, పంచభక్ష పరమాన్నాలే.

కాలు కిందపెట్టక్కర్లేని ఐశ్వర్యం, నగలు. కాలివేలినించి తలదాకా ఆభరణాలు.

తలచుకున్న సినిమా కళ్ళముందు వుంటుంది. మంచి సంగీతం వినాలంటే తక్షణం వినచ్చు. కదిల్తే కందిపోతుందేమోనని అడుగులకి మడుగులొత్తే నౌకర్లూ చాకర్లూ.

బాధ, దుఃఖం అనేవి వినికూడా వుండదేమో?

ఇల్లు ఒక రాజసౌధమే.

హంసతూలికా తల్పాలు.

కార్పెట్లు, టి.వి.లు, టేప్‌రికార్డర్లు అదీ ఇదీ అనిలేదు అన్నీ వున్నాయి.

తల్లిదండ్రులకి ఆమె అపురూపం.

అలాంటిది ఆ అమ్మాయి నేను కలుసుకున్నప్పుడు అంది,

"సుఖంలేదని"

నేను ఫక్కున నవ్వాను.

ఏమిటి సుఖం అంటే?

మానవుడి సుఖాన్ని వున్నదాంట్లో చూసుకోడు.

లేనిదాంట్లో వెతుకుతాడు! అందని దాని కోసం పరుగులుపెడతాడు.

"నాకు స్వేచ్ఛలేదు- అదే నాకు దుఃఖకారణం!" అంటుందా అమ్మాయి.

అసలు స్వేచ్ఛ అంటే ఏమిటి?

ఆ స్వేచ్ఛఇస్తే సుఖంవస్తుందా?

అసలు సుఖమనేది ఎక్కడాలేదు. మన మనస్సులోనేవుంది అంటాను నేను.

ఆ తరువాత ఆ అమ్మాయికి నిజంగానే స్వేచ్ఛ లభించింది.

కాని అది ఆమే నిలుపుకోలేకపోయింది. అర్థంచేసుకోలేకపోయింది.

ఒక కుర్రవాణ్ని ప్రేమించింది. అతడే తన భర్త కావాలంది. అతనూ బుద్ధిమంతుడే కానీ,

తల్లిదండ్రులు దానికి ఒప్పుకోలేదు.

కారణం అతను ఏమీ లేనివాడు.

మళ్ళీ ఆమెకి అశాంతి, దుఃఖం.

ఆ తరువాత తల్లిదండ్రులు ఆమె బాధ చూడలేక అతడికిచ్చి పెళ్ళిచేస్తారు సరే, ఆమె సుఖపడుతుందా?

ఐశ్వర్యంలో పుట్టిపెరిగిన పిల్ల లేమిలో వుండగలదా? కలిమినించి లేమికి రావడం కష్టమే! అదే నేనామెతో అంటే-

నాతో ఏకీభవించలేదు ఆమె.

రాయబారాలుమాత్రం జరుగుతున్నాయి!

ఆ అబ్బాయి "నీ ఐశ్వర్యం ఏదీ నీతో తీసుకురావడానికి వీల్లేదు" అన్నాడుట.

పోనీ లేనివాళ్ళు సుఖపడుతున్నారా?

మా ఇంట్లో పనిమనిషి ఎల్లమ్మతో,

"నేను మీ ఇంటికొస్తానే" అన్నానోరోజు.

అది ఆశ్చర్యంగా చూసినా సంతోషంగా ఒప్పుకుంది.

ఆరోజు ఎల్లమ్మ ఇంటికి వెళ్ళేసరికి నేను వస్తానని తెలిసి ఇల్లూ, వాకిలీ శుభ్రంగా వుంచింది. ఉన్నంతలో తనూ శుభ్రమైన బట్టలు కట్టుకుంది. పిల్లలకీ కాస్త ఉతికిన బట్టలేసింది.

చూడటానికి అంతా బాగానే వుంది.

తినడానికి పళ్ళుపెట్టింది. టీకాచి ఇచ్చింది.

వాళ్ళు సుఖంగానే వున్నారనిపించింది. ఎల్లమ్మ మొగుడు అప్పటికి ఇంటికి ఇంకా రాలేదు.

కాసేపు కూచుని వచ్చేశాను.

మళ్ళీ రెండు రోజులయ్యాక వెళ్లాను.

ఇల్లు బాగానే వుంది.

కానీ పిల్లలు పోట్లాడుకుంటున్నారు. తల్లి తిడుతోంది. ఆ తిట్లు వినలేం.

కాసేపుండి వచ్చేశాను.

నాకు ఎన్నో జాగ్రత్తలు చెప్పి అక్కయ్య వెళ్ళిపోయింది- మరో రెండు రోజుల్లో.

మరోరోజు నేను మళ్ళీ ఎల్లమ్మ ఇంటికి వెళ్ళేసరికి ఆమె మొగుడు ఆమెని చితక బాదుతున్నాడు.

ఆమె తిడుతూ ఏడుస్తోంది.

"తే.... డబ్బు.... తే...." అంటూ తిట్టరాని తిట్లు తిడుతున్నాడతను. పిల్లలు ఇదంతా అలవాటయినట్లు చూస్తూ ఒక మూకుట్లో ఏదో పోసుకుని ఆబగా తింటున్నారు. కొట్టి కొట్టి విసుగుపుట్టి 'యాక్' అని ఉమ్మేసి బయటికి పోయాడు ఆమె మొగుడు తూలుకుంటూ.

ఆమె నన్ను చూడలేదు. ఏడ్చి ఏడ్చి తిట్టి తిట్టి కాసేప్పటికి లేచింది.

"అమ్మగారూ మీరా?" అంటూనే నన్ను చూసింది. "చూడండి వాడు చేసిన పని" అంటూ భోరున ఏడ్చింది.

నేను అనునయించి సంగతి అడిగాను.

"ఏం సెప్పమంటారూ.... నేనేదో డబ్బులు దాపెట్టుకున్నానని ఆడి అనుమానం. ఉన్నదంతా తాగేసి తగలేస్తాడు. ఇంతకీ అన్ని కట్టాలకీ మూలం మా దరిద్దరం...."

దరిద్రం కష్టాలకి మూలమా?

ధనంవుంటే కష్టాలు తీరతాయా?

"చూడు ఎల్లమ్మా.... డబ్బులుంటే మీ కష్టాలు తీరతాయంటావా?"

"అదేవుంటే ఇంకేం కావాలమ్మా?"

"ఒక నెలపాటు మీకు డబ్బుకు లోటులేకుండా నేను చూస్తాను. మీరు సుఖంగా వుండండి. ఇంతకీ నెలరోజులకి మీకు ఎంత డబ్బు కావల్సొంటుంది?"

"రేపు సెప్తానండమ్మా" అంది నమ్మలేనట్లుగా.

ఆ తరువాతరోజు చెప్పింది వెయ్యి రూపాయలవుతుందని.

"ఒకసారే కావాలా? తడవ తడవగా ఇవ్వనా?"

"మీ యిట్టం. అయినా మీకెందుకండమ్మా ఇదంతా?"

"ఏమీ లేదులే. ఒక్కసారే ఇస్తాను.... సుఖపడండి" అంటూ వెయ్యి రూపాయలు లెక్కపెట్టి ఇచ్చాను.

అది తీసుకుని నా కాళ్ళకి నమస్కారంపెట్టి వెళ్ళిపోయింది.

నెలరోజులు కాదు... పది రోజులు గడిచాయోలేదో-






ఎల్లమ్మ ఏడుస్తూ వచ్చేసింది. చేతిలో డబ్బు కొంత నాముందు పెట్టి ఒకటే ఏడవసాగింది.

ఏమిటని అడిగాను.

బతిమాలాను.

ఎంతోసేపటికి నోరు విప్పింది.

"ఈ డబ్బువల్ల సుకం నేదమ్మా... నా మొగుడి తాగుడు మరీ ఎక్కువయింది. కుర్ర కుంకలు రోజుకో సినిమాకి పోతున్నారు. హొటల్లో నానాగడ్డీ తింటున్నారు. దానివల్ల మా సిన్నోడికి ఓటే వాంతులూ, బేదులూ పట్టుకు

న్నాయి. నా మొగుడేమో దొరికిందల్లా తాగుతూండటంతో ఓరోజు కల్తీ సారాయని నూసుకోనేదుట. తాగీసినాడు. ఆసుపత్రిలో సేరిపించాల్చొచ్చింది. నాకొద్దమ్మా నీ డబ్బు... నామొగుడూ, నా బిడ్డా నాకు దక్కితే సాలమ్మో! వచ్చే పానం, పొయ్యేపానంలాగా వున్నారమ్మో" పెద్దగా ఏడవసాగింది.

"ఏడవకు. పద... నేనూ వస్తాను. ఈ డబ్బుతో వైద్యం చేయించకపోయావా?"

"నాకొద్దమ్మో.... పాపిట్టి డబ్బు నేను తాకను" అందామె.

నేనూ ఆ డబ్బు తీసుకుని దానివెంట బయల్దేరాను.

నిజంగానే ఆమె భర్తా, బిడ్డా క్రిటికల్ కండిషన్లోనే వున్నారు.

ఇద్దరికీ డ్రిప్ పెట్టారు. సెలైన్‌వాటర్ ఎక్కిస్తున్నారు.

నేను వెళ్ళి పెద్ద డాక్టరుతో మాట్లాడాను.

ఆయన ఇద్దరికీ ఆ రాత్రి గడవాలన్నాడు.

డబ్బుకి వెనకాడ వద్దన్నాను. నేనక్కడే వుండిపోయాను.

తెల్లవారింది.

నాకు అమితభయంగావుంది.

వాళ్ళు... వాళ్ళు బతుకుతారా, లేకపోతే వాళ్ళ చావుకి నేను కారణమవుతానా?

మంచిపనికి పూనుకుని నేను చేస్తున్నదేమిటి?

పరి పరి విధాలపోయాయి నా ఆలోచనలు. భగవంతుణ్ని ప్రార్థిస్తూ కూచున్నాను.

పిల్లవాడు కళ్ళు తెరిచాడు.

నాకు ప్రాణం లేచొచ్చింది.

ఎల్లమ్మ ఏడుస్తూ కొడుకునొకటే ముద్దుపెట్టేసుకుంది.

ఆ తరువాత మొగుడి దగ్గిరికెళ్ళింది.

"అమ్మగారో...." పెద్దగా అరిచింది.

నేను భయపడ్డాను. వణుకుపుట్టింది.

చెమటలుపట్టాయి.

ఒక్క ఉదుటున లేచాను. మంచం దగ్గిరికి వెళ్లాను.

ఆమె మొగుడు ఏదేదో కలవరిస్తున్నాడు.

కన్ను అరమూతగావుంది.

నాకు గుండె కొట్టుకుంది.

డాక్టర్ని పిల్చుకొచ్చాను. ఆయన చూసి "ఫరవాలేదమ్మా.... గండం గడిచింది. స్పృహ వస్తోంది" అన్నాడు.

నేను తేలిగ్గా నిట్టూర్పు విడిచాను.

బాధ, దుఃఖం అనేవి మనం సృష్టించుకునేవే.

ఆ వెయ్యి రూపాయల్తో ఎన్నో మంచి పనులు చేసుండవచ్చు వాళ్ళు.

వాళ్ల ఆర్థికస్థితి ఈ మాత్రానికే మెరుగుపడదుగానీ కుటుంబం కనీసం కడుపునిండా అన్నం తిని సంతోషంగా కలిసివుండవచ్చు ఓ నెలరోజులపాటు. కానీ ఏదీ లేకుండా ప్రాణం మీదికి తెచ్చుకున్నారు.

★ ★ ★

రైల్లో కలుసుకున్న తల్లి, పిల్లలని కలవడానికి వెళ్ళాను ఒకరోజు.

ఆ తల్లి బాగా కోలుకుంది ఆశ్చర్యకరంగా.

పిల్లలు చాలా సంతోషంగా వున్నారు.

ఆమె నన్ను చూసి ఎంతో సంతోషించింది.

"మీ అక్కయ్యేది?" అనడిగింది.

నేను అంతా చెప్తూ- అక్కయ్య వెళ్ళిపోయిందని చెప్పాను.

వాళ్ళు చాలా ఆశ్చర్యపోయారు- నా రీసెర్చి విషయం విని.

ఆవిడ ఎంతో పొగిడింది నన్ను- 'ఇంత చిన్నప్పుడే ఎంతటి పనికి పూనుకున్నావు?' అంది.

కాసేపుండి నేను వచ్చేశాను.

నేను బయలుదేరబోతూండగా తెలిసింది కల్పన పెళ్ళి అని.

ఆ అబ్బాయినే చేసుకుంటోంది.

"ఇప్పుడు అన్నిటికీ సిద్ధపడ్డాను" అంది.

నేనెంతో సంతోషపడిపోతూ ఒక హితబోధ మాత్రం చేశానామెకి.

"సుఖం అంటే ఏమిటి? దేనివల్ల వస్తుంది? దుఃఖమంటే ఏమిటి? దేనివల్ల వస్తుంది? అని ఆలోచించుకోవాలి ఎవరికి వారే. దూరపుకొండ




లెప్పుడూ నునుపే.

తృప్తి అనేది ఉంటే సుఖ దుఃఖాలని ఒకేరకంగా ఎదుర్కోగలం''

ఆశ్చర్యంగా చూసింది ఆమె నావంక.

అప్పుడు చెప్పాను కల్పనకి నేను వచ్చిన పని ఏమిటో?

ఆమె ఆశ్చర్యపోయింది మొదట. తరువాత నన్ను అభినందించింది.

నేనూ మీ సమాజంలో కలుస్తాను తప్పకుండా అంది.

నేను సంతోషించాను.

''మరణంవల్ల కలిగే భార్యాభర్తల, తల్లీ పిల్లల దుఃఖం స్టడీచేశాను. కలిమిలేముల్లోని, సుఖదుఃఖాలు స్టడీచేశాను నేను'' అని ముగించింది ప్రియ.

ఆమె చెప్పిన మాటలు, కథనం, అందరూ శ్రద్ధగా విన్నారు.

ప్రవీణ్ తన అనుభవాలు వివరించసాగాడు.

''నేను చేసిన స్టడీని మీకు చెప్తాను. ప్రియ వెళ్లిన తర్వాత నేను మద్రాసు వెళ్లాను. అక్కడ నా స్నేహితులు నలుగురు కలిసి ఒక రూము తీసుకొని ఉంటున్నారు. వాళ్లల్లో నేనూ జాయిన్ అయ్యాను. నేను కొంత కాలం వాళ్లతోనే కలిసివుంటానని చెప్పాను. వాళ్లు చాలా సంతోషించారు. మేము చిన్నప్పట్నించీ కలిసివుండి కలిసి పెరిగిన వాళ్లమవడం వల్ల నాకే ఇబ్బందీ లేకపోయింది.

నేను భోజనానికీ, ఉండటానికి పే చేస్తానన్నాను. వాళ్లు ససేమిరా వీల్లేదన్నారు. నువ్వు ఎన్నాళ్లున్నా మా 'గెస్ట్‌వే'' అన్నారు. వాళ్లనలుగురికీ ఒక మనిషివచ్చి, వంటచేసి పెట్టివెళ్తుంది. ఇల్లు ఊడ్చటం, గుడ్డలు వుతకడం అన్నీ ఆమె చేస్తుంది. మొత్తం ఖర్చు నలుగురూ పంచుకుంటారు. నలుగురిలో ఇద్దరు ఉద్యోగాలు చేస్తున్నారు. మరో ఇద్దరు చదువుకుంటున్నారు. నేను నాపాకెట్ మనీకోసమని ఎక్కడన్నా చిన్న పార్ట్‌టైమ్ ఉద్యోగం చేస్తానన్నాను. ఎట్లాంటిదైనా ఫరవాలేదన్నాను. వాళ్లు వాళ్ల పలుకుబడినుపయోగించి, ఒక చిన్న ఆఫీస్‌లో టైపిస్ట్‌గా పార్ట్‌టైమ్ ఉద్యోగం ఇప్పించారు. నా ఖర్చులు వెళ్లిపోతాయి. నాకు కాస్త టైపురావడం ఈ విధంగా ఉపయోగించింది.

పద్మకీ, ప్రియకీ, ప్రొఫెసర్‌గారికీ, శ్రీరామ్‌కీ తెలిసిన వాళ్ల అడ్రసులు, ఫోన్ నెంబర్లూ, నా దగ్గర ఉన్నాయి. అదిగాక మా బంధువులూ, స్నేహితులు, అదీగాక, మా నలుగురి మిత్రుల పరిచయస్తులు, వాళ్ల వివరాలు, అవన్నీ కలిపి ఒక పట్టిక తయారుచేశాను.

నేను నా ఉద్యోగం చేస్తూనే, నా స్టడీని మొదలుపెట్టాను. ఇక్కడొక సంగతి. నేను ఫలానా పనిమీద వచ్చాననే విషయం ముందుగా ఎవరికీ తెలియనీయలేదు

నాస్టడీ రాధమ్మగారితో మొదలైంది.

ఆవిడ చాలా ఆప్యాయంగా మాట్లాడుతుంది. ఆవిడకి ఒక్కడే కొడుకు. ఆ కొడుకు మీదే పంచప్రాణాలావిడకి. ఆవిడతో ఎవరైనా ఏవైనా మాట్లాడటం ప్రారంభిస్తే ఇంక మనం చెప్పేదేం వినదు. తన దేవన తను కొడుకు సంగతులు, ముద్దుముచ్చటలూ, చిన్నతనం కబుర్లూ ఏకరువు పెడుతుంది. మన మావిడ కొడుకు గురించి మాట్లాడితే వింటుంది. అంతే!

ఆవిడ చెప్పే మాటల్ని చూస్తే ఆ కొడుకు మూడేళ్లవాడో, ఆరేళ్ల వాడో ననిపిస్తుంది మనకి.

కానీ, ఆ కొడుకు పాతికేళ్ల అందమైన యువకుడు. ఠీవీ, దర్జా, అందం, ఐశ్వర్యం, చదువు, మంచి ఉద్యోగం అన్నీ ఉన్నాయి అతడికి. అతడికి పెళ్లీడు వచ్చిందని, అప్పుడప్పుడూ ఆవిడే అంటుంది!

ఆవిడ ఆ కొడుకుమీద ఎంతగా అనుబంధం, ఆపేక్ష పెంచుకున్నదంటే, ఆ కొడుక్కి పెళ్లిచెయ్యడం ఆ తల్లికి ఇష్టంలేదంటే ఆశ్చర్యపడక్కర్లేదు.

పెళ్లిచేస్తే తన కొడుకు తనకి దూరమౌతాడన్న భయం ఆవిణ్ని అహర్నిశలూ పీడిస్తోంది. కొడుకు ఆఫీసు పనిమీద ఏ ఊరు వెళ్లినా, ఈవిడ వెళ్లాల్సిందే. ఒకవేళ వెళ్లలేకపోతే కొడుకు తిరిగి వచ్చేదాకా కళ్లల్లో వత్తులేసుకుని కూచుంటుంది.

ఆఫీసు నుంచి కాస్త ఆలస్యంగా వచ్చినా

చాలా ఆదుర్దాపడుతుంది.

ప్రతి నిమిషం, ప్రతి సెకండూ, ఆమెకి కొడుకు ధ్యాసే.

దీనికి కారణమేమిటా అని కనుక్కోగా, ఆ తరువాత తెలిసింది.ఆమెకుచాలా ఏళ్లు పిల్లలు కలగలేదు. ఆ తరువాత కలిగిన వాళ్లు బతకలేదు. చివరికి ఈ కొడుకొక్కడూ దక్కాడు. కొడుకు పుట్టిన ఏడాదికే భర్త పోవడం కూడా ఒక కారణమే అనుకోవచ్చు.

కొడుకు రమేష్‌కి కూడా తల్లంటే ఆపేక్షే. అందులో ఏమీ ప్రత్యేకత లేదు. అందరి కొడుకులకీ తల్లంటే ఉన్న ఆపేక్షే ఉంది అతడికి కూడా. అతడి మాటల్లో ఎక్కడో అసంతృప్తి ఉందా అనిపిస్తుంది! ఒక రోజు నేను వాళ్లింటికి వెళ్లేటప్పటికి కొడుకు, తల్లి ఎక్కడికో ప్రయాణమవుతున్నారు. నేనడగలేదు. కానీ ఆమే చెప్పింది పెళ్లిచూపులకని.

వాళ్లు వెళ్లిపోయాక నేను తిరిగి వచ్చేశాను.

ఆ సాయంత్రం నాకు మార్కెట్లో రమేష్ కలిశాడు. నేనడక్కుండానే చెప్పేశాడు పిల్లనచ్చింది, బహుశా ఈ సంబంధం కుదరచ్చనీ.

''మీ అమ్మగారికి.....''

అనబోయేంతలో రమేష్ మొహం కోపంతో ఎర్రబడింది.

కోపం రావడంతో ఆశ్చర్యంలేదు. ఈపాటికే అతడి చుట్టపక్కాలకీ, చుట్టుపక్కలవాళ్లకీ కూడా తెలిసిపోయి ఉంటుంది అతడి సంగతి, వాళ్లమ్మసంగతీను.

''అమ్మకి నచ్చిందీ సంబంధం'' అన్నాడు ముక్తసరిగా. అంతలోనే విచారం, నిరాశాభావం కనబడింది అతడి ముఖంలో.

''అమ్మకి నేనంటే చాలా ప్రేమ. కానీ ఎందుకో...అమ్మ నన్నే అర్థం చేసుకోలేకపోతోంది''

''మీరెప్పుడూ మీ అమ్మకి దూరంగా వుండలేదా?''

''లేదు''

''అసలు మీరుండగలరా?''

నవ్వాడు రమేష్.

''నేను మామూలు మనిషిని. అతి మామూలు కొడుకుని. మా అమ్మని ఎంతో ప్రేమిస్తాను... మరెంతో గౌరవిస్తాను. కానీ నా అవసరాలు నాకున్నాయి, నా కోరికలు నాకున్నాయి. అవి అమ్మ ముందువరచాలంటే కొంత జంకు అడ్డువస్తున్నమాట నిజమే. కాని ఒకటిమాత్రం రూఢీగా చెప్పగలను. నేనింకా పాలుతాగే పసిపాపాయిని మాత్రంకాను. పెళ్ళయితే అమ్మని నిర్లక్ష్యం చేస్తానని అమ్మ భయం. కాని అదెంత మాత్రం నిజంకాదు. పెళ్ళయినా అమ్మ గౌరవస్థానం అమ్మకెప్పుడూ వుంటుంది. భార్యకి నా జీవితసహచరిగా ఆ భాగం ఎటూ ఇస్తాను''

''ఇంత క్లియర్‌గా మీ అభిప్రాయాలు మీకున్నప్పుడు ఇంకెందుకు జంకు... గోఎహెడ్''

నవ్వాడు రమేష్.

ఆ తరువాత మరో నాలుగురోజులకి నేను వెళ్ళినప్పుడు రమేష్ లేడుగానీ వాళ్ళమ్మ వుంది.

ఎంతో ఢీలాపడిపోయివుంది.

నాతో తన మనసులోని విషయాలు చెప్పుకొని ఏడ్చింది.

''కోడలు పిల్లవచ్చాక నన్ను సరిగ్గా చూస్తుందా? నేను వీడికి అక్కరలేకుండా పోతానా? నన్ను ఇంట్లోంచి ఇద్దరూ కలిసి వెళ్ళమన్నా నేనేం చెయ్యలేనుకదా? ఎక్కడికీ పోలేను కదా? ఏమో... ఈ కాలపు ఆడపిల్లలు అందులోనూ చదువుకున్నవాళ్ళు ఏమేం విద్యలు నేరుస్తారో ఏమేం మాయలు పన్నుతారో... నా కొడుక్కి నేను అన్నం కూడా పెట్టగలనోలేదో''

''చూడండి ఆంటీ.... మీరు లేనిపోనివి ఊహించుకుని అనవసరంగా బాధపడుతున్నారు. అబ్బాయి మీ కొడుకైతే ఆ అమ్మాయి మీ కూతురనుకోండి. మీకు కూతుళ్ళు లేరు కదా. ఆ ముచ్చటలన్నీ ఆ అమ్మాయి మీదే తీర్చుకోవచ్చు. మీరు మీ కొడుకుమీద ఎంతగా ఆపేక్షపెంచుకున్నారో ఆ అమ్మాయిమీద కూడా అంతే ఆపేక్ష చూపించండి. పైగా మీకిప్పుడున్న బాధ్యత-భారం కూడా తీరతాయి. కొడుకు-కోడలు చక్కగా ఇల్లు నిర్వహించుకుంటూ వుంటే మీరు నిశ్చింతగా వుండచ్చు ఏడాది తిరిగేలోపల మనవడు లేక మనవరాలు. ఇక మీకు తీరికేది?

''ఈవిధంగా ఆవిడకి అనేక విధాలుగా నచ్చచెప్పేవాణ్ని. ఎన్ని చెప్పినా వికసించని

ఆమె వదనం మనవడు మనవరాళ్ళు మాట వినగానే వికసించేది, కళకళలాడేది.

చివరికెట్లాగయితేనేం రాధమ్మగారు రమేష్ పెళ్ళికి ఒప్పుకొంది.

ముహూర్తాలు కూడా పెట్టుకున్నారు రమేష్, రచనల పెళ్ళికి.

★ ★ ★

"ఇప్పుడు నేను ఎవరి చుట్టాలింటికెళ్ళానో చెప్పను. ఊరికే కథలాగా చెప్పుకుపోతాను.

తిరుమలరావుగారు పెద్ద పేరుమోసిన లాయరు. ఒక కొడుకూ ఒక కూతురూ ఆయన కి.ఆయన అన్నివిధాలా మంచివాడు. యోగ్యుడేకానీ తల్లిదండ్రులంటేమాత్రం అదో వుదాసీనభావం.

ఆయన భార్య సుగుణ కూడా చాలా మంచి దానిలాగే కనబడింది.

కానీ తిరుమలరావుగారు భార్య ఎదుట తల్లిదండ్రుల గురించి ఎప్పుడూ ఎగతాళిగా మాట్లాడుతూ వుంటారు.

భర్త మాటలకి వంతపాడుతుంది భార్య.

"ఇదిగో చూడు ప్రవీణ్... మావాళ్ళున్నారే... ఫామిలీ ప్లానింగ్ పాటించి వుంటే వాళ్ళకీ బాధ్యతలూ, తాపత్రయాలూ తప్పేవికదా? అప్పుడివి లేవనద్దు. అన్నీ వున్నాయి. అది పాపమూ ఇంకేదో అంటూ పాటించలేదు. ఇంకా ఇద్దరాడ పిల్లలున్నారు పెళ్ళికి. మా తమ్ముడొకడు ఇంకా ఎస్సెల్సీలో వున్నాడు. ఎప్పటికి ఎక్కిరాను?"

"అవునండీ... మనం చూడండీ ఎంత ముందాలోచనగలవాళ్ళమో" భార్య అంటుంది.

"అదీగాక మా నాన్నున్నాడే! ఉన్న ఆస్తంతా వూడ్చేశాడు. మాకేమీ ఇవ్వకపోతేమానె ఇప్పుడు ఆ పిల్లల పెళ్ళిళ్ళకి మేమివ్వకపోతే జరగదు. వాళ్ళ ఆశలా? డాక్టర్లు-ఇంజనీర్ల మీదున్నారు. పాతిక్కి తక్కువ కట్నంలో ఒక్క పెళ్ళి చెయ్యలేము"

"పిల్లలుగలవాళ్ళం జాగ్రత్తగా వుండద్దూ...." అంటుంది సుగుణ.

ఉన్నట్టుండి వంద పంపూ, రెండు వందల పంపూ అంటే మా దగ్గరి వుండద్దూ? అందులో ఈ సిటీ లైఫ్‌లో ఖర్చులెక్కువ"

అని భర్త అంటే–

"మా దగ్గరకువచ్చి వుండమంటే వుండరు వాళ్ళకెంతైనా ఆ కొడుకంటేనా ప్రేమ ఎక్కువ"

అంది సుగుణ.

వింటున్న నాకే చురుక్కుమంది మనసు.

మనవాళ్ళకి మనం గౌరవం ఇస్తే మన తరువాతవాళ్ళు ఇస్తారు.

పెద్దవాళ్ళని విమర్శించేంతవాళ్ళమా మనం?

తల్లిదండ్రులు ఎన్నివిధాల ఎంత కష్టపడకపోతే మనమింత వాళ్ళమయ్యాము?

ఇవి నేను నూటిగ్గానాకుండా చూచాయగా తిరుమలరావుగారితో మాటల సందర్భంలో అన్నాను.

"ఏమండీ... పెద్దవాళ్ళని మనం బాధపెట్టటమెందుకు? వాళ్ళున్నన్నాళ్ళూ మనం వాళ్ళ కనుగుణంగా నడుచుకుంటే వాళ్ళకీ సంతోషం మనకీ శాంతికదా?"

విస్ఫారిత నేత్రాలతో చూశారు తిరుమలరావుగారు.

"మీరనేదేమిటి....?" అడిగింది అక్కడేవున్న సుగుణ. "మీ చెల్లెళ్ళ పెళ్ళిళ్ళకి- మీరివ్వకా తప్పదు వాళ్ళు అడక్కా తప్పదు, ఇది తెలిసిందేకదా?"

"అవును?"

"మీ అన్నదమ్ములు ముగ్గురూ కలిసి కూర్చుని..."

"ముగ్గురెక్కడ.... ఇద్దరే! ఇంకొకాయన ఇంకా చదువేగా?" సుగుణ అంది.

"అదే, ఇద్దరూ కలిసి చర్చించుకుని చెల్లెళ్ళ పెళ్ళికని ప్రతినెలా కొంత బ్యాంకులో వేస్తే మీకూ- వాళ్ళకీ కూడా అంత భారమనిపించదుకదా?"

"అదీ నిజమే"

"మీరూ ఒక్కసారిగా పెద్దమొత్తం సర్దాల్సిన అవసరమూ వుండదు. లేదా ఇద్దరన్నారుగదా చెల్లెళ్ళు. ఒక చెల్లెలి పెళ్ళి మీరు, ఇంకొక చెల్లెలి పెళ్ళి మీ తమ్ముడూ చేద్దామని అను

కోండి. ఆ చెల్లెలి పెళ్ళి మీ కూతురి పెళ్ళిలాగే సంతోషంగా చెయ్యండి. పెద్దవయస్సులో వున్న తల్లిదండ్రుల్ని సుఖపెట్టండి- అదెప్పుడూ మీకు శ్రేయోదాయకమే.

అంతేకాదు మీరు చేసినదానినే మీరు పొందుతారు. మీరు మీ పెద్దవాళ్ళని చూసుకుంటే మిమ్మల్ని మీ పిల్లలు అట్లా చూసుకుంటారు. చిన్నచిన్న అరమరికలు వున్నా సర్దుకుపోవాలి''

తిరుమలరావుగారు ఆలోచించారు నామాటల మీద.

''చిన్నవాడివయినా విలువయిన మాటలు చెప్పావయ్యా!'' కళ్ళు తుడుచుకున్నారాయన సుగుణ ఏమీ మాట్లాడలేదు.




ఉషకి తండ్రంటే చెప్పలేని ప్రేమ.

చిన్నప్పట్నించీ తల్లి దగ్గరకంటే తండ్రి దగ్గరే ఎక్కువ చేరిక ఉషకి.

ఏది కావాలన్నా తండ్రినే అడిగేది. మనసులో మాట తండ్రితోనే చెప్పుకునేది

తల్లి అకస్మాత్తుగా పోయినప్పట్నించీ తండ్రిమీద ప్రేమ ఇంకా ఎక్కువయింది. మరీ అపురూపంగా చూసుకుంటోంది ఆయన్ని.

ఆ తండ్రికీ కూతురంటే చాలా ప్రేమ.

ఆ తండ్రీకూతుళ్ల ప్రేమ అందరికీ ఉదాహరణగా వుంటుంది.

రామారావుగారికి ఒక్కత్తే కూతురు- ఉష. పెద్దవయస్సులో పుట్టడం వల్ల ఆమె అంటే మరింత ప్రేమ.

చాలా గారాబంగా పెంచుకున్నారు ఆమెని.

ఉషకి కూడా మొదట్నించీ అన్నీ ఆకళింపు. తన వస్తువుల్ని తను జాగ్రత్తపెట్టుకోవడం, అందరి అవసరాలూ చూడటం ప్రతిదానికీ తనే ముందుకొచ్చి అందర్నీ ఆదుకోవడం, తన స్వవిషయాలని కూడా పక్కకినెట్టి మరొకరి కోసం పాటుపడటం ఇవన్నీ ఆమెకి చిన్నప్పట్నించే అలవడ్డాయి.

చదువులో చకచకా పైకి వచ్చి ప్రతి క్లాసులో నూ ఫస్టు రాంకు తెచ్చుకుని ఎమ్.ఎ. పాసయి కాలేజీలో లెక్చరర్‌గా చేరింది. అప్పుడే తల్లిపోయింది.

తల్లి పోయినప్పట్నించీ ఆ తండ్రీకూతుళ్ళు మరీ సన్నిహితమయ్యారు.

అన్నీ బాగానే వున్నాయిగానీ ఆ తండ్రికి ఒక్కటే బాధ. ఉష పెళ్ళి చేసుకోనంటోంది. తండ్రిని చూసుకుంటూ అవివాహితగానే వుండిపోతానంటోందామె. తండ్రి ఆ పేరెత్తితేనే అక్కణ్నించి వెళ్ళిపోతోంది.

తండ్రి ఏ మాట చెప్పినా వింటుందిగానీ ఉష ఈ విషయం మాత్రం వినదు. ఎంతో తేలిగ్గా తీసి వేస్తోంది లేదా నవ్వేస్తోంది.

ఇంటికి ఎవరొచ్చినా వాళ్ళతో ఈ విషయం చెప్పి బాధ పడతాడాయన.

వాళ్ళని కూతురికి నచ్చచెప్పమంటాడు. ఉష అంటుంది, ''నేను లేకపోతే నాన్నని ఎవరు చూసుకుంటారు? ఆయన ఎట్లాంటి వారంటే చిన్నపిల్లవాడి చందం. కంచం ముందు కూర్చుని అన్నం తింటూ ఏం తింటున్నాడో కూడా గమనించుకోరు. వాకిట్లో పేపరు చదువుతూ కూర్చున్నారంటే ఎవరొచ్చినా తెలీదు''

నవ్వుతూ అంటాడాయన.

''మా ఉష నన్ను మరీ చేతకాని వాడికింద కట్టేస్తోంది. నేనంటూ వుంటానుకూడా, ఈ ప్రపంచంలో ఎవరు లేకపోయినా ఏదీ ఆగేది లేదు పిచ్చితల్లీ నువ్వూ నీ భర్తా కూడా నన్ను చూసుకోవచ్చు. చెప్పిన మాట విను, నువ్వూ చెప్పవయ్యా ప్రవీణ్!''

ప్రయత్నిస్తానన్నాను.

నా ప్రయత్నం నేను చేశాను.

''ఉషా... నేను. మీకు కొత్తే. నేను మీకు సలహాలు చెప్తే అది మీకు నచ్చకపోవచ్చు''

అంటూ ప్రారంభించాను.

"అహ... అదేంలేదు"

"అట్లా అనవద్దు. మీకిష్టంలేని విషయంలో ఎవరైనా సలహాలు చెబితే అది మీకు చికాకు కలిగించే విషయమే"

ఆమె ఏమీ మాట్లాడలేదు.

ఆమెకి నా వయసే వుండచ్చు లేదా నాకంటే కొంచెం పెద్దదయినా అయివుండచ్చు.

మనం చేపట్టిన మహత్కార్యం వల్ల నాకేమో ఎవరితోనయినా, ఎట్లాంటి విషయమైనా అతి సూటిగా సాఫీగా మాట్లాడగలిగే నైపుణ్యం అలవడింది. ఒక్కొక్కప్పుడు ఆలోచించుకుంటే నేను మాట్లాడే విధానం నన్నే ఆశ్చర్యపరిచేది.

"చూడండి ఉషా... మీకు వివాహమంటే ఏమీ విముఖత్వం లేదుగా?"

"అంటే?"

"అదే.... వివాహం చేసుకోకపోవడానికి ఇంకేమీ కారణంలేదుకదా అని!"

"లేదు. కానీ మా నాన్నకి నేను తప్ప మరెవ్వరూలేరు. నేనుకూడా వెళ్ళిపోతే మరీ వంటరివార్తైపోతారు"

"మీరు భ్రమపడుతున్నారు. మీరు పెళ్ళిచేసుకుంటే మీ నాన్నగారికి నా అనేవాళ్ళు ఇంకా ఎక్కువవుతారు. ఆయన్ని చూసుకునేవాళ్ళ సంఖ్య పెరుగుతుంది"

"మీరనేది నిజమయితే బాగానేవుంటుంది. కానీ నిజంగా అంతటి సహృదయులు వుంటారంటారా? ఒకవేళవున్నా అటువైపువాళ్ళు అట్లా వుండనిస్తారా?"

"అందరూ అట్లా వుంటారని మీరెందుకనుకోవాలి?"

"అట్లావున్నా వుండకపోయినా అది ప్రపంచ న్యాయంకదా? ఆడపిల్ల పెళ్లితర్వాత పుట్టింట్లో వుండదు. అత్తవారింట్లోనే వుండాలి. ఆమె భర్త తన వారినే చూసుకోవాలిగానీ తన భార్య తరఫువాళ్లని చూసుకోదు. చూసుకుతీరాలి అనే రూలులేదు. ఆయన చూసుకున్నాడా– మహానుభావుడనే అనాలి. ఆయన చేసేది మహావుపకారమని మనం భావించాలి. ఒకవిధంగా ఆయన దయాధర్మంమీద మనం ఆధారపడాలి"

కొంచెం ఆవేశపడింది ఉష.

"అంతేకాదు ఆడపిల్ల జీతం కూడా పెళ్లయ్యాక భర్తకే చెందుతుంది. తను సంపాయిస్తూ కూడా ఆ డబ్బు ఖర్చుపెట్టడానికి భర్త పర్మిషన్ కావాలి. కేవలం డబ్బు విషయమేకదు ఇంకా ఎన్ని విషయాల్లోనో పురుషాధిక్యంవున్న మన ఈ ప్రపంచంలో పెళ్లిచేసుకుంటే ఇంక నాబోటివాళ్లపని ఏటికి ఎదురీదటమే అవుతుందేమో. ధైర్యంగా ఎదురీదలేవా అంటారేమో... ఎదురీది నెగ్గగలనా– అనేదే నా సందేహం"

"సందేహిస్తూ చెయ్యదల్చుకున్నది చెయ్యకుండా వుండటం అవివేకం ఉషా! మీలాంటి ధైర్యం, పట్టుదలా వున్న ఆడపిల్లలవల్లే స్త్రీజాతి ముందుకొస్తుంది. మీలాంటివాళ్లే ప్రపంచరీతుల్ని మార్చాలి... మార్చగలరు. చూడండి... ఇటువైపునించి ఆలోచించండి. మీరు వివాహం చేసుకుంటే మీ నాన్నగారికి ఇంకా సుఖం, సంతోషం కలుగుతాయి. ఇప్పుడు ఆయనకి బాహ్యానందం వున్నది... నిజమే. కానీ ఆత్మానందం లేదు. ఏదో అసంతృప్తి వుంది... విచారం వుంది. ఎందుకు? మీరు పెళ్లిచేసుకోకపోతే తనవల్లనే మీ జీవితం వ్యర్థమయిందన్న వేదన అది. పెళ్లే జీవిత పరమార్థమా అని మీరు అడగచ్చు. ఆయన అభిప్రాయం అది. పెళ్లి చేసుకోకుండానే జన్మసార్థకం చేసుకునేవాళ్లు ఎంతమందో లేకపోలేదు. నిజమే... కానీ మీరు పెళ్లిచేసుకుని పిల్లాపాపలతో సుఖంగా వుండటమే అర్థవంతమైనదని ఆయన భావన. ఆయన ఉన్నన్నాళ్లూ సుఖంగా, సంతోషంగా వుంచడమే కదా మీక్కూడా కావల్సింది? ఆయన పూర్తి సంతోషంగా వుండాలంటే మీరు వివాహం చేసుకోవాలి. లేకపోతే తన తరువాత ఈ ప్రపంచంలో మీరు ఒంటరిగా ఏమయిపోతారోననే దిగులు ఆయన్ని బాధిస్తుంది, క్రుంగదీస్తుంది. మీరు పెళ్లిచేసుకుంటే ఆ సంతోషంతో, ఆ సంతోషం ఇచ్చిన బలంతో ఆయన ఎంతో సంతృప్తిగా, ఏలోటూ లేకుండా హాయిగా జీవించగలుగుతారు. మీరే ఆలోచించండి... నెమ్మదిగా, ప్రశాంతంగా ఆలోచించి నిర్ణయాన్ని తీసుకోండి.

మీకు మనస్ఫూర్తిగా నచ్చినవాణ్ణే చేసుకోండి. అతణ్ని మీరు అర్థం చేసుకుని, మిమ్మల్ని అతడు అర్థం చేసుకుంటే సమస్యలన్నీ చిటికెలో పరిష్కారం అయిపోతాయి. ఆయన్నే ఒప్పించి మీ నాన్నగారితో మీరుండటమో లేక మీతోనే మీ నాన్నగారుండటమో చెయ్యొచ్చు. లోకంలో కొన్నిచోట్లైనా ఇట్లాంటివి జరుగుతూనే వుంటాయి''

ఆరోజుకా మాటలు చాలనుకున్నాను.

ఉష మౌనంగా వుండిపోయింది నా మాటలు వింటూ.

ఆ తరువాత ఇంత వివరంగా కాదుగానీ అప్పుడప్పుడూ మామధ్య ఈ మాటలు దొర్లేవి. వాళ్ల నాన్నగారు కూడా తరచూ పాలుపంచుకునేవారు. ఒక్కొక్కప్పుడు మమ్మల్ని వింటూ వుండిపోయేవాళ్ళు.

ఆ తరువాత ఒకనాడు నేను - రామారావుగారే వున్నప్పుడు ఆయన నాతో అన్నారు-- ''ఉషలో మార్పు చూస్తున్నానోయ్ కొంత తీవ్రంగా వాదించడం తగ్గింది. పెళ్లి విషయం కదిపినా అంత వ్యతిరేకత చూపడంలేదు. ఇప్పుడుగాకపోయినా మరో సంవత్సరానికయినా సుముఖురాలవుతుంది. నాకంతే చాలు. ఇదంతా నీ ప్రయత్నమే... చాలా థాంక్సోయ్''

నాకూ సంతోషం కలిగింది.

★ ★ ★

ప్రీతి ఈ కాలపు పిల్ల.

ఉషకున్న సందేహాలు ప్రీతికి లేవు.

ప్రీతి తల్లిదండ్రులు ప్రేమ వివాహం చేసుకున్నారు. అందుకని రెండువైపులవాళ్లకీ వాళ్లు దూరమయ్యారు.

అయినా వాళ్లు లెక్కచెయ్యలేదు. సుఖజీవితమే - ఏలోటూ లేకుండా గడిపారు.

తల్లి ఆదర్శగృహిణి.

ప్రీతిని మంచి స్కూల్లో చదివించారు. అందం, చదువు, సంస్కారం, వినయ విధేయతలూ అన్నీ ప్రీతినే వరించాయి. తల్లిదండ్రులకి కంటిదీపంగా వుండేది ప్రీతి. ఏ కష్టమూ లేకుండానే పెరిగింది.

కానీ విధి వారిని చిన్నచూపు చూసింది. ప్రీతి డిగ్రీ పూర్తిచెయ్యనేలేదు. తండ్రి మరణించాడు. తల్లి గర్భిణి.

ప్రీతికి పద్ధెనిమిదేళ్ల వయసప్పుడు చిట్టి తమ్ముడు పుట్టాడు. తల్లి ఆ తరువాత చాలా జబ్బుపడింది. ఎంతో డబ్బు ఖర్చుచెయ్యాల్సి వచ్చింది. ఆమె కోలుకునే సమయానికి తండ్రి పోవడం, తల్లికీ - ప్రీతికీ పెద్ద షాకయింది. పెద్ద అఘాతంలో [illegible]్యారు.

బాంకు బాలెన్సు నిల్. ప్రీతి చదువు సగంలో వుంది. తల్లికి పిల్లవాడు. వీళ్ల భవిష్యత్తేమిటి?

అంతా అయోమయం. ఎటుచూసినా అంధకారం.

ప్రీతిచదువెట్లా సాగుతుంది? పిల్లవాడు ఎట్లా పెరిగిపెద్దవాడవుతాడు? అసలు రోజులెట్లా గడుస్తాయి?

ఆస్తిపాస్తులులేవు

నా అన్నవాళ్లు లేరు

అట్లాంటి టైములో ప్రీతి ధైర్యసాహసాలు-- ఆమెకి సహాయం చేశాయి.

తల్లికి ధైర్యం చెప్పింది. తమ్ముణ్ణి అక్కున చేర్చుకుంది. జరగవల్సింది ఆలోచించింది... ఒక నిశ్చయానికొచ్చింది.

తండ్రి పనిచేసిన ఆఫీసుకు వెళ్లింది. పెద్దలకు పరిస్థితి చెప్పింది.

ఆమె చెప్పిన విధానానికో, ఆమె పరిస్థితికో, తెలివితేటలకోగానీ వాళ్లు చాలా ఇంప్రెస్ అయ్యారు. తండ్రి పనిచేసిన కంపెనీలోనే ఆ అమ్మాయికి ఉద్యోగం ఇచ్చారు.

ఈ లోకంలో అందరూ చెడ్డవాళ్లే వుండరు అనే విషయం మరోసారి రుజువైంది. కాలేజీ మానేసింది ప్రీతి. ప్రైవేటుగా చదువుతానంది.

ఇంటిభారం భుజంమీద వేసుకుంది. వంచిన తల ఎత్తకుండా పనిచేసేది. ఇంటికొచ్చి తల్లికి మంచిమాటలు చెప్తూ ఇంటిపనులు చూసుకునేది.

తల్లికి ఏవిధంగానూ కష్టంకలక్కుండా చూసుకుంది.

అట్లా మూడు నాలుగేళ్ళు గడిచాయి. తను ప్రైవేటుగా డిగ్రీ పూర్తిచేసింది. తమ్ముణ్ణి స్కూల్లో చేర్పించింది.

తల్లికూడా కొత్త కొత్త మనుమల్లోపడింది. ఉద్యోగంలో ఒకటిరెండు ప్రమోషన్లు వచ్చాయి. ఏ ఒడుదుడుకులూ లేవనే చెప్పాలి.

అప్పుడొచ్చిందొక చిక్కు సమస్య.

ఈ అమ్మాయి ధైర్యసాహసాలకు, చాకచక్యానికి, అందానికి, ముగ్ధుడైన ఒక యువకుడు-ప్రీతిని పెళ్లాడతానని ముందుకొచ్చాడు. ఆ అబ్బాయి పోస్టుగ్రాడ్యుయేషన్‌పూర్తిచేసి కాలేజీ లెక్చరర్‌గా చేరాడు. ప్రీతి అతడినుండి తన చదువు విషయంలో సహాయ సహకారాలు, సలహాలు తీసుకునేది. ఆమెకి అతడు మంచి







స్నేహితుడు.

ఇప్పుడు వివాహానికి ప్రపోజల్‌పెట్టాడు. ప్రీతికి ఎటూ చెప్పలేని పరిస్థితి.

తల్లి సమస్య అంతకన్నాను.

పెళ్ళి చెయ్యగలిగే పరిస్థితిలో లేదామె.

ఖర్చుకి ఖర్చేకాదు-

ప్రీతి జీతంతోనే ఇల్లు నడుస్తోంది.

కొడుకింకా చిన్నవాడు.

అట్లాగని కూతుర్ని పెళ్ళిచేసుకోకుండా వుండిపొమ్మనలేదు.

తను తిరిగి సంబంధాలు ఎటూవెదకలేదు. బంగారంలాంటి సంబంధం కోరి మరీవచ్చింది. పిల్లవాడు యోగ్యుడు. ఉత్తముడు, కట్నకానుకలేమీ ఆశించనివాడు. పిల్లే ముఖ్యం అనుకునేవాడు.!

అట్లాంటి సంబంధం తను జన్మలో తీసుకురాలేదు. కూతురు తప్పకుండా సుఖపడుతుంది.

కానీ... తన పరిస్థితి?

అన్ని సమస్యలని చిటికెలో పరిష్కరించాడు ఆ యువకుడు. అట్లాంటి ఆదర్శయువకుడు నూటికీ కోటికీ ఒక్కరుంటారు.

"నాక్కావాల్సింది మీ అమ్మాయి. మీ అమ్మాయి జీతంకాదు. అది మీ పిల్లవాడు పెరిగి ప్రయోజకుడయ్యేదాకా మీకే చెందుతుంది అని నేను ప్రమాణపూర్వకంగా చెప్తున్నాను" అని చెప్పాడు.

మొదట వాళ్ళనివచ్చి తనతోనే వుండమన్నాడు. లేదా ప్రీతి తమ్ముడు చదువుసంధ్యల పూచీ మేమే చూస్తామన్నాడు. తల్లి ఆ రెండింటికీ ససేమిరా వప్పుకోలేదు. చివరికి అతికష్టంమీద వప్పుకుంది. ఆమెకీ కూతురి పెళ్ళి తరువాత కూతురిడబ్బు వాడుకోడం ఇష్టంలేదు. కానీ తప్పనిసరి పరిస్థితి అవడంతో ఒప్పుకుంది. మరి తను ఒకర్తే కాదు కదా?

ఆ పెళ్ళి సింపుల్‌గానే అయినా ఎంతోబాగా జరిగింది. పెళ్ళికి వచ్చిన వాళ్ళందరూ- ఆ వరుణ్ణి పొగ డటమే.

ఆ వరుడు నిజంగా దేశానికే గర్వం కలిగించే పౌరుడు.

ఆదర్శపురుషుడు.

కట్నంలేకుండా పెళ్ళిచేసుకోవడమే ఆదర్శమైతే వివాహానంతరం కూడా భార్య సంపాదన ఆమె కుటుంబంకోసం వినియోగించడం మరో ఆదర్శం.

వాళ్ళ కష్టసుఖాలు తనవిగా భావించడం, వాటికి బాధ్యత వహించడం, ఆదర్శం.

★ ★ ★

ఇంక రమ విషయం వింటే ఎట్లాంటివారికైనా జాలేస్తుంది.

తల్లిదండ్రుల్నికాదని వెళ్ళి పెళ్ళిచేసుకుంది.

ప్రేమవివాహం వల్ల తప్పులేదు కానీ ఎన్నుకునే జీవిత భాగస్తుడు ఎట్లాంటివాడో తెలుసుకుని మరీ ముందడుగు వేయాలి.

పెళ్ళంటే ఒకనిమిషం, ఒకగంట, ఒకరోజు, ఒక సంవత్సరంలో అయ్యేదికాదు. నూరేళ్ళ పంట. పెద్దలుచేసిన పెళ్ళయితే మంచిచెడ్డలు వారు చూసుకుని మరీ చేస్తారు. వధూవరులు తమకైతాము నిశ్చయించుకునే పెళ్ళైతే తొందరపడకుండా అన్ని విషయాల్లోనూ ఒకరినొకరు అర్థంచేసుకుని చర్చించుకుని కలిసి గడపగలమనే ఆత్మవిశ్వాసం వుంటేనే ముందుకెళ్ళాలి. ప్రేమేదో, మోహమేదో తెలుసుకోగలగాలి.

రమ వివాహం వర్ణాంతరం కావడంతో తల్లి ఆ షాక్‌ను తట్టుకోలేక మంచంపట్టింది. అది ఆమెకి అశనిపాతం అయింది. కొంతమంది మూఢాచారాలని వదులుకోలేరు. కన్న మమకారం చంపుకోనూలేరు. ఈ రెండిటిమధ్య ఇరుక్కుని సతమతమవుతారు. అట్లాగే ఆమె తల్లి విషయంలో జరిగింది. ఆమె ఏడాది తిరక్కుండానే మరణించింది.

తనవల్లనే తల్లిపోయిందనే బాధ రమని చాలా బాధపెట్టింది. ఆ బాధ ఎప్పటికీపోదు! అది తల్చుకుని ఏడుస్తూనేవుంటుంది ఎప్పుడూ.

మొదట వివాహజీవితం మధురంగానే వుంది. మొదట్లో బాగా చూసుకున్న ఆమె భర్తలో రానురానూ మార్పువచ్చింది.





కొత్తమోజు తీరింది.

మొదట మానసికంగా హింసించేవాడు సూటీపోటీ మాటలతో.

ఎప్పుడయితే భార్య వెగటయిందో తనవారికి చేరువయ్యాడు.

తన వాళ్ళందర్నీ తెచ్చి తన దగ్గరే వుంచుకుని వాళ్ళకి ఒక్కొక్కరకమైన సేవలు భార్య చేత చేయించేవాడు.

వాళ్ళూ తలోమాటా విసిరేవారు, ఆమెని అవమానం చేసేవారు.

భర్తకి లోకువయినభార్య అందరికీ లోకువే!

ఆమె కూడా ఉద్యోగంచేస్తోంది. ఇంట్లో పని, బయటపన్లతో, ఆమె ఆరోగ్యం పాడయింది.

ఒకళ్ళూ ఒక్కసహాయమూ చెయ్యరు.

ఇంతలో ఆమె తండ్రికి వంట్లో బాగాలేదు సీరియస్‌గావుందని టెలిగ్రాంవచ్చింది.

భర్తకి రమవైపు వాళ్ళంటే కోపం, కసి.

"నేను పనికిరానివాళ్ళ కొంపకు నువ్వెట్లా వెళ్తావు? వెళ్ళడానికి వీల్లేదు-" అంటాడు.

ఇప్పుడూ అట్లాగే అన్నాడు.

ఆమె తెగించి వెళ్ళడానికి సిద్ధమైంది.

భర్త రుద్రుడయ్యాడు.

నువ్వు వెళ్లడానికి వీల్లేదన్నాడు

"వెళ్తే తిరిగి రానీను" అన్నాడు.

"నిజంగా నీతండ్రికే రోగమూ" లేదన్నాడు.

"నీ దగ్గరున్న డబ్బూ నగలూ లాక్కోడానికి పన్నాగం" అన్నాడు.

దాంతో రమ సహనం చచ్చిపోయింది. తాను చేసిన పొరపాటు తెలిసి వచ్చింది.

'తన కిష్టమైన పెళ్లి' అంటూ తల్లిదండ్రులకి దూరమైంది కదా. అని తనను తాను తిట్టుకుంది. ఏడ్చింది.

రోషాన్నీ అభిమానాన్నీ చంపుకుని, ఏడుస్తూ భర్త కాళ్లుపట్టుకుంది. తండ్రిని చూసి వెంటనే వచ్చేస్తానని.

ఆ భర్త కదల్లేదు, మె దల్లేదు. మొండిపట్టు వదల్లేదు.

ఆమె అప్పుడు ఏంచెయ్యాలో తెలియని పరిస్థితిలో వుంది. తండ్రి పరిస్థితి ఎట్లా వుందో అని ఆదుర్దా.

వెళ్తే... భర్త తిరిగి రానీకపోతే? అదొక నామర్దా.

ఇప్పుడు వెళ్లడమా? సందిగ్ధంలో వుంది.

ఆ సమయంలో నేను వెళ్లాను... వాళ్లింటికి.

ఆమెని చూస్తే జాలేసింది. కోపం గూడా వచ్చింది నాకు.

"మగవాడికి ఆధిక్యం మీ ఆడవాళ్లే ఇస్తున్నారు. నీకేం తక్కువని అతడి కాళ్లావేళ్లా పడతావు? నువ్వతడి అర్ధాంగివి. ఉద్యోగం చేస్తున్నావు. ఈ ఇంట్లో అన్ని హక్కులూ నీకూ వున్నాయి. అతడు పొమ్మంటే చెల్లదు. నీ ఇష్టం నువ్వు ఎప్పుడైనా వెళ్లచ్చు. ఎప్పుడైనా రావచ్చు. కన్నతండ్రి చావు బతుకుల్లో వుంటే ఇంకా ఇవన్నీ ఆలోచిస్తూ కూచుంటావా? తల్లిని ఎటూ చూడలేకపోయావు. ఇదేనా నువ్వు నిన్ను కన్నవాళ్లకి చేసే ఉపకారం?"

నేనేం మాట్లాడుతున్నానో తెలీకుండానే ఇవన్నీ అనేశాను.

ఇంకా ఆలోచించలేదు రమ.

నాతోబాటు తనూ బయటికి వచ్చేసింది. భర్త ఆపాడు.

"నువ్వెళ్లావో- ఇంక నీకూ నాకూ ఏసంబంధమూ లేదు. ఈ ఇంటి గడప మళ్లీతొక్కడానికి వీల్లేదు. గుర్తించుకో" అన్నాడు. మాట్లాడలేదు రమ.

వచ్చెయ్యబోయింది.

ఆమె మౌనం ఇంకా రెచ్చగొట్టింది అతణ్ని. మా ఇద్దర్నీ కలిపి రకరకాలుగా తిట్టసాగాడు.

"ఆ సొమ్ములన్నీ ఇచ్చిపో" అన్నాడు.

"నేనివ్వను... ఇవన్నీ నువ్వు పెట్టినవి కావు. మావాళ్లు చేయించినవి"

"రక్తం కళ్లచూస్తానవి ఇవ్వకపోతే" మీదపడి వల్చుకోసాగాడు ఒకటొకటీ.

ఒకసారిగా విదిలించుకుంది రమ. ఆమెకీ అసహ్యంవేసింది.

తనే వంటిమీదున్న నగలన్నీ వలిచి ఇచ్చేసింది.

చేతిలోని సూట్‌కేస్ గూడా లాక్కొని మొహాన తలుపేశాడు ఆమె భర్త.

"రమా... ఎంత తెలివిగలదానివి నువ్వు? నువ్వెన్నుకున్న భర్త ఇట్లాంటివాడా? నీ ఛాయిస్ ఇంత తక్కువరకందా?" అన్నాను.

సమాధానంగా ఏడ్చింది.

మేము వెళ్లేటప్పటికే ఆమె తండ్రి మరణించాడు. గుండెలు పగిలేలా ఏడ్చింది రమ.

తల్లినీ, తండ్రినీ ఇద్దర్నీ కళ్లారా చూసుకోలేదు రమ ఆమె పెళ్లయ్యాక.

ఆమె భర్తకి నేనే టెలిగ్రాం ఇచ్చాను గూడా. అతడు రానేలేదు.

ఉత్తరమూ లేదు.

కబురూలేదు.

రమ ఒకర్తే కూతురు కావడంతో రమ తండ్రికున్న కొద్దిపాటి ఆస్తీ కూతురికే ఇచ్చింది. ఆ తరువాత కొన్నాళ్లకి రమ తనంతటతానే భర్త ఇంటికి వెళ్లేసరికి-

ఆమెకి అనుకోని పరిస్థితి ఎదురయింది.

ఆమె భర్త మరోపెళ్లి చేసుకున్నాడు. రమ గర్భవతి.

రమ పరిస్థితి వర్ణనాతీతం.

ఎంతో దయనీయంగా ఏడ్చింది.

కుమిలిపోయింది.

రమ ఇప్పుడు వంటరిది.

నేనేదో ఆవేశంగా అనబోయాను.

కానీ... రమ చెప్పింది విని హతాశుడనయ్యాను. రమ, ఆమె భర్త రహస్య వివాహం చేసుకున్నారు.

కాబట్టి రుజువులూ,

సాక్ష్యాలూ లేవు.

గుళ్లో పెళ్లి చేసుకున్నారు.

కనీసం రిజిస్టరు ఆఫీసుకయినా వెళ్లలేదా?

"లేదు"

అంతగా నమ్మింది ఆమె భర్తని.

ఆమెని నట్టేట ముంచాడు అతడు.

ఇట్లాంటివారు ఎందరో?!

కనీసం రమకి భుక్తికి లోటులేదు. ఉద్యోగం వుంది. ఆస్తివుంది.

నాకు పుట్టబోయే బిడ్డవున్నాడు... తోడు అంటుంది.

కానీ... రమ ఆస్తికోసం, ఆమెభర్త ఎప్పుడో మళ్లీవస్తాడని, మళ్లీ ఆమెని మభ్యపెట్టి ఉన్నదంతా కాజేస్తాడని నాకు తెలుసు.

ఆమెకు తెలుసు-

అయినా ఏమీ చెయ్యలేదు ఆమె.

ఏమీ అనలేదు గూడా.

మౌనంగా వుండిపోయింది.

నేను మెడ్రాసు వచ్చి అప్పటికే మూడునెలలు దాటాయి.

త్రివేండ్రం ప్రయాణమయ్యాను.

కేరళ రాష్ట్రం చూడటం నాకదే ప్రథమం. చాలా అందమయిన ప్రదేశం కేరళ. కొబ్బరిచెట్లు, పచ్చదనం అక్కడి ప్రత్యేకతలు. నేను త్రివేండ్రంలో మన ప్రొఫెసరుగారి తమ్ముడింట్లో వున్నాను.

వాళ్లు నన్ను ఎంతబాగా చూసుకున్నారంటే మాటల్లో వర్ణించలేను.

అది నాస్వంత ఇల్లే అయిపోయింది.

మా బాబాయి కూతురూ వాళ్లు అక్కడేవున్నారు చాలా ఏళ్లనించి. వాళ్లది సమిష్టి కుటుంబం. పెళ్లయినప్పట్నించీ అది ఉమ్మడి కుటుంబంలోనే వుంది.

అది చూసే ముచ్చటపడి మా బాబాయివాళ్ళు దానికా సంబంధం దూరమయినా చేశారు.

నేను వెళ్ళిన మూడు రోజులకి దాన్ని చూడ్డానికి వెళ్ళాను.

దానిపేరు మీనాక్షి.

మీనాక్షి, నేను ఒకీడువాళ్ళమే. చిన్నప్పుడు కలిసి ఆడుకునేవాళ్ళం.

స్కూలు చదువువరకు కలిసే చదువుకున్నాం. ఆ తరువాత నేను కాలేజీలో చేరాను. కొన్నాళ్ళకి దానికి పెళ్ళయింది.

నేను వెళ్ళేటప్పటికి మీనాక్షి వంటింట్లో పప్పు రుబ్బుతోంది.

నన్ను చూసి చెయ్యి కడుక్కుని వచ్చింది.

ఇద్దరం వాళ్ళ గదిలోకి వెళ్ళాం.

ఆ గది చిందరవందరగావుంది.

మంచం మీదున్న నానారకాల వస్తువులన్నీ ఒకపక్కగా జరిపి నన్ను "కూచోరా" అంది.

తనూ కూర్చుని "ఏమిటి విశేషాలు... అందరూ బావున్నారా? నువ్వేమిటి ఇంత హఠాత్తుగా వుత్తరం పత్తరం లేకుండా వూడిపడ్డావు? పెళ్ళి సంబంధమా లేక వుద్యోగం కోసమా? దొడ్డమ్మా-పెదనాన్న ఎట్లా వున్నారు?" గబగబా అడిగింది.

"అందరం బానేవున్నాం. అన్ని విషయాలూ చెప్తాను. ముందు నీ సంగతి చెప్పు" అన్నాను.

"ఆ నాసంగతి చూశావుగా? ఎంతసేపూ రుబ్బటాలూ, దంచడాలూ వండడాలూ, పెట్టడాలూ ఒక్క సరదాలేదు. మంచి చీర కట్టుకోడానికి కూడా టైములేదు.

ఒకళ్ళా ఇద్దరా పదిహేనుమంది వున్నాం ఈ ఇంట్లో. అందరికీ వండాలంటే మాటలా? అట్లాగే అన్నీ అనుకో! పిల్లలకో ఆట వస్తువు కొనుక్కోవాలంటే భయం... సందేహం. ఇంట్లో ఇంతమంది పిల్లలున్నారాయె కొంటే అందరికీ కొనాలి.

పండగొస్తే చీర కొనుక్కోవాలన్నా పడదు. ఏం చెప్తావులే మా సంగతి! ఏదన్నా కొంటే అందరికీ కొనాల్సిందే. ఈ విధంగా మేము డబ్బు దుబారా చేసుకుంటున్నాం. మా మరుదులేమో అప్పుడే సొంత ఇల్లు కట్టేసు కుంటున్నారు. మేముమాత్రం 'ఎక్కడున్నావే గొంగళీ అంటే వేసిన చోటే వున్నానే కంబళీ' అన్నట్టు వున్నాం. మాకే ఏదీలేదు. మేము సంపాదించేది ఉమ్మడి. వాళ్ళు తెచ్చుకునేది సొంతం. ఇవీ మా పాట్లు. చెప్తే చాటభారత మవుతుంది. కాఫీ తెస్తానుండు"

అంటూ వెళ్ళింది మీనాక్షి లోపలికి.

ఆమె మాట్లాడుతూ వుండగానే ఎవరెవరో చాలామంది ఒకరొకరే వచ్చి తొంగిచూసి 'ఎవరే వచ్చింది?' అనడగడం, మీనాక్షి "మా దొడ్డమ్మ కొడుకు మా పెదనాన్న గారబ్బాయి" అంటూ చెప్పడం జరిగింది.

అంతలో మా బావగారు మీనాక్షి భర్త వచ్చాడు.

"మీరా... ఎప్పుడొచ్చారు? మీనాక్షి చూసిందా? మీనా-మీనా" హడావిడిగా పిలిచాడు.

"ఓయ్ ...వస్తున్నా" అంటూ పలికింది మీనాక్షి.

"చూసిందిలెండి- కాఫీ తెస్తానని వెళ్ళంది".

"ఏమిటి చాలా బిజీగా వున్నారే?" అడిగాను.

"ఇవాళ ఆఫీసులో పనెక్కువగా వుండటంవల్ల ఇంతదాకావుండి వస్తున్నాను"

"ఏమిటి మీ ప్రోగ్రాం, రాత్రికి వుంటారా?" ఆయనే అడిగాడు మళ్ళీ.

"ప్రోగ్రాం ఏంలేదు. మీరేదంటే అదే నాకు. మీతో కాస్త పనికూడావుంది" అన్నాను.

"ఏమిటండీ అది?"

"ఉమ్మడి కుటుంబాలలోని సంబంధ బాంధవ్యాలు సాధక బాధకాలూ మీద రీసర్చ్ చేస్తున్నాను. మీరు నాకు వివరించి చెప్పాలి"

"ఓ... అట్లాగే"

ఆ రాత్రికి అక్కడే వుండిపోయాను.

వాళ్ళ పరిస్థితికి జాలేసింది.

మీనాక్షి పరిస్థితి మరీ కష్టం.

చిన్నాపెద్దా ముప్పయ్ విస్తళ్ళు వెయ్యాతియ్యా.

మగవాళ్ళంతా లేచాక ఆడవాళ్ళ భోజనం.

మళ్ళీ ఎంగిళ్ళు తియ్యడం, ఇల్లు కడుక్కోవడం- ఎడతెరిపిలేని పని.

మేము తొమ్మిదిన్నరా పదింటికి పక్కలమీద పడుకున్నాం.

మీనాక్షి పదకొండు గంటలకి పడుకోడానికి వచ్చింది.

ఈలోగా మా బావ నాకు ఉమ్మడి కుటుంబం గురించి క్లియర్ పిక్చర్ ఇచ్చేశాడు.

"సంబంధ బాంధవ్యాల విషయంలో బానే వుంటుంది ఉమ్మడి సంసారం.

కలిసి వుండటం, కష్టసుఖాలు కలిసి పంచుకోవడం, దేనికన్నా కలివిడిగా నిలబడటం, ఇంట్లో ఏపని వచ్చినా కలిసి నిర్వహించుకోవడం, ప్రేమ అభిమానం పెంపొందడం, మన అనే కలివిడి భావన పెరగడం, పిల్ల దగ్గిర్నించి మీరు వేరు-మేము వేరు అనే ఆలోచన లేకుండా మనమంతా

ఒకటే అనే భావనలోనే వుండటం.

ముఖ్యంగా పెళ్ళిపేరంటం పండగా లాంటివి వచ్చినప్పుడు పని నలుగురూ పంచుకుంటే సులువుగా అయిపోతుంది.

స్వార్థమనేది ప్రవేశించకుండావుంటే వుమ్మడి కుటుంబం నిజంగా చాలా సుఖవంతమైనది. నలుగురూ నాలుగు రాళ్ళు సంపాదించి తలో చెయ్యివేస్తే సంసార భారం తేలికవుతుంది.

అట్లాగే పనీను. నలుగురూ నాలుగు పనులు పంచుకుంటే అందరికీ తేలిక.

చీరలైనా, నగలైనా అంటే–నీనా భేదం లేకుండా వాడుకుంటే ఎప్పుడూ నిండుగానే వుండచ్చు.

అన్నదమ్ములు ఒక తల్లి పిల్లలు. వారి భార్యలు కూడా సొంత అక్క చెల్లెళ్ళలాగే ప్రేమా వాత్సల్యాలతో కలిసి వుంటే అశాంతికి తావేలేదు.

కానీ ఈ మారుతున్న సమాజంలో, కాలంలో మార్పులు అన్నిటిలోనూ సహజమే.

ఉమ్మడి కుటుంబంలోవున్న ప్లస్ పాయింట్లు అలావుంటే...

మైనస్ పాయింట్లు ఇవి-

ఎంత సంపాదించినా వ్యర్థమే. ఈ కుటుంబానికి ఎంతా చాలదు. డబ్బు ఇస్తూ వుంటే ఖర్చయిపోతూ వుంటుంది. కానీ అందరూ ఇస్తుంటే బానేవుంటుంది. 'నాది' అనే స్వార్థం లేకుండావుంటే.

ఇవ్వకపోయినా జరిగేవాళ్ళకి ఎటూ జరుగుతుంది. ఒక్కళ్ళే ఇవ్వాలంటే ఒక్కళ్ళే భరించాలంటే మాత్రం చాలా కష్టం. స్వార్థంగలవాళ్ళని చూస్తూంటే-ఒకోసారి ఎట్లాంటివాళ్ళకయినా నేనుమాత్రం ఇంతలా కష్టపడటం ఎందుకు ఈ కుటుంబంకోసం'' అనిపిస్తుంది కూడా.

పిల్లలు ఒకరకంగా అన్యాయమయిపోతారు.

ఈనాటి పిల్లలకి ముఖ్యంగా పూర్తి అటెన్షన్ వుండాలి. కావాలి కూడా. అందరికీ ఇప్పుడు ఒకళ్ళిద్దరే పిల్లలు. వాళ్ళిద్దరికీ లేదా ఒక్కరికీ తమదగ్గరున్నదంతా ఇచ్చి వాళ్ళతోనే వుండి అపురూపంగా పెంచుకుంటున్నారు ఇప్పటి తల్లిదండ్రులు!

ఈ ఉమ్మడి కుటుంబంలో అటెన్షన్ వుండదు పిల్లలకి. ఏదో తింటారు. ఏదో తిరుగుతారు. వాళ్ళ చదువుసంధ్యలు పట్టించుకోవాలన్నా వీలుకాదు. వాళ్ళకి డిసిప్లిన్, మానర్సు ఏవీ వుండవు.

ఆరోగ్యాలని పట్టించుకోవడం కూడా సాధ్యంకాదు. ఇంక అంటువ్యాధుల రోజులప్పుడు మరీకష్టం. ఒక్కళ్ళకి ఒక వ్యాధి అంటూ వచ్చిందా అందరికీ అది రావాల్సిందే.

చిన్నచిన్న జలుబులులాంటివి ఫరవాలేదు. కానీ జాండిస్, కోరింతదగ్గు లాంటివి అయితే చాలా కష్టం. నెలల తరబడి ఇల్లు ఆస్పత్రిలాగా అయిపోతుంది.

ఇంకోటి- ఎవరికి ఏవిధమైన కోపం వచ్చినా అది చూపించేది పిల్లలమీదేగా? తద్వారా పిల్లలు పెద్దవాళ్ళమధ్య నలిగిపోతుంటారు. ఒకవిధంగా బండబారిపోతారుగూడా!

ఒక్కొక్కసారి గారాబంకూడా ఎక్కువవుతుంది వాళ్ళకి.

పెద్దవాళ్ళతో సమంగా చర్చించడం, పెద్దవాళ్ళతో ఎదిరించి మాట్లాడటం, పెద్దల సమస్యలు చర్చించడం కూడా చేస్తుంటారు.

అంతేకాదు ఒకళ్ళమీద మరొకళ్ళకి చాడీలు చెప్పడం కూడా పరిపాటే!

ఒకళ్ళలో చెడ్డ అలవాటుంటే అది ఇంకోళ్ళకి అంటుకునే ప్రమాదం కూడా వుంది.

అనుకరణ అనేది పిల్లలకి అతి సహజం. అందులో పెద్దపిల్లలకి చిన్నపిల్లలమీద బాగా ఇన్ఫ్లుయన్సు వుంటుంది. ఇది ఒకవిధంగా మంచిగా మరొకవిధంగా చెడ్డగానూ పనిచేస్తూ వుంటుంది.

అన్నదమ్ముల మధ్య అభిమానాలు ఒకో సమయంలో తగ్గే ప్రమాదం కూడా లేకపోలేదు. భార్యల స్వార్థపు మాటలవల్ల స్వంత అన్నదమ్ములలోనే దోషం కనబడుతుంది. తద్వారా వైషమ్యాలూ ... పోట్లాటలు!

అవే చిలికిచిలికి గాలివానలవుతాయి. బద్ధ విరోధాలూ ఏర్పడతాయి!

ఇవన్నీ చూస్తుంటే తల్లిదండ్రులకి బాధ!




భార్యాభర్తలకి అనలు ప్రైవసీనే వుండదు. ముద్దుముచ్చటల మాట అటుంచి భార్యాభర్తలు ఫ్రీగా మాట్లాడుకోడానికి కూడా వీలుండదు. తలువులు చేరవేసినా సరే మా ముప్పైమంది జనాభాలో ఎవరో ఒకరు లోపలికి వచ్చేస్తారు అర్ధరాత్రయినాసరే!

సినిమాలు, షికార్లు వెళ్తే అంతా వెళ్లడమో లేకపోతే అసలే లేదు!

మాకంటూ ఏకాంతం దొరికేది మా అత్తగారింట్లోనే. ఇక్కడ ఇంపాజిబుల్. పేరుకే మాకంటూ ఒక గది వుంది అంతే" అన్నాడాయన.



నిజమే!

మీనాక్షి రాగానే నలుగురు పిల్లలు వచ్చి పక్కలు కిందవరుచుకుని పడుకున్నారు.

"వాళ్లరూములో?" అన్నాను తెల్లబోయి. ఇక్కడ బాగా గాలివస్తుంది అన్నారు వాళ్ళే. నిద్రవచ్చేదాకా వాళ్ళు గట్టిగా ఏదో మాట్లాడు కుంటూనే వున్నారు.

"ఇవన్నీ కష్టాలయ్యా ప్రవీణ్! లాభాలూవు న్నాయి. కానీ ఆ లాభాలు లేకపోయినా భరించగలంగానీ ఈ నష్టాలు, కష్టాలు భరించలేం"

ఆయన ముగించాడు.

మీనాక్షిని అడిగాను.

"మీ బావగారు చెప్పింది విన్నావుగా? ఇంక నేను చెప్పేదేంలేదు. ఒక్కటిమాత్రం చెప్తాను. ఇంకా కొన్నాళ్ళు నేనీ ఉమ్మడి కుటుంబంలో వుంటే నాకు పిచ్చెక్కినా లేక నేను అర్థాంత రంగా చచ్చిపోయినా ఆశ్చర్యంలేదు"

"ఛీ ఛీ ... అవేం మాటలు"

మందలించాం మేము.

"మీరు వేరుగా వుంటే హాయిగా వుండగ లరా?"

"అదేమో నేను చెప్పలేను. నాకు తెలీదు గూడా. ఇన్నేళ్లనించీ ఇట్లాగే జరిగిపోయింది"

"మీరు ముందుగా ఒకపని చెయ్యండి. నేను కేరళలో కొన్ని ముఖ్యమైన ప్రదేశాలు చూడాలనుకుంటున్నాను. మీరిద్దరూ కూడా నాతోబాటు రండి. మీరవి నాకు చూపించిన ట్లూ వుంటుంది. మనం కలిసి కొన్నాళ్ళు గడిపినట్లూ వుంటుంది. మీకది కొంచెం ఛేంజ్ గానూవుంటుంది- ముఖ్యంగా మీనాక్షికి. ఆత రువాత కొన్నాళ్లపాటు మీరు వేరుగానూ వుండి చూడండి. ఈ వూళ్ళో కాదనుకుంటే మీరు మరోవూరు ట్రాన్సరు చేయించుకోనూవచ్చు. దాంట్లోవున్న కష్టసుఖాలు తెలుసుకుంటే మంచిదేకదా?" అన్నాను నేను.

ఇద్దరూ ఆలోచించి చెప్తామన్నారు.

ఆ తరువాత నిద్రకుపక్రమించాం ... నాలో ఆలోచనలు

అన్నదమ్ములలోగూడా ద్వేషభావాలా?

ఇదేనా అనుబంధం?

★ ★ ★

ప్రియ ఇచ్చిన అడ్రసుప్రకారం డాక్టర రావుగారి ఇంటికి వెళ్లాను.

వెళ్ళాక తెలిసింది. ఆయన వంటరివాడని అసలు పెళ్ళిచేసుకోలేదట!

ఆయనా, ఆయన చెల్లెలు ఇద్దరే వుంటారు ఆవిడా పెళ్ళిచేసుకోలేదు.

ఆవిడ బ్యాంకులో ఆఫీసరు.

వాళ్లది పెద్ద కుటుంబం అట. తల్లీతండ్రి చిన్నప్పుడేపోయారు.

ఈ అన్నాచెల్లెళ్ళకి వయసు వ్యత్యాసం తక్కువ. వీళ్ళే కుటుంబానికి పెద్దవాళ్ళు.

ఆ తరువాత ఇంకా తోబుట్టువులున్నారట

అందులోనూ తల్లిదండ్రులు పోయే సమ యానికి మరీ చిన్నపిల్లలుగూడా వున్నారుట

వాళ్ళందర్నీ వీళ్ళే పెంచి పెద్దచేసి, చది వించి, పెళ్ళిళ్ళుచేసి, అందర్నీ ఒకింటివాళ్ళ నిచేసి వీళ్ళిద్దరూ వాళ్ళ బాధ్యత తీర్చుకునా రు. చివరికి వీళ్ళిద్దరే మిగిలిపోయారు.

ఆయన తను పెళ్ళిచేసుకుంటే తన సా ర్థంతో బాధ్యత సరిగ్గా నిర్వర్తించలేకపోతానని పెళ్ళిచేసుకోలేదు.

ఆవిడా అంతే అన్నకి అండగా నిలబ డింది.

ఇంట్లో ఆడతోడు లేకుండా ఏ కార్యాలు నడవవు.

అన్నీ నిర్వర్తించింది.

తనూ పెళ్ళిచేసుకోలేదు.

వాళ్ళ జీవితాల్ని ఒకరకంగా త్యాగంచేశా రని చెప్పవచ్చు.

ఇద్దరూ ఎవరికివారే ఇంకొకరికోసం పెళ్ళిచే సుకోకుండా వుండిపోయారు.

ఇద్దరికీ ఒకళ్ళంటే మరొకళ్లకి చాలా అభి మానం, ప్రేమ.

ఇద్దరిదీ ఒకేరకమైన మనస్తత్వం.

ఆయనకి దాదాపు రిటైరుమెంటు వయసు వచ్చేసింది. ఆవిడకి ఇంకా కొంత సర్వీసుంది వాళ్ళిద్దర్నీ చూస్తే అదోరకమైన పవిత్రభావం కలిగింది నాకు.

మిగిలిన పిల్లలకి మేమున్నాము అంటు




ెద్దదిక్కుగా నిలిచారు.

పెళ్ళిచేసుకుంటే ఆవిడ ఇల్లు ఆవిడది!

ఆయన యిల్లు ఆయనది!

ఎవరింట్లోనూ ఎవరూ పుట్టింట్లో వున్నంత స్వేచ్ఛగా వుండరు... వుండలేరు.

వీళ్ళు వాళ్ళ తోబుట్టువులకి ఆ లోటులే కుండా చేశారనిపించింది నాకు.

వాళ్ళెంతగా నచ్చారంటే రోజూ ఒకసారి వాళ్ళింటికి వెళ్ళేవాణ్ణి!

ఆ తరువాత మేము ఒకవారం కేరళ అంతా చుట్టివచ్చాం.

మీనాక్షి, ఆమె భర్త, నేనూను.

కోవలం బీచ్, అనంతపద్మనాభస్వామి గుడి చూశాం.

గురవాయూరు వెళ్ళివచ్చాం. అది చాలా మహిమగల పుణ్యక్షేత్రం అంటారు. చాలా సుందరక్షేత్రం. మీనాక్షి తేరుకుంది ఈ ట్రిప్‌తో.

ఆమెకి వీలున్నప్పుడల్లా ఇట్లా ఊళ్ళు చూపించడం, ఆమెతో ఎక్కువటైము స్పెండ్‌చెయ్యడం చేస్తూవుంటే మీనాక్షి సంతోషంగా వుండగలదని బావగారితో అంటే ఆయన ఒప్పుకున్నాడు.

వీలుంటే వేరేచోట ఉద్యోగప్రయత్నం చేస్తానన్నాడు. మీనాక్షి చాలా రిలీఫ్ పొందింది.

★ ★ ★

కరుణ కథ వింటే ఏమిటీ సంబంధ బాంధవ్యాలు అనిపించకమానదు.

కరుణ ఎంతో కష్టపడి శ్రద్ధగా చదివి పైకివచ్చింది. చదువుతప్ప మరే లోకమూ లేదు. ఎం.ఎస్.సి. పాసయి పి.హెచ్‌డి. కూడా చేసింది.

మంచి ఉద్యోగం వచ్చిందామెకి.

పెద్ద జీతం, హోదా!

కరుణకి ఉద్యోగం వచ్చిన కొన్నాళ్ళకే ఆమె తండ్రి రిటైరయ్యాడు.

కూతురి జీతం మీదే ఆధారం... ఎక్కువ. ఆయనకి పెన్షన్ వచ్చినాకూతురి జీతం లేకపోతే గడిచేది కాదు. ఎన్నోరకాల భోగాలకి అలవాటయిన వాళ్ళజీవితాలు ఆభోగాలు లేకపోతే ఎట్లా అనిపించేంత వరకూ వచ్చాయి. కష్టపడి సుఖపడడం తేలిక. కానీ, సుఖపడి కష్టపడడం వుందే, అది మహాకష్టం.

కరుణ జీతం మీద ఆధారపడి బతకడం అలవాటయిన వాళ్ళకి ఆకూతురు పెళ్ళిచేసుకుని వెళ్ళిపోతే తమ జీవనాధారం ఎట్లా అనే ఆలోచనే.

అందుకే వాళ్ళు సంబంధాలు కూడా చూడలేదు కరుణకి. ఆసంగతి గ్రహించుకోలేకపోయింది కరుణ.

వాళ్ళనాన్న ఆమె పెళ్ళి గురించి, సంబంధాలు వెతుకుతున్నట్లే ఉండేవాడు. ఏదన్నా సంబంధం కుదిరేలాగా వుంటే తనకు తెలీకుండానే సృష్టించుకున్న ఏవో కుంటిసాకులు పెట్టేవాడు.

మళ్ళీ కుదరలేదని బాధ పడేవాడు!

చివరికి ఆమెకి తనకొలీగ్‌తో పరిచయమై అదిప్రేమగా మారి పెళ్ళివరకూ దారితీసింది. ఆసంబంధం అన్నివిధాలా అనుకూలమైనదవడంతో కరుణ తల్లిదండ్రులకిది అనుకోనిదయినా ఏమీఅనలేకపోయారు. సగం సంతోషంగా, సగం అయిష్టంగా అక్షింతలు వెయ్యక తప్పలేదు వారికి.

కానీ... అల్లుడంటే మాత్రం వారికి గిట్టదు. అతడంటే కోపంగా వుండేవాళ్ళు.

ఎప్పుడే అదను దొరికినా కూతురికి అల్లుడి గురించి వ్యతిరేకంగా చెప్పేవారు.

మొదట్లో అట్లాచెప్పే తల్లిదండ్రులమీద కోపగించుకునేది. ఎదిరించి మాట్లాడేది. తల్లిదండ్రుల దగ్గిరకే వచ్చేదికాదు. వాళ్ళనీ రానిచ్చేదికాదు కరుణ.

అయినా వాళ్ళు తమ ప్రయత్నం మానలేదు. వినగా వినగా వాళ్ళమాటలు చెవినబడ్డాయి, మనసుకెక్కాయి. భర్త ప్రవర్తనలో లోపాలెన్నడం ప్రారంభించింది కరుణ కూడా.

తల్లిదండ్రులు చెప్పేవి నిజాలుగా అనిపించసాగాయి. క్రమేణా ఆమె మనసు తనకు తెలియకుండానే మార్పు చెందసాగింది.

ఆఫీసునుంచి ఆలస్యంగా రావడం, సిగరెట్టు కాల్చడం కూడా ఘోరావరాధాలుగా కనిపించసాగాయి ఆమెకి.

ఎప్పుడూ ఎదిరిస్తూ, సాధిస్తూ ఎందుకో దెప్పుతూ వుండటం ప్రారంభించింది.

ఆమె మనసు క్రమేణా అతడిఎడల ద్వేషంతో నిండిపోయింది.

ఎక్కువ పుట్టింట్లోనే వుండటం ప్రారంభించింది.

భర్త వచ్చినా సరిగా మాట్లాడేదికాదు. భర్త రమ్మంటే తల్లిదండ్రులతో కలిసి వెళ్ళేది.

అతడింకా ఇరిటేట్ అయ్యేటట్లు ప్రవర్తించేది.

ఎంతో మంచివాడు, సాధుస్వభావుడైన ఆమెభర్తకీ క్రమంగా మనసు విరిగిపోయింది.

భార్యాభర్తలు విడిపోయారు.

ఇంక ఆమె జీతం అంతా పుట్టింటివారిదే.

ఆమెకు చాలాకాలానికిగానీ తను చేసిన తప్పిదం, తనకి జరిగిన అన్యాయం, తనవాళ్ళే తనని అగాధంలోకి లాగారన్న సత్యం తెలిసిరాలేదు.

ఆమె ఉద్యోగంలో ఇంకా పైస్థాయికి చేరుకుంది. తల్లిదండ్రులు వాళ్ళ అవసరాలన్నీ తీర్చుకున్నారు.

తమ్ముళ్ళకి చదువులు, చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళు, ఇల్లు వాకిలీ అన్నీ ఏర్పడ్డాయి.

తమ్ముళ్ళూ ఉద్యోగాల్లోకి వచ్చారు.

తల్లిదండ్రులు ఇంక ఈమెని లోకువచేసి మాట్లాడడం ప్రారంభించారు.

అన్నదమ్ములు సరేసరి.

అంతాకలిసి తేల్చింది, తెలివితక్కువగా పొగరుమోతుదనంతో భర్తని వదిలేసి సంసారం పాడుచేసుకుంది అని.

చేజేతులా బతుకులో నిప్పులుపోసుకుంది అని!

అప్పుడామెకి తెలిసివచ్చింది తన తప్పిదం. జ్ఞానోదయమైంది.

వేరుగా ఒక్కత్తే వుండసాగింది. పశ్చాత్తాపపడసాగింది.

అట్లా కొన్నాళ్ళు గడిచాయి.

అతడి మంచిదనాన్ని వెనకటి జీవితాన్ని తల్చుకుంటూ కుమిలిపోసాగింది.

కొన్నాళ్లకి ధైర్యం తెచ్చుకొని అతడికి ఉత్తరాలు రాయడం ప్రారంభించింది.

కానీ, అవి అతడు చదివాడో, చించిపారేశాడోకానీ, జవాబు రాయలేదు.

ఒకటిరెండు సార్లు కలుసుకోవాలని ప్రయత్నించింది, పడలేదు.

అంతలోనే అదృష్టంవలన, దూరంగా వెళ్లిపోయిన అతడు, ట్రాన్స్‌ఫర్ అయి మళ్లీ అదేఊరు వచ్చాడని తెల్సింది.

ప్రస్తుతం అతడి తల్లి అతడితో ఉంటోందిట.

నాతో కరుణ ఈ విషయాలన్నీ చెప్పి నాసహాయం కోరింది.

ప్రధమ ప్రయత్నంగా, కరుణ భర్త కమలాకర్ ఆఫీసుకి వెళ్లాను.

అతడిని కలవడం పడలేదుగానీ, ఆఫీసులో వాళ్ల అభిప్రాయం ప్రకారం-

ఆయన డైవోర్సీ. మళ్లీ పెళ్లి చేసుకునే ప్రయత్నంలో ఉన్నట్లుగా తెలిసింది.

విషయం విన్న నాకే కంగారేసింది. ఇంక కరుణ విషయం సరేసరి.

అదేపనిగా ఏడుస్తూ దాదాపు నాకాళ్లు పట్టుకుంది.

ఏమైనాసరే చేసి, తన కాపురం నిలబెట్టమంది.

నువ్వు నా తమ్ముడిలాంటివాడివంది. అంతకంటే ఎక్కువ అంది. నదిలో మునిగిపోతున్నవాడికి, ఏ గడ్డిపోచ దొరికినా, దాని సహాయంతో ఒడ్డికి చేరాలని చూడటం సహజం.

ఆమెను చూసి చాలా జాలేసింది నాకయితే.

ముందుగా అతణ్ని కలిసి చూద్దామనుకున్నాను.

అప్పటికే వాళ్లు విడిపోయి పదేళ్లపైనయింది. అసలింతదాకా ఇంకోపెళ్లి చేసుకోకుండా ఉండటం కరుణ అదృష్టమేనేమో!

నేను చాలాసార్లు ప్రయత్నించాక, కమలాకర్ని కలవ గలిగాను.

నిజంగానే కమలాకర్ చాలా ఉత్తముడు. ఒక్క చెడ్డ అలవాటూలేదు.

సాధుస్వభావం, మిత భాషి.

మొహమాటస్తుడు. మంచి స్నేహితుడు. ఇట్లాంటి వాడు భర్తగావడం కరుణకేగాదు, ఏ ఆడపిల్లకైనా అదృష్టమనే అనాలి.

మొదటిసారి మీటయినప్పుడు ఆ టాపిక్ ఎట్లా ఎత్తాలో నాకే అర్థంకాలేదు. అవకాశమియ్యలేదతడు. నేను పట్టువిడవలేదు. మళ్లీ వెళ్లాను. ఇంకోసారి ఇంటికెళ్లాను.

అప్పుడెత్తాను కరుణ విషయం.

అంత ఉత్తముడైన అతడు ఆమె పేరెత్తితేనే మండిపడ్డాడు.

ఆ సంగతి వదిలెయ్యమన్నాడు.

నేనేం మాట్లాడినా వినలేదు.

మరోసారి, మరోసారి. నేను ప్రయత్నం కొనసాగిస్తూనే ఉన్నాను.

కరుణ అంతరంగం చెప్పాను.

మీరు కలిసి ఉండాలన్నాను.

తప్పు అంతా ఆమెది కాదన్నాను. ఆమె తల్లిదండ్రుల స్వార్థం ఆమెని తప్పుదోవపట్టించిందన్నాను.'ఆమె వివేక శూన్యురాలయింది. ఇప్పుడు తెలుసుకుంది. ఆమె తన వాళ్లందర్నీ దూరం చేసుకుని మీకోసమే నిరీక్షిస్తోంది' అని అనేక విధాలుగా, అనేక మార్లు చెప్పాను.

ఒకసారి కరుణ కూడా నాతోవచ్చింది.

అతడామెని అనేక పరుషోక్తులాడాడు.

ఆమె దీనంగా ఏడ్చింది తప్ప పల్లెత్తి మాటఅనలేదు.

వంచిన తలెత్తలేదు.

నేను ఎంతో నచ్చచెప్పి, ఆమె పరిస్థితి వివరించి, అతడు స్వీకరించకపోతే ఆమె ఆత్మహత్య చేసుకుంటుందని చెప్పాను.

అయినా అతడు చలించలేదు.

కానీ, కాస్త తగ్గాడు.

ఆ తరువాత నే వెళ్లినప్పుడు, కరుణ గురించి మాట్లాడినా వినేవాడు తప్ప, ఏమీ అనేవాడు కాదు.

అంతలో ఒక్కటి తెలిసింది.

అతడు మళ్లీ పెళ్లి చేసుకునే విషయం నిజంకాదు ఎవరో కల్పించారని.

కరుణ, నేను కూడా తేలిగ్గా ఊపిరిపీల్చుకున్నాం.

రెండు మూడుసార్లు కరుణని నేనే తీసుకెళ్లాను అతడి దగ్గిరికి.

వాళ్లిద్దర్నీ వదిలి, నేను పనిమీద వెళ్లిపోయేవాణ్ని. ఆ తరువాత కరుణతో చెప్పాను. వీలున్నప్పుడల్లా అతణ్ని కలుసుకుంటూ ఉండమని.

అట్లా ఈమెతో మాట్లాడుతూవుంటే ఈమె మారిన విషయం అతడికీ తెలుస్తుంది అని నా ఉద్దేశం.

చివరికెట్లాగయితేనేం, అతడు కలిసివుండే విషయం ఆలోచిస్తానన్నాడు.

సుముఖుడవుతున్నాడు.

అది చాలునాకు.

ఇక కరుణ ఆనందం అంతాఇంతాకాదు. సంతోషంతో నాచేతులు పట్టుకుని ఏడ్చేసింది. మన భారతీయ సంప్రదాయం ప్రకారం వివాహమంటే నూరేళ్లపంట.

విడాకులతో భార్యాభర్తలు ఒకరికొకరు కాకుండా పోతారా? కాదు కానేకాదు.

కరుణ కథవింటే, తల్లిదండ్రుల పిల్లల అనుబంధాలు ఎటువంటివి- అనే ఆలోచన రాకుండా ఉండదు.




పార్వతి కథ ఇంకా దయనీయం.

పార్వతికి చాలా చిన్నప్పుడే పెళ్లయింది. ఇష్టాయిష్టాలంటే ఏమిటో తెలియనంతవయసది. అయినా ఆమె భర్తని అమితంగా ప్రేమించింది. ఆరాధించింది. భర్త శంకర్రావు కూడా మంచివాడే. ఇద్దరూ కలిసి ఆడు

కుంటూ, పాడుకుంటూనే పెద్దవారయ్యారు.

వాళ్లది చాలా అందమైన, అన్యోన్యమైన జంట అని అందరూ అనుకునేవారు. పేర్లూ అట్లాగే కలిశాయి.

వాళ్లకి ఒక్కటేలోటు. పిల్లలులేరు. పిల్లలు లేకపోవడం నిజంగాకొరతే, తీరనిలోటే. మానసిక బాధే. అది వాళ్లకే తెలుస్తుంది. కానీ మన సంఘంలో మగవాడిని ఎప్పుడూ గొప్పవాడిగానే భావిస్తారు. లోటులు, లోపాలు, లోకులు ఆడదానివేనంటారు. తల్లి కాలేకపోయాననే బాధ వుండనేఉంది పార్వతికి. పైన, చుట్టాలు, స్నేహితులు, చుట్టుపక్కలవాళ్ల దెప్పులు, హేళనలు, పరాచికాలు ఇంకా బాధపెట్టేవి. చిత్రహింస పడేదామె. నలుగుర్లోకి వెళ్లాలంటే, తప్పుచేసినట్లుగా ఫీలయ్యేది. వాళ్లూ అట్లాగే చూసేవాళ్లు.

గొడ్రాలనే ముద్ర పడిపోయింది.

మొదట సానుభూతి -- తరువాత హేళన -- ఆ తరువాత దెప్పుడు -- ఆ తరువాత సాధింపు -- చివరి అంకం తిట్లు -- తనవారినించి పరిపాటయ్యాయి ముఖ్యంగా అత్తగారి ఆరళ్లు అసలు భరించలేకపోతోంది పార్వతి.

తెల్లవారిన దగ్గర్నించి ప్రతిదానికీ -- ఒక్క కొడుకు వంశం -- అంటూ తిట్లే.

అన్నంకూడా తినకుండా చాకిరీచేసి చేసి ఏడుస్తూ పడుకునేది పార్వతి.

రానురాను ఆమెని ఇంకా కోసేమాటలు -- 'మళ్లీపెళ్లి' గురించి మాట్లాడేది అత్తగారు.

శంకర్రావు దేనికీ నోరెత్తేవాడుకాదు. ఎంత ఏడ్చినా చూస్తూ వూరుకుండేవాడు తప్ప ఏమీ మాట్లాడేవాడుకాదు.

ఆ మౌనం వూతగా తీసుకుని పార్వతి అత్తగారు ఒక్కొక్కమెట్టే పైకెక్కసాగింది.

చివరికి మళ్లీ పెళ్లి విషయం మాటలేకాదు -- చేతలవరకూ వెళ్లింది.

సంబంధాలు రాసాగాయి

పార్వతి ఏడ్చినా, మొత్తుకున్నా, బెదిరించినా, ఎదిరించినా -- ఆమెని సపోర్టుచేసేవాళ్లే లేకపోయారు. చుట్టుపక్కలవాళ్లూ ఆఖరికి పుట్టింటివాళ్లుగూడా ఒకటేమాట.

'అవునుమరి వంశం నిలవద్దూ?'

'కోడలేమో గొడ్రాలాయె -- ఏం చేస్తారు?'

చివరికి శంకర్రావు మరో పెళ్లిచేసేసుకున్నాడు.

పార్వతి అన్నీ చూస్తూ కుళ్లుతూ కుములుతూ చాకిరీ చేస్తూ వుండిపోవాల్సి వచ్చింది.

అట్లా వుండిపోయినందువల్లే బంధువర్గమంతా మెచ్చి మేకతోలు కప్పుతున్నారు.

ఇప్పుడందరికీ పార్వతంటే జాలి!

కావల్సినంత సానుభూతి చూపుతున్నారు. గుండెని కోసేస్తున్న బాధ క్షణక్షణమూ అనుభవిస్తూ అట్లాగే బతుకుతోంది పార్వతి.

ఎముకలమీద చర్మం కప్పినట్లుంది పార్వతి. మొదటిసారి వెళ్లినప్పుడు ఆమె బాధ పరిస్థితి నేనేచూడలేక ఎక్కువసేపు వుండలేకపోయాను.

మళ్లీ ఇంకోసారి వెళ్లినప్పుడు ఎందుకో ఏడుస్తోందామె!

ఆమె బతుకంతా ఏడుపే అయినప్పుడు -- ఇంక కళ్లనీళ్లే లేవామెకి. అనుకున్నారందరు!

తడి ఆరిపోయిన గుంటలే ఆ కళ్లు అనిపించింది నాకయితే

కానీ ఇప్పుడా కళ్లనిండా నీళ్లే!

మౌనంగా వెళ్లాను నేను.

"రారా ప్రవీణ్... ఎన్నాళ్లకి వచ్చావు ఆరోజు మళ్లీ వస్తానని చెప్పినవాడివి ఇన్నాళ్లకి కనబడుతున్నావా?"

నిష్ఠూరంగా అంది.

అంతలోనే ముఖంలోకి నవ్వు వచ్చేసింది

అంతకుముందులేని ఏదో కళ కనబడింది నాకామె నవ్వు ముఖంలో.

ఏమిటో ఆ కళమరి? దాని అర్థమేమిటో అని ఆలోచిస్తూ "బాగున్నావా పార్వతీ..." అన్నాను.

"బానేవున్నాలే" నవ్వింది.

మళ్లీ కళ్లల్లో నీళ్లు.

"ఏమిటి... ఎందుకు?"

"ప్రవీణ్... నువ్వొక్కడివే నాకాత్మీయుడివి

నిన్ను చూస్తే నాకు ఆనందంతో ఏడుపేవ స్తుంది''

ఎంత తుడుచుకున్నా కన్నీళ్లు కారుతూనే వున్నాయి.

పార్వతి వాళ్లు, మేము పక్కపక్క ఇళ్లవా ళ్లం.– కలిసి ఆడుకునేవాళ్లం చిన్నప్పుడే ఎంతో అందంగా ఆకర్షణీయంగావుండేది పార్వతి. ''ఏమిటి ఏమయింది నాతో చెప్పు''

''నాకు చచ్చిపోవాలని వుంది'' మళ్లీ ఏడ్చింది. ఇన్నాళ్లూ జీవచ్ఛవంలాగావున్న ఆమె... ఇప్పుడేమిటీ విపరీతం?

''అదేమిటి... ఛీ... తప్పుకదూ!''

''అంతకంటే నన్నేంచెయ్యమంటావు? ఈ నరకం ఇంక నేను భరించలేను. మా అమ్మా నాన్నా చిన్నప్పుడే నాకు పెళ్లిచేశారు. అప్ప ట్నించీ ఈయన్నే నమ్ముకున్నానా? దానివల్ల నాకేం ఒరిగింది? నేనేం సుఖపడ్డాను? నాకు పిల్లలులేకపోవడం నా తప్పా? నేను చేసిన పాపమా? మా అత్తగారు ఆడించినట్టల్లా ఆడా రు ఈయన! ఆ జాహ్నవిని కట్టుకున్నారు. అది... అదిప్పుడు రాణీ. ఇప్పుడు తెలుస్తోంది తల్లీకొడుకులకి. ఆ జాహ్నవి ఇంటికి వచ్చిన పుట్నించీ ప్రతిక్షణం ప్రతిక్షణం ఎంత రంప పుకోత అనుభవించానో అనుభవిస్తున్నానో నాకు తెలుసు... నాకే తెలుసు'' గుండెల మీద కొట్టుకుంది. పిచ్చిదానిలాగా అరిచింది.

''భర్త పరస్త్రీని గురించి ఆలోచిస్తేనే తట్టుకో లేదు స్త్రీ, అందులోనూ భారత స్త్రీ! అట్లాంటిది నా విషయం చూడు వాళ్ల విహారాలు వాహ్యాళు లు సరసాలు – అన్నీ నాముందే! ఇవి భరించడం రోజురోజుకీ దుర్భరమయిపో తోంది. ఏదో ఆవేదన, ఏదో బాధ! ఇంతకంటే చావే నయమేమో?''

''ప్రవీణ్... నాకెందుకో... నాకెందుకో పిచ్చి కోపం వచ్చి ఒక్కొక్కప్పుడు వీళ్లిద్దర్నీ హత్యా చేసి నేను చావాలనిపిస్తుంది'' ఆయాసం ఆవేశంతో వూగిపోతోంది పార్వతి

''మరీ ఈమధ్య ఈ ఆవేదన భరించలేకపో తున్నాను. నేను ఇక్కణ్నించి వెళ్లిపోవాలను కుంటున్నాను. నువ్వు నన్ను హైదరాబా దు తీసుకెళ్తావా? నాకు సహాయం చేస్తావా? చేస్తావుకదూ...? ఏ ఆశ్రమంలోనో చేర్పిస్తావా? లేకపోతే మగవాళ్లలాగే తాగుడలవాటు చేసు కోనా? దాంతో మనశ్శాంతి అయినా వస్తుంది టగా... మన బాధలు మర్చిపోవచ్చుటగా....?''

''పా-ర్వతీ'' గట్టిగా అరిచాను.

నా అరుపుకామె విరగబడి నవ్వింది.

'ఈమెకి మతిచలించలేదుకదా?' అని పించింది.

''భయపడకు... నాకేంకాలేదు. నేను మొండిదాన్ని – నీకు తెలుసా – మొండివాళ్లకి చావుకూడా రాదు''

నేను చూస్తూ వుండిపోయానామెని.

ఎన్ని శతాబ్దాలు ఎన్నిఏళ్లు ఎన్నియుగాల యినా నేటికీ స్త్రీస్థితి ఇంతేనా? దయనీయ మేనా? మనమేమీ చెయ్యలేమా? చేయూత నీయలేమా? ఆమె కన్నీరు తుడవలేమా?

ఏదో ఏదో చెయ్యాలి – అంది నా అంత రంగం! మళ్లీ పార్వతే అంది – ''ప్రవీణ్ నా సమస్య ఏమిటో ఇప్పుడు నీకే చెప్పాలి! నా మొగుడున్నాడే... నా మొగుడు రెండో పెళ్లి ఎందుకు చేసుకున్నాడు? నాకు పిల్లలు లేరని కదూ? ప్రవీణ్... మరే...ఇవాళ పెద్ద పార్టీ ఏర్పాటు చెయ్యాలనుకుంటున్నాను. నువ్వా వుంటావా?''

''ఏమిటి పార్వతీ... ఒకదానికి మరొకదానికీ పొంతనలేకుండా మాట్లాడుతున్నావు?''

''చెప్పేది విను... ఆ పార్టీలో ఒక ప్రకటన చేస్తాను- వింటున్నావా? నేను... నేను... ఇప్పు డు గర్భవతిని ప్రవీణ్! ఆయనకి మా ఆయన కి నేను సంతానాన్నిస్తున్నాను. ఇంక ఆవి డెందుకు? ఆవిడకి విడాకులివ్వమంటాను. నేను పడ్డబాధ అదీ పడాలి. దానికి ఈయన విడాకులిచ్చితీరాలి''

అరవసాగింది పార్వతి.

''పార్వతీ... నీమనసు బాగాలేదు. నువ్వు కాసేపు రెస్టు తీసుకో''

నేను మేడమీదికి వెళ్ళి ఆమె భర్తని పిలు చుకుని వచ్చాను.

ఆయన వెనకే జాహ్నవీ దిగివచ్చింది. గబు క్కున లేచింది పార్వతి.

"నేను గొడ్రాలినని దీన్ని చేసుకున్నారుకదూ? నేను గొడ్రాలినికాదు. కాదండీ... నేను గొడ్రాలిని కాదు"

భోరున ఏడ్చింది.

నాక్కూడా కళ్ళు చెమర్చాయి.

శంకర్రావు ముఖంలో నెత్తురుచుక్కలేదు. పార్వతి బాధ అతడికీ తెలుసు.

అతడు పశ్చాత్తాపపడుతున్నాడు.

వెంటనే వెళ్లి డాక్టరుని తీసుకొచ్చాడు.

డాక్టరు ఆమెని పరీక్షించి చెప్పింది ఆమె గర్భవతేనని!

నిద్రకి ఇంజక్షనిచ్చింది.

ఆమె చాలా మానసిక వత్తిడికి లోనవుతోంది. అది లేకుండా చూసుకోవాలనీ అదీగాక బ్లైడ్‌ప్రెషరూ, దానివల్ల బలహీనత వున్నాయనీ, ఎంతో జాగ్రత్తగా ఇప్పట్నుంచే చూసుకోకపోతే ముందుముందు మరీ ప్రమాదమవొచ్చనీ డాక్టరు శంకర్రావుని హెచ్చరించింది.

కొన్ని మందులు రాసిచ్చి మంచి భోజనం, నిద్ర ముఖ్యమని చెప్పింది.

ఆమె వెళ్లాక డీలాపడిపోయిన ఆమె భర్తతో నేనన్నాను "జరిగిపోయినదానికి ఇప్పుడెంత విచారించినా లాభంలేదు. పార్వతికి సవతిపోరు జీవితాంతమూ వుండేదే! బిడ్డ పుట్టాక ఆమె పరిస్థితిలో మార్పుండవచ్చు. ఇప్పుడు కనీసం తాత్కాలిక ఉపశమనం కలిగించడం మన బాధ్యత! ఆమె కొంచెం కోలుకునేదాకా మీరొక పని చెయ్యాలి! జాహ్నవిని పిల్లలతో పుట్టింటికి పంపించి- ఆమెకి పూర్తి ప్రేమనీ, విశ్వాసాన్నీ అభిమానాన్నీ అనురాగాన్నీ అందివ్వమనీ, బతుకంటే ఆశ కలిగించమనీ" చెప్పాను.

అతడు తలవూపాడు.

భార్యాభర్తల అనుబంధం ఎంత సున్నితమైందో అంత గట్టిదికూడాను.

ఆమె అతణ్ని ప్రేమిస్తోంది... ఆరాధిస్తోంది. అతడు మరో స్త్రీతో వుంటే చూడలేదు. అతడికి దగ్గిరగా వుండలేదు, దూరమూ కాలేదు.

పరిశీలిస్తే ఈ సృష్టిలో ఎన్నోరకాల జీవిత సంబంధాలు-

ఏ సంబంధమున్నా మానవత్వానికి లొంగిపోతుంది.

★ ★ ★

లక్ష్మి, లక్ష్మణ్ ఆదర్శవంతమైన జంట. ఇద్దరూ విదేశాలకు వెళ్లివచ్చినవాళ్ళు. విదేశీ నాగరికత ప్రభావం వారిమీద వుందని పిస్తుంది. కానీ అది మంచికే వుంది.

వాళ్లిద్దరి భాషలూ వేరు-

కులాలు వేరు-

మతాలూ వేరు-

ఇద్దరికీ పరిచయం చిత్రంగానే అయింది.

లక్ష్మి ఒక చిత్రకారిణి. లక్ష్మణ్ భావుకుడు. లక్ష్మి హిందువు. లక్ష్మణ్ క్రిస్టియన్. లక్ష్మణ్ తల్లిదండ్రులు రామాయణం విని, అందులో లక్ష్మణుడి పాత్ర నచ్చి తమ కొడుక్కి పెట్టుకున్నారా పేరు.

దాంతోనే తెలుస్తుంది వాళ్లది ఎంత సంస్కారవంతమైన కుటుంబమో!

లక్ష్మణ్ చిన్నతనంనించీ కూడా భావకవిత్వం చెప్పడం ప్రారంభించాడు.

లక్ష్మి చిత్రకారిణి. చదువుతోబాటు చిత్రలేఖనం కూడా ప్రత్యేకంగా నేర్చుకుంది. కళాకారులు ఎక్కడేది చూసినా చూసి వదిలెయ్యరు. హృదయంలో పదిలంగా దాచుకుంటారు. తమ కళలో వారు చూసింది ప్రతిబింబింపజేస్తారు.

లక్ష్మి ఆవిధంగా ఒకసారి తను ఇంగ్లండులో వుండగా ఒక పండగనాడు 'సెంట్ పాల్స్ కెథీడ్రిల్'కి వెళ్లింది.

మామూలుగా ప్రతి పండగకీ గుడికి వెళ్లడం లక్ష్మి కుటుంబంలో అలవాటు. ఆ పండగనాడు అదీ గుడే కాబట్టి చర్చికి వెళ్లింది లక్ష్మి.

ఇంగ్లండ్ ప్రిన్స్ చార్లెస్, లేడీ డయానాల పెళ్లి జరిగింది అక్కడే. దాన్ని గురించి ఎన్నిసార్లో విన్నది. ఫొటోల్లో చూసింది.

రోడ్డుమీదనుంచి పైకి చూస్తే అది ఎంత అందమైన కట్టడం అనిపించకమానదు. మెట్లెక్కి పైకివెళ్తే విశాలమైన ప్రాకారాలతో కన్నులపండువగా వుంటుంది. కిటికీలకి రంగుటద్దాలు. గోడలమీద బైబిల్ గాథలు పెద్దపెద్ద కొవ్వొత్తుల స్టాండులు అంతస్తులు

అంతస్థులుగా కూర్చునే స్థలాలు. నేలంతా కార్పెట్‌తో కప్పబడి వుంటుంది.

ఏసుక్రీస్తు' శిలువ చూస్తుంటే భక్తిభావంతో కళ్లల్లో నీళ్లు తిరిగాయి లక్ష్మికి.

మైకులో ప్రేయర్ జరుగుతుంది అని అనౌన్సు చేశారు. అందరితోబాటుగా తనూ లేచి నిల్చుంది లక్ష్మి. ప్రార్ధన జరిగినంతసేపు కళ్ళు మూసుకుని నిలబడింది. కళ్లు తెరిచాక తనపక్కన నిల్చున్న ఇండియన్‌ని చూసింది లక్ష్మి అతడే లక్ష్మణ్.

ఆతరువాత ఆ సంఘటనని తన కవిత్వంతో లక్ష్మణ్ నింపితే-



చిత్రరూపంలో చిరస్థాయి చేసింది లక్ష్మి. లక్ష్మణ్ కేంబ్రిడ్జి యూనివర్సిటీలో చదువుతు న్నాడు. లక్ష్మి విజిటరుగా వచ్చింది ఇంగ్లండు. వాళ్ళిద్దరూ తమకి తెలియకుండానే స్నేహితు లైపోయారు. వీలైనప్పుడల్లా కలిసేవారు. లండనంతా తిప్పి చూపించాడు లక్ష్మణ్. బిగ్ బెన్, థేమ్స్ రివర్, లండన్ బ్రిడ్జి, టవర్ బ్రిడ్జి, మేడమ్ ట్యుసాడ్స్, బకింగ్‌హామ్ పాలెస్, పార్ల మెంటు హౌస్ అన్నీ కలిసే తిరిగారు.

కేంబ్రిడ్జి యూనివర్సిటీ కాంపస్ చాలా నచ్చింది లక్ష్మికి. ఒకే ప్రాంతంలో వివిధ కాలేజీలు, ఆ బిల్డింగ్‌లూ, లాన్‌లూ, చెట్లూ, గార్డెన్లూ, చర్చిలూ, లైబ్రరీలూ ఎంతో బావు న్నాయి. అక్కడికి వస్తేనే చదువుమీద శ్రద్ధ వచ్చేస్తుందేమోననిపించింది లక్ష్మికి.

ఒక వారాంతం ఆక్స్‌ఫర్డ్, మరో వారాంతం 'స్ట్రాట్‌ఫర్డ్ అపాన్ ఏవాన్' వెళ్ళింది లక్ష్మి. అది షేక్స్‌పియర్ పుట్టిన స్థలం. అడుగడుగునా షేక్స్‌పియర్ తటస్థపడుతూనే వుంటాడక్కడ. ఎక్కడ చూసినా ఆయన శిల్పాలు. ఆయన రాసిన గ్రంథాల్లోని కొటేషన్లు, ఆయన నివ సించిన స్థలం, భార్యస్వస్థలం, ఆయన చది విన స్కూలు, ఇవిగాక పెద్ద థియేటరు, దాంట్లో ప్రతిరోజూ ఆయన రాసిన డ్రామాలు ప్రదర్శింపబడుతుంటాయి. ప్రతి చిన్న విశేషా న్ని వదిలపరిచి బహిర్గతం చెయ్యడం విదేశీ యుల దగ్గిర మనం నేర్చుకోవాలనిపిస్తుంది.

లక్ష్మి ఇంగ్లండులో కొంతకాలం మాత్రమే వు న్నా లక్ష్మణ్, లక్ష్మిల స్నేహం మాత్రం చాలాబ లపడింది. లక్ష్మి స్వదేశం వచ్చినా వాళ్ళమధ్య ఉత్తరాలు నడుస్తూనే వుండేవి. మరికొన్నాళ్ళకి లక్ష్మణ్ చదువు ముగించుకుని ఇండియా వచ్చేశాడు. లక్ష్మి పనిగట్టుకుని లక్ష్మణ్‌వాళ్ళ వూరువెళ్ళి వాళ్ళ తల్లిదండ్రుల్ని కలుసుకుని వచ్చింది. లక్ష్మణ్ కూడా లక్ష్మి ఇంటికి వచ్చా డు.

ఆవిధంగా ఇద్దరూ ఒకరినొకరు అన్నివి ధాలా అర్థంచేసుకున్నాకే తల్లిదండ్రుల్ని ఒప్పించాకే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయానికొ చ్చారు.

పాలు - నీళ్ళలాగా అంతగా కలిసిపోయిన వాళ్ళ వివాహానికి ఇరువైపులవాళ్ళూ ఎట్టి అభ్యంతరం పెట్టలేకపోయారు. మనసారా ఇద్దర్నీ దీవించారు.

ఒక ఉద్యోగంలో కుదురుకుని కుదుటపడ్డా కే ఇద్దరూ ఒకటయ్యారు. లక్ష్మి కూడా ఉద్యో గంలోచేరి భర్తకు చేదోడు వాదోడుగావుంది.

వాళ్ళిద్దరూ ఒకరికోసం మరొకరు పుట్టారా అని అనిపించేంత చక్కగా కుదిరిందా జోడీ వాళ్ళనిచూసి ఈర్ష్యపడ్డవాళ్ళూ లేకపోలేదు. ఈర్ష్యతో వాళ్ళసంసారంలో కలతలు పెట్టడా నికి ప్రయత్నించిన వాళ్ళూ లేకపోలేదు. కానీ ఏదియేమయినా వాళ్ళు చలించలేదు. ఏళ్ళు గడుస్తున్నకొద్దీ వాళ్ళ అనుబంధం గట్టిపడిందే తప్ప చెక్కుచెదరలేదు. ఏడాది రెండేళ్ళు అయిదేళ్ళు గడిచినా వాళ్ళకి సంతానం కలగలే దు. మొదట ఇద్దరూ పట్టించుకోలేదు. ఆ తర్వాత పట్టించుకున్నా వర్రీ అవలేదు. చుట్టు పక్కలవాళ్ళూ, బంధువులూ రాళ్ళు రువ్వాలని చూశారు. లక్ష్మి-పార్వతిలాంటిది కాదు. అందు కే ఎవ్వరూ ఏమీ చెయ్యలేకపోయారు. లక్ష్మి, లక్ష్మణ్‌వెళ్ళి మెడికల్ చెకప్ చేయించుకొచ్చా రు. ఇద్దరిలోనూ చిన్నచిన్న లోపాలున్నాయన్నా రు. ట్రీట్‌మెంట్‌తో సరికావచ్చునన్నారు. ట్రీట్ మెంట్ తీసుకున్నారు. అయినా ఫలితం కనబ డలేదు. అది ఒక్కొక్కళ్ళ అదృష్టమన్నారు. పుట్టే అవకాశం లేకపోలేదన్నారు. ఇద్దరూ కలిసి ఆలోచించుకున్నారు. సరేనంటే సరేన నుకున్నారు. ఒక శుభముహూర్తాన ఒక చక్కటి పండంటి ఆడపిల్లను పెంపుడు చేసుకోవడాని కి తెచ్చుకున్నారు. ఆపిల్ల తల్లి పదిహేనేళ్ళు నిండకుండానే ఎవర్నో నమ్మి మోసపోయింది. ఆలస్యమవడంవల్ల తొమ్మిది నెలలూమోసి, రహస్యంగాకని నర్సింగ్‌హోమ్‌కే పిల్లని అప్ప గించి వెళ్ళిపోయింది.

'బాలసారె' ఎంతో మహోత్సాహంగా చేసు కున్నారు లక్ష్మి, లక్ష్మణ్. వాళ్ళది ఆదర్శవివాహ మేకాదు. ఆదర్శ జీవితం అనిపించిందినాకు. వచ్చిన ప్రతివాళ్ళూ వాళ్ళని పొగిడేవారే. చిత్ర మేమిటంటే ఆపిల్లకీ, వీళ్ళకీ పోలికలున్నట్లుగా కూడా అనిపించింది అందరికీ.

ఆ పాప నిజంగా అదృష్టవంతురాలు. ఉన్న దాంతో తృప్తిపడటం జీవితంలో రాజీపడటం లేనిదానిని అమర్చుకోవడం ఇవన్నీ లక్ష్మి

లక్ష్మణ్‌లదగ్గరే నేర్చుకోవాలనిపించింది నాకు. అశాంతి, అసంతృప్తి, విచారం, విషాదం వీళ్ల దగ్గరికే రావనిపించింది. అట్లాంటి ఇంట్లో పెరగడం ఆపాప నిజంగా బాగ్యశాలే.




పరంధామ్ జీవితం ఇంకోచిత్రమైనది. అన్నీవుండీ జీవితాన్ని చేజేతులా నరకం చేసుకోవడం అంటే ఇట్లాంటిదేనంటారు.

పరంధామ్ చాలాడబ్బున్నవాడు. ఆడబ్బు హోదా భార్యవల్ల వచ్చినవే. ఆమాట అతడే చెప్తాడు.

భార్య కైవల్యా చాలా అందగత్తె. వయసెంత యినా చాలా చిన్నదిగా కనబడుతుంది. దానికి తగ్గట్టుగా అలంకరించుకుంటుంది.

వాళ్లకి ఒక్కడే కొడుకు.

కొడుకు ముమ్మూర్తులా తల్లిపోలికే.

పరంధామ్ విధవా వివాహం చేసుకున్నాడనీ, ఆ కొడుకు ఆవిడ కొడుకనీ వదంతి.

కానీ, అసలు విషయం ఇది-

కైవల్యాని ధనవంతుడైన ఒక రోగిష్టి ముసలి వాడికిచ్చి పెళ్లిచేశారు. పెళ్లయిన రెండేళ్లకే ఆమె భర్త మరణించాడు. అప్పటికి ఆమె గర్భవతి. పెళ్లయి వంటరిగా, వయసులోవున్న ధనవంతురాలయిన ఆడదానికి ఎన్నిరకాల కష్టాలు వస్తాయో అన్నీ అట్లాగే వచ్చాయి. బంధువులు డబ్బుకోసం రాబందుల్లా పీడించారు. వయసులోవున్న కుర్రకారు నానారకాలుగా వేధించారు. ఎక్కడో బీరకాయపీచు సంబంధంగలవాళ్లు ఆస్తికి వారసులమంటూ ఇల్లో తిష్టవేశారు. పరివారజనం డబ్బు, వస్తువులు, నగలు, పంట, గుడ్డలు ఏదివడితే అది వెంగిలించడం ప్రారంభించారు. నమ్మినవాళ్లే మోసం చెయ్యడం లాభంవచ్చేచోట్ల నష్టం చూపడం. ఎవరుపడితే వాళ్లు ఇంట్లో పడి మెయ్యడం, డబ్బు విచ్చలవిడిగా ఖర్చుచెయ్యడం, ఎక్కడ ఏది ఎట్లా ఆపాలో అర్థంగాకుండా పోయింది కైవల్యకి. స్వంత తల్లిదండ్రులు, అన్నతమ్ములూగూడా శత్రువులయ్యారు ఆమెకి. ఎవర్ని నమ్మాలో, ఎవర్ని నమ్మకూడదో తెలీకుండాపోయింది. ఎక్కడ ఎవరు తనకి చేయూత నిస్తారా అని అహర్నిశలూ తహతహలాడింది.

అప్పుడు తటస్థపడ్డాడు పరంధామ్. కైవల్యా భర్త ఎంతమందికో, ఎన్నివిధాలో దానధర్మాలు చేశాడు. అట్లా ఆయన దయాధర్మంలో పెరిగినవాడే పరంధామ్. బీదకుటుంబం. తండ్రి చిన్నప్పుడే పోతే చేరదీసి తిండీ, గుడ్డాఇచ్చి చదువుచెప్పించాడాయన. అప్పట్లో ఆ కృతజ్ఞత వుండటంతో కైవల్యాకి అండగా నిలబడ్డాడు పరంధామ్. అన్ని వ్యవహారాలూ స్వయంగా ఒక్కొక్కటే పరిష్కరించాడు. కైవల్యాకి ప్రసవం సమయంలో ఎంతో సహాయం చేశాడు. రాబందుల్లాంటి బంధువుల్ని దూరంగా వుంచాడు. అన్నిట్లోనూ సలహాలిస్తూ ఆస్తిని పరిరక్షించి నిజంగా కైవల్యాకి పరంధాముడే అయ్యాడు.

దాంతో అందరికీ అతడంటే ఈర్ష్య కలిగి వాళ్లిద్దరికీ సంబంధం అంటగట్టి మాట్లాడసాగారు. బాహాటంగానే వాళ్లగురించి మాట్లాడుకోవడం సాగించారు

కైవల్యా దీనికీ తట్టుకోలేకపోయింది. పరంధామ్‌ని రావద్దంది. దూరంగానే వుండమంది. కొంత డబ్బు ఇస్తానంది.

కానీ పరంధామ్ దేనికీ ఒప్పుకోలేదు.

ఆమెకి ఇష్టమయితే వివాహమాడతానన్నాడు. ఇద్దరూ ఇంచుమించు ఒకీడువాళ్ళే.

అప్పటికి ఆమె భర్త మరణించి రెండేళ్ళయింది. కైవల్యాకి కొడుకుని పెంచుకుంటూ వ్యవహారాలన్నీ చూసుకోవడం తనవల్ల కాదనిపించింది. పరంధామ్ సహాయం లేకపోతే వుండలేననిపించింది.

పెళ్ళికి అంగీకరించింది.

అతణ్ని దేవుడిలాగా భావించింది.

పెళ్ళి క్లుప్తంగా జరిగిపోయింది.

అప్పుడు విమర్శించిన బంధుజనం ఇప్పుడు పరంధాముణ్ణి వేనోళ్ల పొగడసాగింది.

ఆస్తి అంతా పరంధాముడిదే కావటంతో పరివారజనం, వందిమాగధులు పరంధామ్ చుట్టూచేరారు. మొదటి నాలుగయిదేళ్ళూ బాగానే గడిచాయి. భార్యనీ, పిల్లవాణ్ని బాగానే చూసుకున్నాడు.

ఇక్కడింకొకటి చెప్పాలి.

కైవల్యకి బిడ్డ పుట్టినప్పుడు కాన్పు కష్టమై ఆపరేషన్ చేశారు. దాంతో మళ్ళీ బిడ్డలు పుట్టే అవకాశమే లేదన్నారు డాక్టర్లు.

ఆ సమయంలో కైవల్యకీ- పరంధామ్‌కీ గూడా విచారమే లేకపోయింది.

కైవల్యకయితే ఇప్పుడూ విచారంలేదు.

కానీ పరంధామ్ పద్ధతిలో కొంచెం కొంచెంగా మార్పురాసాగింది.

కొడుకంటేనే పడకుండాపోయింది.

కొడుకుని మొదట ఉదాసీనంగా చూడటం

ఆ తరువాత అసలు చూడకపోవడం

తరువాత చీదరించుకోవడం

ఆ తరువాత తిట్టడం

ఈవిధంగా అది కొట్టడం వరకూపోయింది ఇప్పుడు కొట్టడమంటే మామూలుగా కాదు చావగొట్టడం. చేతిలో ఏదుంటే దాంతో బాదడం, అరవడం, తిట్ల వర్షం కురిపించడం. చూసే ఎవరికయినా భయం,గగుర్పాటు కలిగేట్లు చేస్తున్నాడు!

అసలు వాడి ఉనికే భరించలేకపోతున్నాడు. కైవల్యకి మొదట్లో తెలీదు.

తెలిసినా తండ్రికామాత్రం హక్కుందిలే అనుకుంది. రాను రానూ అతడి ద్వేషం అర్థమయి భయపడిపోయింది. పసికందుని చంపేస్తాడేమోనన్న భయం అధికం కాసాగింది.

పెళ్ళిచేసుకుని తప్పుచేశానే అని పశ్చాత్తాప పడసాగింది.

ఇంక భరించలేకపోయింది.

ఎదురు తిరిగింది. ఫలితం... కంచే చేను మేస్తే ఏమవుతుంది?

ఆమెకీ దెబ్బలూ చావుదెబ్బలూ ఎదురయ్యాయి. పరంధామ్‌కి అన్ని దుర్వ్యసనాలూ వచ్చి చేరాయి. కొడుకంటే కసి... భార్యంటే ద్వేషం.

వీలునామాలో కైవల్య తదనంతరం ఆస్తి అంతా ఆమెకి పుట్టబోయే బిడ్డకి చెందాలని రాశాడామె మొదటి భర్త!

వాడంటే కక్షకి కారణం అదొకటి.!

వాడు పుట్టకుండా వుండుంటే బావుండేది. ఆమెకి తనవల్ల బిడ్డలున్నా బావుండేది.

కానీ రెండూ జరగలేదు!

ఇంటిని నరకం చేసుకున్నాడు. జీవితం నరకం చేసుకుంటున్నాడు!

అదీగాక విషం నూరిపోసే పరివార జనం!

కైవల్య క్షణక్షణమూ హడలిపోతోంది. కొడుకుని రక్షించుకోవాలన్న తహతహ ఇప్పుడామెని నిలవనీయడంలేదు.

ఈనిన ఆడపులిలా మారింది.

తన కొడుకు జోలికి ఎవరొచ్చినా భరించలేకుండా వుంది. ఇప్పుడామెకి ఆస్తి, ఐశ్వర్యం, ఇల్లు, భర్త, వీటన్నింటికంటే కొడుకు, అతన్ని రక్షించుకోవడం ముఖ్యమైంది!

'ఏం చేస్తే అతడు క్షేమంగా వుంటాడు?' అని అహర్నిశలూ ఆలోచించసాగింది.

లాయర్లని కలిసింది.

అనేక విధాల చర్చించింది.

అంతగా అవసరమైతే పరంధామ్‌కి విడాకులివ్వడానికే నిశ్చయించుకుంది. నాలుగయిదేళ్ల కిందటికీ ఇప్పటికీ ఆమెలో చాలా మార్పొచ్చింది.

ఎట్లాంటి పరిస్థితి అయినాసరే ఎదుర్కోగలిగే ఆత్మవిశ్వాసం వచ్చింది.

ధైర్యం, దృఢ సంకల్పం వచ్చి చేరాయి.

మనసు అన్ని సున్నిత భావాలకూ అతీతమై రాటు తేలింది.

ఒక్క మాతృభావం మిగిలింది.

పరంధామ్ ఆలోచనలు వేరుగా వున్నాయి.

కైవల్య, ఆమె కొడుకు వీళ్ళిద్దరూ వున్నంత కాలం ఆస్తి చేతికి రాదు.




ఆమె విడాకులిచ్చిందో అసలుకే మోసం! ఇప్పుడున్నవి అనుభవించను కూడా లేదు, కాబట్టి అసలు వాళ్ళే లేకుండా చెయ్యాలి. డబ్బు కాంక్ష, స్వార్థం మనిషిని ఎట్లా భయంకర జంతువుగా మారుస్తాయో దానికి పరంధామ్ నిదర్శనం.

ఇట్లాంటి భయంకర పరిస్థితిలో వున్న కైవల్యాని నేను కలుసుకోవడం తటస్థించింది. నాకూ ఏం చెయ్యాలో ఏం చెయ్యగలనో తోచలేదు.

ఒక సలహా చెప్పాను ఆమెకి. ముందు ఆమె బిడ్డని రెసిడెన్షియల్ స్కూల్లో చేర్పించమని.

ఆమెని కొన్నాళ్ళు తీర్థయాత్రలకంటూ తిరిగిరమ్మని.

ఆ తరువాత.... మొదటిసారిగా ఎవ్వరికీ చెప్పని నా రీసెర్చి, మన అన్వేషణ. మనం స్థాపించబోయే సంస్థ గురించి చెప్పాను. ఆమె కన్నీళ్ళతో విన్నది. "మీరు అక్కడే వుండిపోదురుగాని అది సురక్షితమైన స్థానం అవుతుంది" కొంచెంసేపాగి అన్నాను.

"చూద్దాం.... పరంధామ్‌లో కూడా మార్పు వస్తుందేమో.... ప్రయత్నిద్దాం."

ఆమె గుండె కరిగినీరయింది. నా చేతులు పట్టుకుని ఏడ్చేసింది. "ఎన్నాళ్ళనించో ఈ టెన్షన్‌ని భరించలేకుండా వున్నాను. మీతో మాట్లాడాక నా మనసుకి కాస్త శాంతి లభించింది. కుదుటపడింది మనసు. ఊరటగా ఉంది"

అప్పుడు నాకనిపించింది 'మన ప్రణాళిక ఎంత తొందరగా అమల్లోకి వస్తుందా... ఎప్పుడు ఇట్లాంటివాళ్ళని మనం ఆదుకుంటామా?' అని.

అప్పుడే నాకు అనిపించింది.

ఎంతముందు చూపుతో ఎంతవిజ్ఞానంతో మన ప్రొఫెసరుగారు దీనిని ప్రారంభించారో అనేది.

అసలిట్లాంటి కార్యానికి మనము తృణప్రాయంగానైనా ఉపయోగపడటం, మన మహద్భాగ్యంగా భావించాలి. ఈ మాట ఎన్నిసార్లు చెప్పినా, ఎట్లా వెల్లడించినా నా మనసుకి తృప్తిలేదు. నేను మనసు విప్పి క్లియర్‌గా చెప్పలేకపోతున్నాననే అనిపిస్తుంది. నాకు తెలుసు, మనం అందరం అంతేనని.

ఆ తరువాత నా ట్రిప్పులో నాకు తటస్థపడినవారందర్నీ కలిసి మన అన్వేషణ విషయం చర్చించాను. అందరిదగ్గరా అభిప్రాయాలు, సలహాలు తీసుకున్నాను.నా రీసెర్చి అంతటితో ఆపి బయల్దేరాను....

ఇప్పటికే చాలా రాత్రయిందేమో.... లేక తెల్లవారవచ్చిందా?"

అంటూ ప్రవీణ్ తను చెప్పడం ఆపాడు.

అందరూ లేచారు.

శ్రీరామ్ కుటుంబసభ్యులకి కృతజ్ఞతలు చెప్పి బయటికి నడిచారు.

* * *

ఆ తరువాత ఓరోజు పద్మ అందర్నీ తన ఇంటికి టీకి ఆహ్వానించింది.

ఆ రోజు వాళ్లమేనత్త చేసిన హడావిడి అంతా ఇంతాకాదు.

అందరూ ఉత్త టీ, బిస్కెట్లు చాలన్నా వినకుండా నాలుగయిదు రకాల స్వీట్లు, మిక్స్‌చర్, ఉప్మా, పళ్లు, బిస్కెట్లు, టీ, కాఫీలు అన్నీ రెడీ చేసింది. అన్నీ తన చేతిమీదుగానే.

అన్నీ అయ్యాక పద్మ తన స్టడీ గురించి చెప్పడం ప్రారంభించింది.

నాగలింగం, భ్రమరాంబల నిగూఢ ప్రేమ గురించి;

స్వాతి, శాలినీల సవతి ప్రేమ గురించీ; మహేష్, మల్లికల ఆదర్శ దాంపత్యం గురించీ; స్వర్ణ, కాంచనల అతిమామూలు జెలసీ గురించి; భండారేగారి అశాంతి గురించీ- అన్నీ వివరంగా, సంఘటనలన్నీ వర్ణిస్తూ పద్మ చెప్తుంటే అందరూ ఆ సంఘటనలలోకి తామూ వెళ్లిపోయినట్లుగా విన్నారు.

మేనత్తమాత్రం పద్మవైపు విస్ఫారితనేత్రాలతో ప్రేమగా, గర్వంగా చూస్తుండిపోయింది.

మరోరోజు ప్రొఫెసర్‌గారింట్లో శ్రీరామ్ తన కథనం చెప్పాడు.

రామకృష్ణ ఎట్లా అవినీతిమార్గంలో పడ్డాడో, దాన్నెట్లా సమర్థించుకున్నాడో, జగన్నాథం మాస్టారి దీనావస్థ, స్మిత చిత్ర జీవితం.

సేతు రామయ్యగారి విచిత్రకథ.

పనివాడి దొంగతనం-

వరకట్న దురాచారం-

ఒక్కొక్కటే వివరించి చెప్పాడు శ్రీరామ్.

అవి వింటుంటే ఎవరికివారే శ్రీరామ్ ఎంతగా ఎదిగిపోయాడు- అనుకున్నారు.

వింటున్న ప్రొఫెసరుగారి కళ్లు సంతృప్తితో మెరిసేవి.

"మైడియర్ యంగ్ ఫ్రెండ్స్... ఇప్పుడు మీరేం చిన్నపిల్లలుకాదు. మిమ్మల్ని గురించి నేను వేసుకున్న అంచనాకంటే ఎక్కువే... ఎంతో ఎక్కువే చేశారు. విజ్ఞానవంతులయ్యారు మీరు. నాకు ఆనందంగానూ, గర్వంగానూ కూడా ఉంది. సంతృప్తిగా, సంతోషంగావుంది. తండ్రిని మించిన తనయుణ్ణి చూస్తే తండ్రికీ, గురువుని మించిన శిష్యుణ్ణి చూస్తే గురువుకీ ఒకేలాంటి ఆత్మానందం కలుగుతుందని నాకిప్పుడే తెలిసింది! ఏమో...నా ఆనందం ఇంకా ఎక్కువైనదేమో-

మిమ్మల్ని నేనే కార్యంమీద పంపించానో ఆ కార్యం విజయవంతంగా నిర్వహించి, పూర్తి చేసుకుని వచ్చారు మీరు. ఇన్నాళ్లకి నా చిరకాలవాంఛ నెరవేరబోతోందని నాగుండెల నిండా సంతోషం నిండి వుందని నేను పదేపదే చెప్పక్కర్లేదు. ఆనందం.సంతోషం- అనే పదాలకి పైన మరే పదముందో నా మనసులోని భావాన్ని వ్యక్తంచెయ్యడానికి నాకు తెలీదు.

మన భారతదేశం శాంతి కాముక దేశం. సహజీవనం మనకి పుట్టుకతోనే వచ్చింది. మన దేశంలోనే ప్రత్యేకంగా ఇన్ని భాషలు, ఇన్ని వర్ణాలు, ఇన్ని మతాలు, ఇన్ని కులాలు ఉన్నాయి. అయినా కూడా అందరమూ ఆ భరతమాత బిడ్డలమే... భారతీయులమే. మన ప్రతి ఒక్కరిలోనూ భారతీయత అనేది ఉంది. అహింసయే మనకి పరమధర్మం. సహనం అనేది మన సహజగుణం.

ఈ సందర్భంగా నేనొక సంఘటన చెప్తాను. నేను స్విట్జర్లాండు వెళ్లినప్పుడు స్విస్ మిత్రుడు వాల్టర్‌స్టూప్‌ని తప్పక కలుస్తాను. ఆయన పెద్ద వ్యాపారవేత్త. అంతకంటే గొప్ప తత్వవేత్త. చాలా చదువుకున్నవాడు. సునిశితమైన విమర్శనాదృష్టిగలవాడు. ఆయన, నేను కలిసి నైపటాల్‌లో ఒక హోటల్లో భోజనం చేస్తూవున్నప్పుడు 'ఇండియా- ఎంతో సహనశీలత ఉన్న దేశం' అన్నాడాయన. ఇండియాలో వున్న సహనశీలత ఈయనెట్లా గమనించాడా అని నాకు సందేహం కలిగింది. మామూలుగా మన దేశానికి ఏగొప్ప నాయకులయినా, మరే రంగంలో ఉన్నతులైనా వస్తే వాళ్లకి ముఖ్యంగా మన దేశపు ఔన్నత్యాన్ని చాటే విషయాలే చూపిస్తాం. ఈయన వ్యాపారవేత్త. మనదేశంలో ఉన్నదే చాలా తక్కువ సమయం. అంతతక్కువ సమయంలో మన దేశాన్ని, అందులోనూ మన సహనాన్నీ ఎలా పరిశీలించాడో? నేను బొంబాయిలో ప్లేను ఎక్కడానికి విమానాశ్రయానికి వెళ్లాను. నేను వెళ్లే ప్లేను మూడు గంటలు లేటన్నారు. ఆ సమయంలో ఆ మూడు గంటలూ విమానాశ్రయంలోనే కూర్చున్నాను. అప్పుడు ఒక కుక్క విమానాశ్రయంలోకి మేము కూర్చున్నచోటికి వచ్చి మామధ్యలో కింద విశ్రాంతిగా కూర్చుంది. అది పెంపుడు కుక్కకాదు. ఒక వీధి కుక్క. మామూలుకుక్క. అది కూచున్నదని అందరూ గమనించారు. కానీ ఎవరూ ఏమీ చెయ్యలేదు. దాన్ని తరమలేదు... కొట్టలేదు. కనీసం ఛీత్కరించుకోను గూడాలేదు. అది అక్కడవున్నా, ఎవరి పన్లు వారుచేసుకుంటూనే ఉన్నారు. అదే మాదేశంలో అయితేనూ, ఇంకేదేశంలోనైనాసరే ఒక కుక్క ఎయిర్‌పోర్ట్‌లోకి వస్తే దాన్ని తరమడంకాదు, షూట్ చేసిపారేస్తాం. అసలు సహించలేము" అన్నాడు. ఆ మాటలు ఎగతాళిగా అన్నవి కాదు.

మన దేశంలో ఎన్నో సుగుణాలు, మనకి తెలీని విషయాలు చాలా చాలా ఉన్నాయి. మన ఈ విశాల భారతదేశం కొంతైనా మీరు చూసి కొన్ని విషయాలైనా గ్రహించుకోగలిగారు. మన దేశపు ఔన్నత్యామేకాదు అందచందాలు, రమణీయతలు చూసి సంతోషించగలిగారు. భాషలు వేరైనా, భావనలు- జాతులు వేరైనా, దారులు కులాలు వేరైనా దేశము, మతాలు వేరైనా భావం ఒక్కటే అని గ్రహించగలిగారు. అదే చాలు... అదే ముఖ్యం!

మీ నలుగురూ తెచ్చిన సమాచారం ఆధారంగా శాంతివనం పెంచుదాం మీ విజ్ఞానమే.

శ్రీ మహాలక్ష్మి వారి వెరైటీ నవలలు
1987- నవంబరు 5 విడుదలయినవి!

- ★ -

ఆంధ్రుల ఆరాధ్య రచయిత్రి

శ్రీమతి యద్దనపూడి సులోచనారాణి డైరెక్టు నవల

| | | | |
|---|---|---|---|
| 1 | **నిశాంత** | | **25-00** |
| **2.** | ప్రమాదాల్లో ప్రమదలు<br>(స్వాతి వీక్లీ సీరియల్) | 'నవీన్' | **25-00** |
| **3.** | అన్వేషణ<br>(ఆపన సీరియల్) | వి.యస్. రావు | **20-00** |
| **4.** | మానసిక సమస్యలు-సమాధానాలు<br>(స్వాతి మంత్లీ నుండి) | డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డి | **20-00** |

---

అడ్వాన్సుతోపాటు మీ ఆర్డర్లు పంపండి. అడ్వాన్సు లేని ఆర్డర్లు అంగీకరించబడవు.
పోస్టుఖర్చులు మీరే భరించుకోవలెను

---

Phone: 63322

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్

మ్యూజియం రోడ్: విజయవాడ - 520 002

...లస్తంభాలుగా మీ భావాలే పునాదులుగా మీ ఉత్సాహ చైతన్యాలే గోడలుగా మీ వివేకమే కప్పుగా ఒక ఆశ్రమం నెలకొల్పుదాం. శాంతి వనం అనురాగ నందనవనమవుతుంది! ఈ నందనవనంలో ఎన్నెన్నో శాంతి వృక్షాలు పెర గాలి. ఫలపుష్పాదులతో విలసిల్లాలి. ఇక్కడ దుఃఖం దారిద్ర్యం బాధ అసంతృప్తి శోకం అవినీతి విషాదం... విచారం వీటికి తావుండ దు. అంతటా సంతోషం సంతృప్తి శాంతి ఆర్ద్రత చైతన్యం ఉత్సాహం ఉత్తేజం... ఇవే ఇవే అలరారాలి. అందరం ఒక్కటనే భావన వుండాలి.

దీన్ని స్థాపించే మీరే భావిభారతాన్ని నడి పించే దివ్వెలు. ఒక్కొక్క దీపం - ఎన్ని వేలమందికో దాని కాంతిని పంచుతుంది. అదేవిధంగా మీరు రాబోయే తరానికి శాశ్వత దివ్వెలు కావాలి. మనదేశం శాంతితో సౌభా గ్యంతో సౌభ్రాతృత్వంతో సుభిక్షంగా విల సిల్లాలి. అదే నా కోరిక... ఇదే నా ఆశీస్సు విష్‌యూఆల్‌దిబెస్ట్. భగవంతుడు సదా మీకు సహాయంగా వుండాలని ప్రార్థిస్తున్నాను--''

ఆపైన ఆయనింక మాట్లాడలేకపోయారు. అప్రయత్నంగానే నలుగురూ వంగి ఆయనకి నమస్కారం చేశారు!

అక్కణ్ణించి ప్రొఫెసర్‌గారు తమకు ఎలాట్ అయిన స్థలానికి తీసుకువెళ్లారు అందర్నీ.

తన ప్రణాళికను ఎట్లా ఎట్లా ఆచరణలోకి తేవాలనుకుంటున్నారో చెప్పారు. అన్నీ పేపర్ మీద వివరంగా చూపించారు.

ఎటువంటివారినైనా ఇట్టే ఆకట్టుకునే వాక్చాతుర్యం చాకచక్యం ప్రొఫెసరుగారికు న్నాయి. స్వార్థమంటే ఏమిటో తెలియని ప్రొఫె సరుగారి కోసం ఏంచెయ్యడానికైనా ఎవరైనా ఎప్పుడైనా సిద్ధమే. పైగా ఇటువంటి కార్య మంటే అందరికీ ఆసక్తే. ఎంతమందో ఎన్నివి ధాలుగానో సహాయం చేస్తామని ముందుకు వచ్చారు... వస్తున్నారు - ఇంక లోటేముంది?

తన నలుగురి శిష్యులకీ ఆరోజే చెయ్యవ ల్సిన పన్లుచెప్పి, బాధ్యత అప్పగించేశారు ప్రొ ఫెసరుగారు.




"మనకి కావల్సిన సామగ్రి ఇదీ. కావల్సిన మనుషులు వీళ్లు.ఆసామగ్రి తెప్పించే పూచీ ఒకరిదైతే - మనుషుల్ని ఎన్నుకునే బాధ్యత మరొకరూ - అబ్బాయిలు తీసుకోండి. తోటపనీ, డెకరేషనూ ఆడపిల్లలది... సరేనా?''

అంటూ పనులు పంచేశారు ప్రొఫెసరుగా రు.

ఆ మరునాటినించే ఎవరి బాధ్యతననుస రించివారు - తమ తమ పనులు ప్రారంభించా రు.

అందరూ కష్టపడి పనిచేయసాగారు.

★ ★ ★

ఆ రోజు ఉగాది.

కొత్త సంవత్సరంలో మొదటిరోజు.

చైత్రం కొత్త సంవత్సరంలో మొదటి నెల.

అందుకే ఆరోజునెన్నుకున్నారు ప్రొఫెసరు గారు ప్రారంభోత్సవానికి!

కొత్త బిల్డింగ్ 'రాగనందనం' కళకళలాడు తోంది!

రంగురంగుల లైట్లు రంగుకాగితాలు మామిడి తోరణాలు పూలతోరణాలు అలంకర ణకూడా కొత్త పద్ధతిలోనేవుంది! కరెంటు లైట్ల తోపాటు నూనెదీపాలు కూడా పెట్టారు. అంతా రంగవల్లులు తీర్చారు! సన్నాయి త్యాగరాజ కృతులు కాసేపు, షెహనాయి హిందూస్థానీ మరికాసేపు, వీణామృదంగాలు కొంచెంసేపు సితార్, తబలాలు - మరో కొంచెంసేపు జలత రంగిణీ ఇంకొంచెంసేపు ఆపకుండా సంగీతం అలలు అలలుగా ఆ ప్రాంతాన్నంతా సమ్మో హితం చేస్తోంది!

'స్వాగతం' బోర్డు కొత్తరకంగావుండి అంద ర్నీ ఆకర్షిస్తోంది.

ప్రాంగణంలో నాలుగుమూలలా నాలుగు శాంతివృక్షాలున్నాయి. ఒకటి మామిడి, రెండోది మర్రి, మూడోది వేప, నాలుగోది పొగడ ఈ నాలుగు శాంతివృక్షాలూ చిరస్థాయిగా నిలిచేవి! ఫలపుష్పాదులతో అలరారేవి! నలుగురికీ మేలుచేసేవి! అందరికీ నీడనిచ్చేవి!

బిల్డింగ్‌కి నాలుగువక్కలా కాంపౌండ్‌వాల్ లాగా అశోకవృక్షాలు ఇప్పుడిప్పుడే తలలెత్తు తున్నాయి.



దారిలో నడుస్తుంటే వరుసగా ఆర్చీలకి అల్లించివున్నాయి రంగురంగుల బోగన్‌విలియాలు-పసుపు, ఎరుపు, తెలుపు, కనకాంబరం రంగు, వైలెట్ రంగుల్లో ఆకర్షణీయంగా వున్నాయి.

దారికి రెండువైపులావున్న లాన్‌లో వివిధరకాల డిజైన్లుగా ఇటుకరాళ్ల మధ్యలోవున్న రంగురంగుల పూలచెట్లు బంతి, జినియా వంటి సీజనల్ ప్లాంట్లు విరగబూసి అందాన్ని వెదజల్లుతున్నాయి.

ఇంకా ముందుకెళితే గులాబీల తోట వుంది ఒకవైపు. మరోవైపు మల్లెతోట.

గులాబీల తోటలో ఎన్నో రంగుల గులాబులు. అరచేతిమందంనించీ చిన్న బటన్‌రోజ్

వరకూ వున్నాయి!

మల్లెలు కొన్ని పొదలైతే మరికొన్ని తీగలు. తీగమల్లెలతోగూడి జాజి, మాలతి, రాధామాధవం, కాశీరత్నం, నైట్‌క్వీన్, చైనాబాక్స్ ఇవన్నీ బిల్డింగ్‌కి రెండువైపులా అల్లించబడివున్నాయి. మరికొన్ని పందిళ్లకి అల్లించివున్నాయి. పందిళ్లకోసం ఇనప స్తంభాలు పైన మెష్ వున్నాయి. అవి చూడటానికి పూపొదరిళ్ళు.

మందారాలు, మెట్టతామరలు, నందివర్ధనం, గన్నేరు, గరుడవర్ధని, పారిజాతం మొదలైన పూజాకుసుమాలనిచ్చే చెట్లు ఒకవైపు నుండే రకరకాల క్రోటన్లు మరోవైపున్నాయి. ఇవన్నీగాక పూలకుండీలు ఆ ప్రదేశానికి మరింత సౌందర్యాన్నిస్తున్నాయి. వెనకపక్క అనేక ఫలవృక్షాలు. అరటితోట, కొబ్బరితోట, మామిడితోట, సపోటా, జామ, నిమ్మ, బత్తాయి, పనస, నారింజ, నేరేడు, సీతాఫలం అన్నిరకాలూ వున్న పళ్లతోట అది. తోటంతా ఆరునెలల వయసులో అలరారుతోంది. ఆవరణం మధ్యలో ఎత్తుగా వేదిక.

ప్రియ, పద్మ, ప్రవీణ్, శ్రీరామ్‌లు తెల్లని బట్టల్లో బ్యాడ్జీలతో శాంతిదూతల్లాగా వున్నారు. ఒకటే హడావిడిగా తిరుగుతూ వచ్చినవాళ్లని రిసీవ్‌చేసుకుని కూర్చోబెడుతున్నారు.

ఈ ఫంక్షన్‌కోసం ఆ నలుగురికే అన్వేషణలో కలసినవారు అందరూ వచ్చారు.

ఊళ్లోని ప్రముఖులందరూ కుర్చీల్లో ఆసీనులైవున్నారు.

వచ్చిన ప్రతిఒక్కరికి ఒక్కొక్క గులాబి పువ్వు, పన్నీరులతో స్వాగతం పలికారు. సరిగ్గా అయిదుగంటల ముప్పై నిమిషాలకి గేటు ముందు కారాగింది. తలుపు తెరుచుకుని ముందుగా ప్రొఫెసరుగారు దిగారు. ఆ తరువాత కరుణకి ప్రతిరూపమయిన మదర్ థెరిస్సా దిగింది.

ప్రియ ఆవిడకి దండవేసి స్వాగతం పలికింది. ప్రొఫెసర్‌గారు తన శిష్యరత్నాల్ని పరిచయం చేశారు మదర్‌కి.

ఆతరువాత ప్రొఫెసరుగారు మదర్‌ని రాగనందనం అంతా తిప్పి చూపించారు. ప్రతిఒక్కటీ సవివరంగా చెబుతూ వచ్చారు. ఆయన చేసినవీ, చెయ్యదల్చుకున్నవీ వివరంగా చెప్పారు.

తెల్లని చీర జాకెట్టుతో పచ్చని శరీరచ్ఛాయతో వున్న మదర్ని చూస్తుంటే భరతమాతలా అన్నపూర్ణలా ఆప్యాయతకే మారుపేరులా వున్న మదర్‌ని చూస్తుంటే అందరికీ భక్తిగౌరవాలు కలుగుతాయి. మమతలు పెల్లుబుకుతాయి.

మొదటి బిల్డింగ్ లోపలికి వెళ్లగానే ముందుగా దర్శనమిచ్చేది నిలువెత్తు బుద్ధభగవానుని చిత్రం. దానికింద చెక్కివున్న మాటలు—

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి"

అందర్నీ ఆకట్టుకుంటాయి!

మదర్ క్షణం అక్కడ నిలిచిపోయింది.

ఆ చిత్రం చేసిన తీరు- కళ్లల్లో శాంతి సందేశం. సాక్షాత్తూ ఆ గౌతమ బుద్ధుడు మనకోసమే దిగివచ్చి ఆ ఆకృతిగా నిల్చిందా అనిపించేటట్లుగా వుంది!

ఆ బిల్డింగ్ పేరు- 'బాల విహార్'

"మదర్... ఇది అనాథ బాలబాలికలకు ఏర్పాటుచేసిన గృహం. ఇది మీకు కొత్తకాదు. మేము మీ అడుగుజాడల్లో నడవడానికి ప్రయత్నిస్తున్నవాళ్లం. మాకు మీ ఆశీస్సులు కావాలి. ఇక్కడ అనాథబాలలకు కావలసిన సదుపాయాలన్నీ వున్నాయి. వాళ్లకి ఒక లెవెల్ వరకూ విద్య నేర్పి ఆతరువాత వాళ్ల వాళ్ల ఇంటరెస్ట్‌నిబట్టి వాళ్లకి ఇతర వృత్తివిద్యల్లో తరిఫీదు ఇస్తాం. వాళ్లల్లో కొంతమందిని మళ్లీ ఇక్కడి విద్యార్థులకే విద్యనేర్పడానికి అవకాశం కల్పిస్తాం. మిగిలినవారు వివిధ రంగాలలో పైకిరావడానికి అన్నివిధాలా సహాయపడతాం"

అమాయకంగా- స్వచ్ఛంగా పువ్వుల్లావున్న అక్కడి బాలలు మదర్‌కి నమస్కరించారు. మదర్ వాళ్లని దగ్గిరకి తీసుకుంది.

రెండో బిల్డింగ్ పేరు 'వనితా నిలయం'. లోపలకి రాగానే- అక్కడ నిలువెత్తున మదర్ థెరిసా చిత్రం చూపరులను ఆకర్షిస్తూ ప్రేమ

 

స్వరూపందాల్చి అక్కడ నిల్చిందా అనిపింప జేస్తోంది.

మదర్‌కి కళ్ళు నీటితో నిండిపోయాయి.

"మదర్... ఇది అభాగినులైన స్త్రీలకు రకరకాల విద్యలు నేర్పే గృహం. వాళ్ళు ఎంతవరకు చదువుకోవాలంటే అంతవరకూ చదివిస్తాం. మిగిలినవాళ్ళు కుట్టు, టైలరింగ్, నిట్టింగ్, కుకింగ్, ఎంబ్రాయిడరీ, తోటపనీ, నర్సింగు, కలంకారీ, అద్దకమూ ఇవేగాక అప్పడాలు, వడియాలు, ఊరగాయలు తయారుచెయ్యడం, వక్కపొడి ఇంకా ఎన్నో నేర్చుకుంటారు. చిత్రలేఖనం, శిల్పం, క్రాఫ్ట్‌వర్కు ఇట్లాంటివి వాళ్లకి నేర్పి వాళ్లని వాళ్ల కాళ్లమీద నిలబడేట్లు చేస్తాం"

కొంతమంది స్త్రీలు వచ్చి మదర్‌కి నమస్కారం చేశారు.

"వీళ్ళు వాళ్ళవాళ్ళ విద్యలు కొనసాగిస్తూనే ఇక్కడి అభివృద్ధికి అన్నిట్లో సహాయంగానూ వుంటారు. అంటే ఉదాహరణకి వీళ్లల్లో కొంతమంది అనాథ బాలల అవసరాలు చూస్తారు. మరికొందరు వంటశాలలో, భోజనశాలలో సహాయంగా వుంటారు. ఇంకొందరు క్లీనింగూ, వాషింగూ చేస్తారు.

వీళ్ల పన్లు బైరొటేషన్ మారుతూ వుంటాయన్నమాట! వీళ్లందరికీ భోజనమూ, బట్టలూ మిగిలిన అవసరాలన్నీ రాగనందనమే చూస్తుంది.

మూడో బిల్డింగ్ పేరు 'రామరాజ్యం'

లోపలికి ప్రవేశించగానే గోడకి నిలువెత్తు గీతోపదేశం చిత్రం. భయపడుతున్న అర్జునుడికి అభయహస్తమిస్తున్న పార్థసారథి చిత్రం. దానికింద--

"ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే॥"

అన్న భగవద్గీత శ్లోకంలోని వాక్యాలు ధైర్యాన్నిస్తున్నాయి.

మరోవైపు నిలువెత్తు ఆదిశంకరాచార్య చిత్రం చూపరులను ఆకట్టుకుంటోంది.

"మదర్... ఇది వృద్ధులైన స్త్రీపురుషులకి హోమ్.

ఏ సహాయమూలేనివారికి నివాసగృహం, విదేశీయులలాగే మనలో కొంతమంది తల్లిదండ్రుల్ని చూసుకోవడం తగ్గించారు. అది ఎంతో దురదృష్టకరం! వాళ్ళదగ్గిర నేర్చుకోవాల్సిన ఎన్నో మంచి విషయాలుండగా- అవి మానేసి మనవాళ్ళు ఇటువంటి ప్రభావానికి లోనుకావడం నిజంగా విచారకరం. కనిపెంచి పోషించి పాటుపడి పెద్దచేసి పెళ్ళిచేసి అన్నిటికీ అండగా నిలిచిన తల్లిదండ్రుల్ని వాళ్ళకి నిజమైన ఆసరా కావల్సిన వృద్ధవయసులో వదిలేసి పట్టనట్లు వుండటం ఎంతోతప్పు"

"ఆ వృద్ధులకి ఇక్కడ రాగనందనం ఏ లోటూ రాకుండా చూడటానికి ప్రయత్నిస్తోంది. వాళ్ళ అవసరాల్ని చూస్తూ వాళ్ళకి సేవచేసే ప్రత్యేకమయిన మనుషులుంటారు.

అప్పటికే చేరిన అక్కడ వృద్ధుల్నిచూసి మదర్ హృదయం కదిలిపోయింది.

నాలుగో బిల్డింగ్- 'జీవనజ్యోతి'

ఈ బిల్డింగ్ ముందు హాల్లో ప్రవేశించగానే- నిలువెత్తున శ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారి ఛాయాచిత్రం ఆహ్వానిస్తూ వుంది.

విశాలమైన ఆ కళ్ళల్లో- అవిరామమైన ప్రేమ వర్షిస్తూవుంటుంది. ఆ కళ్ళు మనలోకి- అంతరాత్మలోకి చొచ్చుకునిపోయి మనలో వున్న మానవత్వాన్ని స్పర్శిస్తూన్నట్లుంటాయి. మనలో కదలిక కలిగితీరుతుంది.

"ట్రూత్ ఈజ్ వితిన్ యువర్‌సెల్ఫ్- ఫైండవుట్" అని రాసివుంది.

మదర్ ఏమీ మాట్లాడక కన్నీటితో- ఆ ఫోటోనే చూస్తూండిపోయింది చాలాసేపు.

"మదర్... ఇక్కడ వికలాంగులకి కావల్సినవన్నీ వుంటాయి. వారు మామూలు మనుషులకి ఏ విధంగానూ తీసిపోరనీ, ఒకరకమైన లోటున్నప్పటికీ ఇంకో విధమైన చాకచక్యాన్ని వారు కలిగివున్నారనీ కాబట్టి వాళ్ళు ఏ విధంగానూ తమ ఆత్మవిశ్వాసాన్ని కోల్పోగూడదనీ వారిని ఏ విధంగా సద్వినియోగపర్చుకోగలమో ఆలోచించుకుని ఆచరణలో పెట్టాలని మా సందేశం.

ఎవరికి ఏయే విద్యలో ప్రావీణ్యంవుందో పరిశీలించి- దాంట్లో వారు ప్రవీణులయ్యేట్లు, అది వారికి జీవనాధారం అయ్యేట్లు చూస్తాం.

ఇంక మిగిలిన నాలుగు బిల్డింగుల్లో ఒకటి సంగీతానికి. అక్కడ పెద్ద సరస్వతీదేవి విగ్రహంవుంది.

రెండోది- 'కళానిలయం.'

దాంట్లో చిత్రలేఖనం, శిల్పం, బాతిక్‌వర్క్, కలంకారీ, పాటరీ క్రాఫ్టువర్కులాంటివన్నీ నేర్పడానికి కావలసిన సామాగ్రి అంతా వుంది.

మూడోది 'ఆహారనిలయం.'

అక్కడే కిచెను, డైనింగ్‌హాలు మిగిలిన సామగ్రులు అన్నీ వున్నాయి.

నాలుగోది 'పుస్తకనిలయం' అంటే లైబ్రరీ.

ప్రముఖులు రాసిన ముఖ్యగ్రంథాలన్నీ వున్నాయి. చిన్నపిల్లలకి ఉపయోగపడే పుస్తకాలదగ్గిర్నించి తలలుపండినవారుకూడా చదవగలిగిన ఉద్గ్రంథాలదాకా వున్నాయి.

మధ్యనవున్న పెద్దహాలు రీడింగ్‌రూమ్. అక్కడ అన్నిరకాల మంచి పత్రికలు అన్ని భాషలవీ వున్నాయి.

ఆ నాలుగూకూడా చూశాక-

మధ్యలో ఉన్న పెద్ద బిల్డింగ్‌కి వెళ్ళారు. అది 'ప్రశాంతి నిలయం.' విశాలమైన మెట్లెక్కి లోపలికివెళ్తే మధ్య పెద్ద హాలు.

అది ప్రార్ధనామందిరం. లోపల అడుగుపెట్టగానే విరులసువాసన- అగరువత్తీ సుగంధం కలిపి మనసులకు పవిత్రభావం కలిగిస్తున్నాయి.

అక్కడ వివిధ మతప్రవక్తలు- గురువుల చిత్రపటాలున్నాయి.

లోపల పూజామందిరం వుంది. అది ఒక గుడేననిపించింది.

"రాగనందనంయొక్క ముఖ్యోద్దేశం అందరి దేవుడూ ఒక్కడే. రూపాలే వేరు. అన్నిమతాలూ ఒక్కటే బోధించేది మానవత్వమే.

అందరి దేశమూ ఒక్కటే అదే భారతదేశం! మేమూ భారతదేశంలోని అన్నిపండుగలూ సెలెబ్రేటు చేస్తాం. అందరికీ ఆ పండుగయొక్క ప్రత్యేకతను వివరించి చెప్తాము"

అని అంతటితో ముగించారు ప్రొఫెసరుగారు. అన్నీచూసిన మదర్ ఎంతో సంతోషించింది. ఆవిడ కళ్ళల్లో ఆనందభాష్పాలు రాలాయి. అలసిపోయిన మదర్ కొంతసేపు విశ్రాంతి తీసుకున్న తర్వాత-

ప్రోగ్రాం ప్రారంభమయింది.

ప్రొఫెసరుగారు రాగాన్వేషణలోని ఆంతర్యమంతా సభాసదులకి వివరించారు.

ఆ తరువాత మదర్‌థెరిస్సా మాట్లాడుతూ,

"ఈ రాగనందనం చూశాక నా మనసంతా సంతోషంతో నిండిపోయింది. ఇందులోని ప్రతి అణువూ ఎంతో విచక్షణతో నిర్మించారు. ఎంతో విజ్ఞానమూ- వివేకమూ దూరదృష్టి గల ప్రొఫెసరు మూర్తిగారికీ వారి శిష్యులకూ చేయూతనివ్వాలి. ప్రతి వూళ్ళోనూ- ప్రతి రాష్ట్రంలోనూ- ప్రతిదేశంలోనూ ఇలాంటి రాగనందనలు వుంటే ప్రపంచమంతటా శాంతిని నెలకొల్పవచ్చు. ద్వేషాన్ని రూపుమాపవచ్చు.

ఇంత చిన్నవయసులోనే దేశశాంతికి పాటుపడుతున్న వీరు మనకి ఎంతో ఆదర్శవంతమైనవాళ్ళు. వీరి మార్గంలోకి ఇంకా ఇంకా ఎంతోమంది యువతీ- యువకులు వచ్చి వీరికి చేయూతనిస్తారని ఆశిద్దాం.

ప్రతి ఒక్కరి హృదయంలోనూ మంచికి స్థానం- ప్రేమ- దయ- సానుభూతులకి చోటు వుంటేచాలు- ఆర్ద్రహృదయముంటేచాలు- అదే శాంతికి మూలకారణమవుతుంది.

ఈ రాగనందనం ఇంకా ఇంకా పెరిగి విస్తరిల్లి దీని వూడలు దేశమంతటా పరచుకుని దేశోన్నతికి సౌభాగ్యానికి- సుభిక్షతకు ప్రతీకలుగా నిలబడాలని ఆశిస్తూ

ఇటువంటి సత్కార్యాన్ని తలపెట్టిన ప్రొఫెసరు మూర్తిగారికి, వారి శిష్యులకు మరోసారి అభినందనలు అందజేస్తూ ఇంతటితో సెలవు కోరుతున్నాను"

అన్న మదర్ థెరిస్సా మాటలకి చప్పట్లు మారుమోగాయి!

దేవదుందుభులు మోగినట్లు-

పుష్పవృష్టి కురిసినట్లు-

అనిపించింది ప్రొఫెసరుగారికి.

అమృతపుజల్లు వర్షించినట్లు అనిపించింది అందరికీ.





# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని పాఠకులకు కల్పిస్తోంది 'చతుర'. పాఠకులు 'చతుర' నవలపై ఏ నెలకానెల తమ అభిప్రాయం వెల్లడిస్తూ, ఆ నవల ఎందువల్ల తమను ఆకట్టుకుందో, లేదా ఎందువల్ల ఆ నవల తమకు నచ్చలేదో వివరిస్తూ, రచన బాగోగుల గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మళ్ళీ చెప్పకుండా అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ సమీక్షలు రాయటం మంచిది.

1. సమీక్ష'' అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏనెల నవల సమీక్షలు ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవర్‌పై **చతుర సమీక్ష కు** అని పేర్కొని, ఎడిటర్ 'చతుర', ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడా, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో తొలి మూడింటికి రు. 100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

పాఠకులు నవలతోబాటు 'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతురప్రపంచం, చతుర కథలు, ఫీచర్లు వంటి ఇతర అంశాలపట్ల కూడా తమ తమ అభిప్రాయాలు, సలహాలు, సూచనలు కూడా విడిగా వేరే కాగితంపై రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలచాం.

## కూపన్

డిసెంబర్ 'చతుర' నవల 'రాగాన్వేషణ'

సమీక్షకుని పేరు:............................................

చిరునామా: ............................................

............................................

............................................

............................................

# రచయితలకు సూచనలు




- ★ ''చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలుకాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. ''చతుర''లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో మీ వ్రాత దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.
- ★ ఈ ప్రకారం ''చతుర'' కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.
- ★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.
- ★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగుపోస్టేజీని జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.
- ★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.




# సిక్సర్ తెచ్చిన సిరి!

ఇండియా, పాకిస్తాన్‌ల మధ్య జరిగిన వన్‌డే పోటీల్లో చివరి రోజున జావిద్ మియాందాద్ కొట్టిన చివరి సిక్సర్ పాకిస్తాన్‌కి ఆస్ట్రేలియన్ కప్పును సాధించటమేగాక వ్యక్తిగతంగా అతనికెన్నో లాభాల్ని చేకూర్చింది.

గల్ఫ్ దేశపు ధనికులు సుమారు నలభై అయిదు లక్షలు విలువ చేసే బహుమతులు ఈ విజయాన్ని పురస్కరించుకొని అతనికి బహూకరించారు. ఈ నగదు బహుమతులే గాక మెర్సిడెజ్ బెంజ్‌కారు, హోండా మోటార్ సైకిల్ కూడా జావిద్‌కి కానుకగా ఇచ్చారు. కరాచీలోని అతి పెద్ద దుకాణపు యజమాని తన షాపులోని ఎన్నయినా వస్తువుల్ని ఓరోజు వచ్చి పట్టుకెళ్లమని జావిద్‌ని కోరాడు.

పాకిస్తాన్‌లోని హబీబ్ బాంకులో పని చేస్తున్న జావిద్‌కి ఆ బ్యాంకు ఉపాధ్యక్షుడి పదవి లభించింది. ఆ సిక్సర్ కొట్టడానికి జావిద్ ఉపయోగించిన బ్యాట్‌ను వేలం వేయగా అది 5 వేల డాలర్లకు అమ్ముడుపోయింది. ఒకే ఒక సిక్సర్ అతనికి ఇన్ని విధాల గౌరవమూ, పేరు ప్రఖ్యాతులూ, విలువైన వస్తువులూ, లక్షల నగదూ తెచ్చిపెట్టిందంటే మరి క్రికెట్ మోజు పెరగక ఏమవుతుంది!





# పోస్టల్ వ్యాపారం

ఉత్తరాలని పోస్టులో పంపటంకూడా ఓ పెద్ద వ్యాపారమైపోయిందీ రోజుల్లో. బొంబాయిలోని రెండు కంపెనీలద్వారా లక్షల రూపాయల్లో సాగుతున్న ఈ "మాస్ మెయిలింగ్ బిజినెస్" చురుగ్గా అభివృద్ధి చెందుతోంది.

మనదేశంలో మొదటిసారి మాస్ మెయిలింగ్ బిజినెస్‌ని బొంబాయికి చెందిన సునీల్ నయ్యా ప్రారంభించాడు. ఈ పథకంవలన వ్యక్తులకి ప్రయోజనం వుండదు. వారు భరించలేరు కూడా. పెద్దపెద్ద కంపెనీలు వార్షిక నివేదికల్నీ డివిడెండ్ వారంటుల్నీ పోస్టుచేయటం శ్రమతోకూడిన వ్యవహారం. ఈరకం సర్వీస్‌వల్ల వారికెంతో సమయం ఆదా అవుతుంది.

అయిదేళ్లక్రితం వరకు మనదేశంలో ఈ వ్యాపారం లేదు. ఎంత పెద్దకంపెనీలైనా, మెయిల్ ఎంత ఎక్కువగా వున్నా తామే పోస్టుచేసుకునేవారు. ప్రెస్‌వారికే ఆపనికూడా అప్పగించిన సందర్భాలూ వున్నాయి.

కొందరు బ్రోకర్లు ఈ మెయిలింగ్‌పని చేయటం కాలేజి విద్యార్థిగావున్న సునీల్ చూశాడు. ఆ బ్రోకర్లు ఒక్కోసారి అయిదువేల కవర్లను కూడా పోస్టింగు చేయటం జరిగేది. అయినా వారిది చిన్న కాంట్రాక్టు మాత్రమే.

ఈ వృత్తి పైకి కనబడుతున్నంత సులభమైందకాదు. విసుగు కలిగించే పనేగాక ఓపికతో చేయటం చాలా అవసరం. మెయిలింగ్ కంట్రాక్టరు షేర్‌హోల్డర్ల చిరునామాలు, పోస్టుచేయవలసిన మెటీరియల్ క్లయింట్లనుండి తీసుకోవాలి. కవర్లు అడ్రసుల్తో సహా తయారుచేసి రిపోర్టుల కాపీలు డివిడెండ్ వారంట్లు ఆ కవర్లలో పెట్టాలి. అడ్రస్‌లు చెక్‌చేశాక మెయిల్ పోస్టాఫీసుకి తీసుకువెళ్తారు. రాష్ట్రాల పోస్టుల్నీ పట్టణాలకి వెళ్లవలసిన పోస్టుల్నీ రాజధానులకు వెళ్ళే పోస్టుల్నీ విడివిడిగా ముందే విభజించి పెట్టుకుంటారు.

సునీల్ నిర్వహిస్తున్న మాస్ మెయిలింగ్ సర్వీస్ కంపెనీలో సుమారు నలభైమంది పనివారున్నారు. ఇక్కడ వెయ్యి కవర్లకు 75 రూపాయలు వసూలుచేస్తారు. గత కొద్ది సంవత్సరాలుగా వివిధ సంస్థల షేర్‌హోల్డర్ల సంఖ్య గణనీయంగా పెరిగింది. ఆ ప్రోత్సాహంతో ఈ మెయిలింగ్ బిజినెస్ చురుగ్గా సాగుతోంది. రిలయన్స్, గ్లాక్సో, ఫిజర్‌వంటి దాదాపు ఇరవై సంస్థలకు సంబంధించిన పోస్టల్ పనులను సునీల్ చూస్తున్నాడు. సునీల్ కంపెనీ అయిదు నుండి ఆరులక్షలదాకా కవర్లను ప్రతినెలా పోస్టుచేస్తారు. అతని కంపెనీకి ఇరవైలక్షల కవర్లదాకా పోస్టుచేయగల సామర్థ్యం వుంది.




# నాన్నే అమ్మయితే?

రాబోయే శతాబ్దంలో తండ్రే తల్లిగా మారబోతున్నాడు. తొమ్మిది నెలలు మోసీ, కనీ, పెంచాను అని తల్లిలాగే తండ్రి కూడా అనే అవకాశాలు కనిపిస్తున్నాయి. 'టెస్ట్‌ట్యూబ్' బేబీని కనుగొన్న డాక్టర్ పెట్రిక్‌స్టెప్టో, అమెరికాకు చెందిన డాక్టర్ జాన్‌మానిల సంయుక్తకృషి ఫలితంగా సైన్సు సాధించిన ప్రగతిలో ఒకభాగమే పురుషుడు పిల్లల్ని కనే ప్రక్రియ.

1960లో డాక్టర్ సెసిల్ జాకోబ్సన్, డాక్టర్ రాయ్ హెర్ట్స్‌లు ఆడగొరిల్లా గర్భంలోని పిండాన్ని తీసి మగగొరిల్లాలో నిక్షేపించారు. ఆ పిండం దినదినాభివృద్ధి చెంది దర్జాగా పెరిగింది.

పురుషునిలో పిండాన్ని ప్రవేశపెట్టక ముందూ, తరువాతా అతనికి స్త్రీహార్మోను ఇంజక్షనులిస్తారు. దాంతో ప్రత్యేక రసాయనాలు పురుషుని శరీరంలో అభివృద్ధిచెంది పిండం పెరుగుదలలో తోడ్పడుతాయి. స్త్రీ గర్భాశయంలోని టిష్యూని మగగర్భంలో ప్రవేశపెట్టే పద్ధతివలన ఆపిండానికి సరైన వాతావరణాన్ని కల్పించవచ్చున్న అభిప్రాయాన్ని కొందరు నిపుణులు వ్యక్తం చేశారు. బిడ్డను కంటున్న పురుషుడు పురుష సహజమైన తన స్వలక్షణాల్ని కఠినత్వాన్ని త్యాగంచేస్తే తన లోపల పెరుగుతున్న బిడ్డకు సహజమైన వాతావరణం కలుగుతుంది.

పశ్చిమ దేశాల్లో చాలామంది మగవాళ్లు ఈ పద్ధతిలో పిల్లల్ని కనడానికి ఉత్సాహపడుతున్నారు. అనివార్యకారణాలవల్ల గర్భంధరించలేని భార్యలున్న పురుషులకీ వార్త అమృతతుల్యమే అయింది. స్త్రీ పాడగిట్టని ప్రవరాఖ్యులు తామే పిల్లల్ని కంటామంటూ ముందుకొచ్చారు.

టెస్ట్‌ట్యూబ్ బేబీ విషయంలో సైన్సు సాధించిన ప్రగతి వేసిన మరోముందడుగే ఇలా పురుషునికి మాతృత్వార్హతని ప్రసాదిస్తోంది. అమెరికాలోని ఫ్లోరిడాలో పురుషుని కడుపులో పెరిగిన శిశువు క్షేమంగా జన్మించింది కూడా.

కానీ ఇలా పురుషులు మాతృత్వాన్ని స్వీకరించడాన్ని కొన్ని వర్గాలు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. లక్షలాది పసివాళ్లు నిత్యం ప్రపంచమంతటా ప్రాణాలు విడుస్తుంటే, వారిని కాపాడుకోవలసిందిపోయి, ఈవిధంగా విజ్ఞానాన్నీ మేధాశక్తినీ, డబ్బునూ దుర్వినియోగపరచటం వంటి పిచ్చిపనులు మానుకోవాలనీ, వరల్డ్‌హెల్త్ ఆర్గనైజేషన్ చొరవతో భద్రతాచర్యల్ని తీసుకోవాలని వీరు విజ్ఞప్తిచేశారు.



# పశు, పక్ష్యాదుల స్వర్గం!

"యకోహామా" అనేది జపాన్‌లోని అపూర్వమైన ఓ పశువుల ఆసుపత్రి. ఇది జంతువుల పాలిటి స్వర్గమేనంటే అతిశయోక్తికాదు.

ప్రపంచంలోని ఏ మూలనుంచైనా వ్యాధిగ్రస్తమైన పశువును ఈ ఆసుపత్రికి చికిత్సకోసం తీసుకువెళ్ళవచ్చు. హాస్పిటల్‌వారే ఆ తరలింపు కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. ఈ హాస్పిటల్లో జంతువుల చికిత్సనిమిత్తం అత్యాధునిక పరికరాలు, అల్ట్రామోడర్న్‌స్కానర్లు, ఐసోటోపులు, ఎక్స్-రే మిషిన్లు ఉన్నాయి. మానవాళికి సైతం ఇంకా పూర్తిగా అందని సునిశిత పరికరాలు ఈ ఆస్పత్రిలో ఉండటం విశేషం. ప్రఖ్యాతి చెందిన పశువైద్య నిపుణులు ఇక్కడ తమ సేవల్ని వెచ్చించి ఎలాంటి రోగాన్నైనా మాయం చేస్తారు.

ఈ హాస్పిటల్‌ను 1971లో స్థాపించారు. దీని చుట్టూరా ఉన్న వాతావరణం చాలా ఆహ్లాదకరంగా, ప్రశాంతంగా ఉంటుంది.

ఈకలు, రెక్కలు ఊడి గాయపడిన పక్షులకు ప్రత్యేకమైన క్రీం, ఆయింటుమెంట్లతో ఉపశమనం కలిగిస్తారు. పాలిథిన్ బ్యాగ్‌చికిత్సా పద్ధతిలో పక్షులు చాలా త్వరగా కోలుకుంటాయి. ఆ హాస్పిటలు డాక్టర్లు పక్షులకు, పశువులకు చాలా నియమబద్ధమైన ఆహారాన్ని నియమిత వేళల్లో ఇస్తుంటారు. నర్సులు స్వయంగా చిన్న చెంచాలతో పక్షులకి ఆహారం తినిపిస్తూంటారు.

విరిగిన కాళ్ళతో, ముక్కులతో తీవ్రంగా గాయపడి ఈ హాస్పిటల్‌లో చేరిన పక్షులకు, జంతువులకు వెంటనే ఎక్స్-రే తీస్తారు. వాటిని హాస్పిటల్‌కి తేలేని పరిస్థితులెదురైతే వెంటనే పోర్టబుల్ ఎక్స్-రే తీసుకుని అది ఉన్నచోటుకే వెళ్ళి ఎక్స్-రే తీసి చికిత్స ప్రారంభిస్తారు.

ఈ పశు, పక్షిరోగుల గుండె తీవ్రత ఎలా ఉందో కనుక్కునేందుకు డాక్టర్లు ఓ కొత్తరకం స్టెతస్కోపును ఉపయోగిస్తున్నారు. అలా వైద్యుల సంరక్షణలో కొన్నాళ్ళు గడవగానే పక్షులకు రోగాలు తగ్గి రెక్కలు విప్పి ఎగిరే సత్తాను పుంజుకుంటాయి. అప్పుడు వాటిని వినీలగగనంలో విడిచిపెడతారు. మరికొన్నింటిని జంతు ప్రదర్శనశాలల్లో పెట్టటమూ జరుగుతుంది. మరికొన్ని కోలుకున్న పశు, పక్ష్యాదుల్ని ధనికులు దత్తత తీసుకుంటారుకూడా. ఈ హాస్పిటల్ వర్గాలవారు వీటి నిమిత్తం ఒక అంబులెన్స్‌నుకూడా నడుపుతున్నారు. చికిత్సకికూడా అందనంత దీర్ఘవ్యాధితో బాధపడుతున్నవాటిని హాస్పిటల్ ఆధీనంలో ఉన్న అడవిలో విడిచిపెడతారు. కొన్ని జంతువులు హాస్పిటల్ సిబ్బందితో స్నేహాను బంధాల్ని పెంచుకుని వారి మెప్పుల్నిపొందుతాయి. హాస్పిటల్లోనివారంతా ఏటా సెప్టెంబరు 23న మరణించిన పశుపక్షుల ఆత్మశాంతి కోసం మౌనం పాటిస్తారు. ★

కవర్‌పేజీ ఫొటోగ్రాఫర్: ఎస్.ప్రసాద్




జీవితాంతం తోడు నీడగా కష్టసుఖాలు పంచుకోవలసిన భార్యకు ప్రేమాదరాలు పంచవలసింది పోయి ఆమెను ఆత్మహత్యకు ప్రేరేపించేలా ద్వేషించి, హింసించే భర్తలు...

కోడళ్ళంటే కట్నంతోసహా వచ్చే బానిసలనుకుని, అడుగడుగున పీడించి తిండీతిప్పలు పెట్టకుండా మాడ్చి పుట్టింటినుంచి స్కూటర్లూ, కార్లూ తెమ్మనే అత్తమామలు...

...పాతరోజుల్లోనే కాదు ఇప్పుడూ ఉన్నారంటూ అత్తింటి ఆరళ్ళను ఆడపిల్లల హ[illegible]వనను, వారినికన్నవారనుభవించె నరకాన్ని స్పష్టంగా చిత్రించారు 'రక్తం కార్చిన కాటుక కళ్ళు'లో రచయిత యం. విశ్వనాథ్.

జనవరినెల **చతుర** లో చదవండి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

CHATURA Telugu Monthly, Regd.No. H/HD/402
Hyderabad-500 004,

